ప్రకృతి గ్రంథమాల.

# ప్రౌఢ ప్రభాకరము.



గ్రంథకర్త,

డాక్టరు ఇ. డి. బ్యాబిటు, యం. డి.

అనువాదకులు,

డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య, యన్. డి.





ప్రకాశకులు:

ప్రకృతి కార్యాలయ ట్రస్టు,

బెజవాడ.

1934.

వెల రు 2-0-0]   [ప్రకృతి చందాదారులకు రు 1-8-0

బెజవాడ ప్రకృతి కార్యాలయట్రస్టువారిచే
ప్రకటింపబడిన

# వివిధ ప్రకృతిచికిత్సా గ్రంథములు

## సూర్యకిరణ చికిత్సా గ్రంథములు

1 సునిశిత వైద్యము, 2 ప్రోథపరిభాకరము, 3 వర్ణచికిత్స
4 వర్ణవైద్యమంజరి 1 భాగం, 5 డిటో రెండవభాగము.

## జలచికిత్సా గ్రంథములు

1 తొట్టి వైద్యము, 2 లక్ష్మణజలచికిత్స, 3 నైపీయజలచికిత్స
4 తొట్టిస్నాన నియమములు, 5 ధారాచికిత్స, 6 వేడినీ
కూనేమహర్షి బోధ. 9 జలచికిత
స్త్ర గ్రంథములు
2 ఆహారము 1 భాగం. 3 డిట
లని ప్రయోజనములు, 5 తె
నీరు విషతుల్యము, 7 జంబీరచికిత
రుద్ధాహారమిశ్రమము, 9 ఆహ
మినియం పాత్రలు, 11 భో

ఖండనములు
ము, 3 మహారోగము, 4
రోగాకువలన ప్రమాదము
ములు, 7 టీకాలు వేయర
సారాసీసా, 9 ఔషధ
10 అల్యూమినియం పాత
తెల్లచక్కెరవలని విపత్తు.

బెజవాడ ప్రకృతి కార్యాలయట్రిస్టువారిచే
ప్రకటింపబడిన

# వివిధ ప్రకృతిచికిత్సా గ్రంథములు

## సూర్యకిరణ చికిత్సా గ్రంథములు

1 సునిశిత వైద్యము, 2 ప్రాథపరిభాకరము, 3 వర్ణచికిత
4 వర్ణవైద్యమంజరి 1 భాగం, 5 డిటో రెండవభాగము.

## జలచికిత్సా గ్రంథములు

1 తొట్టి వైద్యము, 2 లక్ష్మణజలచికిత్స, 3 నైపీయజలచికిత
4 తొట్టిస్నాన నియమములు, 5 ధారాచికిత్స, 6 వేడినీ



కూనేమహార్షి బోధ. 9 జలచికిత

స్త్ర గ్రంథములు

2 ఆహారము 1 భాగం. 3 డిట
లని ప్రయోజనములు, 5 తె
నీరు విషతుల్యము, 7 జంబీరచికిత
రుద్ధాహారమిశ్రమము, 9 ఆహ
ల్యూమినియం పాత్రలు, 11 భోజ

ఖండనములు

ము, 3 మహారోగము, 4 ప
రోగాకువలన ప్రమాదము
ములు, 7 టీకాలు వేయరా
సారాసీసా, 9 ఔషధవై
10 అల్యూమినియం పాత్ర
తెల్లచక్కెరవలని విపత్తు.

# ప్రౌఢప్రభాకరము

## 1–2 భాగములు (170 పుటలు)

గ్రంథకర్త:

డాక్టరు ఇ. డి. బ్యాబిట్, యం. డి.

అనువాదకులు:

పుచ్చా వెంకట్రామయ్యగారు.

ప్రకాశకులు:

ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.

1929



వెల. 2—0—0
ప్రకృతి చందాదారులకు. 1—8—0

# అనుక్రమణిక

☞ —గీతకు పూర్వమున్న అంకెలు కిరణసంఖ్యను, గీతకు తరువాత నున్న అంకెలు పుటసంఖ్యను తెలియజేయును.

# ప్రౌఢప్రభాకరము

సూర్యకిరణ చికిత్సావిధానమును కనిపెట్టిన డాక్టరు ఇ. డి. బ్యాబిట్, యల్. యల్. డి. యం. డి. గారి గ్రంథముల ననుసరించి యీ గ్రంథము డాక్టరు పుచ్చా వెంకటాద్రియ్యగారిచే వ్రాయబడినది. మా పాఠకులకు చికిత్సకులకు సూత్రభాగముకంటె చికిత్సాభాగము మిక్కిలి యవసరముగనున్నదని తెలుపుటవలన బ్యాబిట్ గారి "ప్రిన్సిపల్సు ఆఫ్ లైట్ అండు కలర్" అను గ్రంథమునందలి సూర్యకిరణచికిత్స "క్రోమోతీరాప్యూటిక్సు" అను సారవయధ్యాయము ననుసరించి కొన్ని కిరణములు వ్రాయబడినవి. ఈ చికిత్సావిధానమును గూర్చి యియ్యది సంపూర్ణమగు ప్రమాణ గ్రంథముగ దగియుండును.

—ప్ర॥ ప॥

## 1వ కిరణము

### —* రంగుయొక్క రోగనివారకశక్తి *—

ప్రపంచమునందలి సకలపదార్థములును రంగులమూలమున తమశక్తులను ప్రకటించుచున్నవి. ఈసత్యము నూతనగాగొని సరియైనట్టియు, శ్రేష్ఠమైనట్టియు వస్తుతత్వశాస్త్రమును విరచింపనగును. నిర్ణీతఫలితముల నొసంగునట్టి గణితశాస్త్రమువంటి సుస్థిరప్రమాణయుత చికిత్సాశాస్త్రమును నిర్మింపవచ్చును. సూర్యకిరణ చికిత్సాసిద్ధాంతముద్వారా మిక్కిలి స్థూలపదార్థములగు ఖనిజములయందలి రోగనివారకశక్తులను, శాకప్రపంచమునందలి రోగనివారకశక్తులను, జలము,

వాయువు, విద్యుత్తు, కాంతశక్తి మున్నగు సూక్ష్మతర పదార్థములయందలి రోగనివారకశక్తులను, సూర్యప్రకాశము నందలి సూక్ష్మతమములగుశక్తులయొక్క రోగనివారక సామర్థ్యమును విమర్శించి తెలిసికొనగలము. సూర్యకాంతి వాస్తవముగా స్వర్గీయ వస్తుతత్వశాస్త్రమైయున్నది. ఈకాంతిని స్వాధీనపరచుకొని యుపయోగించుకొను మార్గమును తెలిసికొందుమేని స్థూలపదార్థములకంటె సూర్యప్రకాశమే నిరపాయకరమును, గుణవత్తరమును సుస్థిరమునునైనదని గ్రహింతుము. [సునిశితపదార్థములకు సునిశితశక్తులుండుట ప్రకృతి స్వభావము. సునిశితమగు సూర్యకిరణము సునిశితమగుశక్తి గలిగియుండుటవలన రోగనివారణము చేయుటయందు రసవిష పాషాణ గంధకాదులతోడను, నేలవేము, నేపాళము, వసనాభి మొదలగు నోషధులతోడనుకూడి అనిశ్చితమును, విశేషాపాయయుతమునునై యుండు నౌషధవైద్యమునకంటెను, సూర్యకిరణచికిత్సయే శ్రేష్ఠతరమును నిశ్చితఫలప్రదమునునై యున్నది.]

## 2 వ కిరణము.

—* { రోగనివారక పదార్థముల యొక్క సూక్ష్మతరతమ తారతమ్యము. } *—

ఋణజాణువులు చాలభాగము వాతావరణమునందు తేలియుండలేనంత స్థూలములుగనుండుటవలనను, అందుచేత భూమిలోపలనే పృథ్వీపదార్థముల మధ్య నిమిడియుండుట

వలనను ఖనిజములు ప్రకృతిశక్తుల శ్రేణియొక్క క్రిందిభాగము నాశ్రయించియున్నవి. ఒక విచిత్రమైనట్టియు, చమత్కారమైనట్టియు పద్ధతివలన సూర్యప్రకాశమునందును, వాతావరణమునందును నుండు బొగ్గుసారము, మరికొన్ని సూక్ష్మతరపదార్థములు ఖనిజములనుండి వేరుచేయబడి శాకముల లోనికి చేరుచున్నవి. భూమిలోనుండు పదార్థములు వాని యొక్క స్థూలతమపదార్థమిశ్రమమునుండి వేరుచేయబడి ద్రవ రూపమున చెట్టుయొక్క వేరునందలి సన్నని బెజ్జములద్వారా పీల్చబడి శాకములలో చేరుచున్నవి. పై విధమున పోషణమును పొందుచు శాకవర్గము మానవునకు సహజాహారమగుచున్నది. భూమిలో పెరుగునట్టి ముల్లంగి, బంగాళాదుంపలు, [నీరుల్లి, వెల్లుల్లి, పెండలము, కంద, చామ] మున్నగు వేరుదుంపలు, గడ్డలు వీనికంటె సూర్యప్రకాశమునందలి స్వచ్ఛ ద్రవ్యములను స్వేచ్ఛగా స్వీకరించుచు భూమిమీద పెరుగునట్టి ధాన్యములు, ఫలములు మానవునకు శ్రేష్ఠతరాహారములుగను ఆహారౌషధములుగను నుపయోగించును. శుద్ధిచేయు స్వభావ ముండుటవలనను, చాలినంత యుష్ణము (Thermism) తో గూడిన విద్యుచ్ఛక్తిని కలిగియుండుట వలనను జలము రోగనివారక శక్తికలదై యున్నది. విద్యుత్కాంతయంత్రము జలమువలె కాంతశక్తి మున్నగు విద్యుచ్ఛక్తులను కూర్చుచున్నది కావున నదికూడ వివిధములగు సూక్ష్మద్రవ్యముల నిచ్చుచున్నది. పరిశుద్ధవాయువు తనయందు తేలికగ తేలగల్గినంత ఆవిరిద్రవ్యములు కలదైయుండుటవలనను, పగటివేళ నంతయు సూర్యప్రకాశ సంబంధము కలిగి

యుండు సూక్ష్మవైహాయసముల (Ethers) నిచ్చుచుండుట వలనను జలముకంటె నెక్కుడుగ వైహాయసమిశ్రద్రవ్యముల నీయగల్గియున్నది. బాహ్యప్రపంచమున మనము పొందదగిన సూక్ష్మతమశక్తియంతయు సూర్యప్రకాశమునుండియే వచ్చుచున్నది. సూక్ష్మత్వవిషయమున దీనిని మించునది మహాతపస్సంపన్నులగు మహాత్ములనుండి వెడలు మానసిక కాంతశక్తి ప్రకాశమే (Psycho-magnetic radiation). వైహాయస పరమాణుసిద్ధాంతమును గ్రహింతుమేని సకల పదార్థములును తమయొక్క విచిత్రసారములను, వైహాయసములను నిరంతరము ప్రకాశింపజేయుచుండుననియు, ఏపదార్థములనుండి తాము ప్రవహించుచున్నవో యాపదార్థములయొక్క స్వభావమును కొలదిగనో, గొప్పగనో వైహాయసములన్నియు కలిగియుండుననియు, సూక్ష్మతమపదార్థములు సూక్ష్మతమ ప్రసరణమునే కలిగి యుండుననియు మనకు విస్పష్టముగ గన్పట్టును.

## 3 వ కిరణము

### —*ఎఱ్ఱనిరంగుయొక్క రోగనివారకశక్తి*—

మానవదేహమునందలి వెచ్చనిమెఱుపు (శుద్ధరక్తనాళములగు ధమనులందువలె) ధాతువున కుద్దీపన మొదవించి దాని క్రియను వృద్ధిపరచును. సిరలకు నీలివర్ణమును ముఖవర్చస్సునకు వివర్ణమును (పాలిపోవుటను) కలిగించునట్టి చల్లని నీలధాతువును సామాన్యావస్థకుఁ దెచ్చుటలో రక్తవర్ణము ప్రతిభావంతమైనది. ఓషధులయందలి రక్తవర్ణముయొక్క

తత్వమేగాక ఇతరవర్ణముల తత్వమునుగూడా చక్కగ నిర్ధారణచేయుటకు తోడ్పడునటుల యునైటెడ్ స్టేట్సు డిస్పన్సేటరీ వారియొక్కయు,సుప్రసిద్ధులగు నితరాధికారుల యొక్కయు వాక్యములనిందు బొందుపరచెదను ఈవిషయమును నిర్ధారణ చేయగల్గుదుమేని ప్రకృతియందంతటను రాజ్యము చేయుచున్న యేకత్వమును బట్టిచూచినచో సూర్యప్రకాశమునందలి యేతత్వ మేఫలితముల నొసగుచున్నదో ఆతత్వమెల్లెడల నట్టి ఫలితములనే యొసంగుననియు, సూర్యప్రకాశమువంటి సూక్ష్మద్రవ్యములు మాత్రము స్థూలద్రవ్యములగు మూలికాదులకంటె నెక్కుడు భేదకశక్తిని కలిగియున్నవనియు, క్షేమకరములును, సుస్థిరగుణకరములును ననియు మనము నిశ్చయముగ విశ్వసింపవచ్చును.

1 Balsam of Peru (Balsamum Peruvianum) (మహిసాక్షి, బాలింతబోలు, గుగ్గిలము మొ॥) నలుపుమెఱుపు గలిసిన గోధుమవర్ణము. వేడిగా చేదుగానుండును. మ్రింగినట్లైన గొంతులో గుచ్చినట్లుండి మంటగానుండును. వెచ్చనియుద్దీపకౌషధము. కఫహరము.

2 Cayene Pepper (Capsicum):—(మిరియము, పిప్పలి,శొంఠి మొ॥) పువ్వులు తెల్లగానుండును. పండుసున్నగా మెఱయుచుండును. రంగు ఎఱుపుగను నారింజపండు వర్ణముగను లేదా పసుపుగగాని యుండును. మిరియపుపొడుము మాత్రము సాధారణముగా నెఱుపుగానుండును. అధికోద్దీపక పదార్థము. కడుపులో మంటనుకలిగించును. శరీరమునకు

మెఱుగును, ధమనులకు నుద్దీపనమును గలిగించును. చర్మము నెఱ్ఱపడజేయును.

3 Cloves (Caryophyllus) లవంగములు:- పైనచిక్కని గోధుమవర్ణము, లోపల ఎఱుపురంగు. కారముగానుండును. సువాసనద్రవ్యములలో నెల్ల నుద్దీపనకారి.

4 Bromine (బ్రోమిన్):—ఎఱ్ఱనిద్రవము. పొక్కునట్టియు నుద్రేకింపజేయునట్టియు స్వభావముకలది. నీళ్లుకలిపిపలుచనచేసినచో బలకారి. మూత్రము నధికముగ వెడలించును.

5 Iron (లోహము) Ferric Oxide $Fe_2 O_3$ (ఇనుము లేక ఉక్కు) :—ఎఱ్ఱని రంగుగలది. ఇది చాలవరకు ఎఱ్ఱని రంగుగల లవణములను గల్గించును. Ferrous Tri-Oxide (Fe $O_3$ సారాయివంటి మెఱుపురంగుగలది. లోహము (ఇనుము) తోచేయబడిన పదార్థములన్నియు మిక్కిలి బలకారులు. నాడి వేగముగ గొట్టుకొనును. స్రావముల నధికపరచును. రక్తమునకు రంగును గల్గించు పదార్థమును బెంచును.

6 Red Cedar (Juniperus Verginiana):—ఎఱ్ఱదేవదారు. ఋతుస్రావమున కుద్దీపనము గల్గించును. మూత్రము నధికముగ వెడలించును.

7 Musk కస్తూరి :—పొడుము ఎఱ్ఱగాగోధుమవన్నె గలిగియుండును. ఉద్దీపకౌషధము. ఈడ్పురోగముల నివారించును. రక్తాభిసరణము నధికపఱచును.

8 Ammonium Carbonate $N_4 H_{16} C_3 O_8$ (నవాసార కర్బనితము) :—(Hydrogen) జలవాయువునందలి మెఱుపు తత్వమున ప్రబలముగ నుండును. ధమనులనుద్రిక్తపఱచును.

9 Alcohol($C_2H_6O$)సారాయి (మద్యము):—మద్యము నందలి జలవాయువునందు ఎఱుపురంగు అధిక్యతగలిగియుం డును. హృదయమును ధమనులను (శుద్ధరక్తనాళములను) నుద్రేకపఱచును. నాడీమండలమునంత నెంతగనుదిక్తపఱ చునో, నంతగ కుర్రంగజేయును.

సిరలయందలి రక్తమునకు నీలివర్ణమధికమై, శరీరము మిక్కిలి చల్లనై వాతమును మాంద్యమును వహించినపుడు, ప్రాణవాయువు రక్తమునందలి ఎఱుపురంగు నభివృద్ధి పఱచి, శరీరమును సామ్యావస్థకుదెచ్చి, చైతన్యమును గల్గిం చునని యెల్లరెఱుంగుదురు. డాక్టరు పోంజాగారు ఎఱ్ఱని అద్దముపెట్టి ఎఱ్ఱనిగదిలో కూర్చుండబెట్టుటచేత వాతాధిక్య ముగల ఇరువురు ఉన్మాద రోగులకు ఉత్తేజమును ఉల్లాస మును నతిశయించి మానసికస్తబ్ధత శమించి పరిపూర్ణారోగ్య ముగల్గెను.

# 4 వ కిరణము

## —* ఎఱ్ఱనివెలుగుయొక్క రోగనివారకశక్తి *—

ఎఱ్ఱనియోషధులవలెనే ఎఱ్ఱనిప్రకాశము సూర్యప్రకా శమునందలివెచ్చని ద్రవ్యమైయున్నది. ఇయ్యది ముఖ్యముగ రక్తమునకును కొంతవఱకు నాడులకును వేడిచేయు స్వభా వముకలది. ఉద్దీపనము గలిగించును. ఎఱ్ఱనికిరణములనేగాక పసుపుపచ్చని కిరణములనుగూడ ప్రసరింపజేయగల కొన్నిరక ముల ఎఱ్ఱనియద్దములద్వారా ప్రయోగించబడిన కాంతివలన పక్షవాతమును ప్రచ్ఛన్నములగు నితర కాలికవ్యాధులను

నద్భుతముగ నంతరించును. ఈరంగుచే నివారణమైన కొన్ని వ్యాధుల వృత్తాంతములు డాక్టర్ యస్ పాన్కోస్టుగారు రచియించిన బ్లూ అండ్ రెడ్ లైట్ అనుగ్రంథమునుండి యెత్తి వ్రాయుచున్నాము

1 వ వ్యాధి:—రెండుకాళ్లకు పక్షవాతము

**(Paraplegia, Paralysis of both legs.)**

మాస్టరు 'యఫ్' అనునతనికి 8 సంవత్సరముల వయస్సు. ఇతడు తీవ్రమగు మాంససంతానికవ్యాధి (diptheria) చే పీడితుడై చిరకాలమునకు రోగము తిరుగుముఖమై, స్వస్థతజెందుచుండ నకస్మాత్తుగ రెండు కాళ్లును చచ్చుపడినవి. సంపూర్ణ పక్ష వాతము సంభవించి ఆతడు నడువ జాలకుండెను. బల్లగాని కుర్చీగాని యాధారము లేనిదే నిలువ జాలకుండెను. వానికి తెల్ల నిదుస్తులఁ దొడిగి యాదిత్య పేటిక(Thermolume)యందు ఒక్కొక తడవ కొకటి రెండుగంటలు చొప్పున తీవ్రమగు నెఱ్ఱని వెల్తురులో కూర్చుండ బెట్టితిమి. ఆ యెఱ్ఱని కాంతియందు కూర్చుండ బెట్టినతోడనే వానికి నిద్రవచ్చుచుండెను. బాగుగ చెమ్మట బట్టి ధరించిన దుస్తులు చెమ్మటచేఁ దడియుచుండెను. 3 వారములలో బాగుగానడువ గలిగి 2 మాసములలో పరిపూర్ణారోగ్యమును బొందెను. పిమ్మట రెండు సంవత్సరములు గడిచినను వాడారోగ్యముగ నేయున్నాడు.

2 వ వ్యాధి:—మూడవ దశలో క్షయ

**(Consumption in the 3rd stage.)**

హెచ్ అనునామెకు 35 సంవత్సరములు. ఈమె యొక్క శ్వాసాశయములు రెండును రోగ గ్రస్థములైనవి. ఎడమ

శ్వాసాశయము శ్లేష్మసంబంధమైన రసిచే కప్పబడిపోయినది. కుడిశ్వాసాశయము పైభాగమున గురగురధ్వని గల్గుచుండెను. 24 ఘంటలకు ఒక ½ పైంటుకళ్ళె (కఫము) పడుచుండెను. ఆ కఫము పచ్చగను జిగటగనుండి త్రాడువలె సాగుచు రసి చీముగలసి నురుగువలె పడుచుండెను. అందు గొంతభాగము నీటిలో మునిగిపోవుచుండెను. రాత్రిలయం దధికముగా చెమ్మటబోయుచు, పగలు 11 గంటలకుఁ జలియును, జ్వరమును బుగ్గ లెఱ్ఱబారుటయు గల్గుచుండెను. వారి వంశస్థు లనేకు లీవ్యాధిచే మరణించియుండిరి. ఆమెకు యెఱ్ఱని కాంతిస్నానము రోగముననుసరించి క్రమపఱచి చేయించుటచే 2 వారములలో రోగలక్షణము లన్నివిధములఁ దగ్గనారంభించెను. ఇంకొక వారములో కఫమునందు సగము రసి తగ్గెను. తరువాత క్రమముగ గొంతులో గురగురమను ధ్వనియును పడిశమును తగ్గెను. ఎడమశ్వాసాశయమునందుండి శ్వాసము సక్రమముగా నడువ నారంభించెను. కుడిశ్వాసాశ యాగ్రమునందున్న గురగురధ్వని యంతరించెను. కఫము చక్కగ వెడలిపోవుచుండెను. దగ్గు తఱచుగ వచ్చుట తగ్గెను. వును పటివలె బాధకరముగ నుండకుండెను. ఈలక్షణములు తగ్గుట తోపాటు చలియును, జ్వరమును యెగరొప్పును (dyspnoea) నంతరించి బలమభివృద్ధి గాంచెను. 2½ మాసములు చికిత్స చేసినతరువాత గొంతుక రేగుచుండుటవలన గలుగు స్వల్పమగు కింకదగ్గు (hacking cough) తక్క తక్కినవన్నియు నంతరించెను. తరువాత 1, 2 సంవత్సరము లారోగ్యముగానె యుండెను. గాని పాపమామె తనశక్తినిమించిన మతి పరిశ్ర

మచేయ మొదలిడుటవలన తీవ్రమగు పడిశము గలిగి, యది క్రమముగ న్యూమోనియాగా మాఱి, తుదకామెను మృత్యు సన్నిధికి జేర్చెను.

కడచిన 30 సంవత్సరములనుండి నేను గుదిర్చిన కేసులలో కాలికమగు నిట్టిక్షయరోగ మిట్లత్యద్భుతముగ కుదురుట నేనిదివరకెన్నడు కనివినియుండలేదు. ఆమెకు క్షయ పూర్ణముగ కుదిరెను. ఆమె శరీరమోర్వజాలని యతిపరిశ్రమ చేయకుండినచో నకాలమరణము నొందకుండెడిదె. పైరోగికి తలకు చక్కని నీలికాంతియు దానికి క్రిందుగ (హృదయమునకు) ఎఱుపును, తరువాత కటిప్రదేశమునకు పసుపును, తరువాత కాళ్ళకు ఎఱుపును ప్రసరింపజేసినచో మిక్కిలి గుణకరముగా నుండెడిది.

### 3వ వ్యాధి:—సంపూర్ణకాయశోషణము.

(Complete Physical exhaustion)

"ఆర్" అను నతనికి వయస్సు 40 సంవత్సరములు. వర్తకములో మిక్కిలి శ్రమచేసినందున నకాలమున శక్తియంతయు సుడిగిపోయెను. ధాతుశక్తి నశించెను. ధనసంబంధమైన చిక్కులు గల్గెను. దేహమనస్సులు మిక్కిలిగా గాసినొందెను. కంటినిండ నిద్దుర, కడుపునిండ కూడును కఱవాయెను. ఆకలే లేదు. నిద్దుర పట్టదు. శరీరమంతయు సంపూర్ణముగ శోషించెను. బలక్షయము నాడీదౌర్బల్యము, నీరసము గలిగెను. ప్రకృతి యోర్వజాలక హెచ్చరికలు జేయనారంభించెను. నెత్తి వెనుకవైపున విపరీతమైన బాధలు

అసమగ్రమగు శ్వాస, గుండెదడ, నీరసమగు నాడి, ఆకలి లేమి, మలబద్ధము, సుద్దకట్టు మొదలగునవి కలిగెను. వాని యందుదేరికస్వభావము కాన్పింపనందున వానికి యెఱ్ఱని కాంతి ప్రయోగించిరి. అది యత్యద్భుతముగా పనిజేసెను. మొదటికాంతి స్నానముతోడనే మంచి సుగుణములు కలిగెను. వానికి దేహమనస్సులపై నిది బలవర్ధకౌషధముగ బని చేసెను. దైహిక మానసిక శక్తులు కలిగెను. మనోవ్యాధి తగ్గెను. పనులు జేయగలశక్తి హెచ్చెను. స్నానకాలము నకును స్నానమున కుపయోగింపబడిన తెల్లని, ఎఱ్ఱని యద్దముల కనురూపముగ నుండునటుల కొద్దికాలముతో ప్రారంభించి కొద్దికొద్దిగా వృద్ధిచేయుచు నెఱ్ఱని కాంతిని ప్రసరింప జేయుచుంటిమి. అతడు తన పనులయందు ప్రవృత్తుడై యున్నను త్వరలోనే సుగుణములు కలిగెను. చికిత్సారంభమునుండియు హాయిగ నిద్ర పోవుచుండెను. జిహ్వకు రుచిగ భుజించుచుండెను. మలవిసర్జనము సక్రమముగను పూర్తిగను నగుచుండెను. మూత్ర మారోగ్యలక్షణము కలిగి యుండెను. 3 వారముల చికిత్సతో వానికున్న వ్యాధియంతయు నంతరించెను. మరల వ్యాధి తిరుగబెట్టునను చిహ్నము నయితము కాన్పించలేదు.

4, 5 వ్యాధులు :___కాలికమగు మేహవాతము.

(CHRONIC RHEUMATISM)

సిన్సినాటి యను పట్టణములో సి. డబ్లియు. హంట్ అను నామెకు మేహవాతముచే మోకాలువంగి బిగిసికొనిపోయెను. సమర్థులగు వైద్యులు 8 మాసములు చికిత్సచేసి విఫలు

లైగి. ఆమెను ఆదిత్యపేటికయందు కూర్చుండబెట్టితిమి. మో కాలు శవమునకువలె మిక్కిలి చల్లగానుండెను. మోకాలి మీద యెఱ్ఱనికాంతి ప్రసరింప జేయువరకును చెమ్మటయే కలుగలేదు. ప్రసరింపజేసిన తోడనే రక్తమంతయు నుద్దీప నమునొంది శరీరమంతయు ప్రాణవంతమై ప్రకాశించెను. రెండవ చికిత్స చేయగనే యామె కాలినొప్పిపోయి తిన్నవై పూర్తిగ చాచగలిగెను. నిశ్చయముగ నిది మహాదద్భుతముగ నున్నది. న్యూజర్సిలోఁ వైన్‌లెండు నివాసి ఇ. అను నతనికి మేహవాతమువలన భుజములు బిగిసికొనిపోయెను.

ఎఱ్ఱని కాంతిప్రయోగమునను, శరీరమర్దనమువలనను 2, 3 వారములలో నయమై పరిపూర్ణారోగ్యము కల్గినది. ఆభాగముపై ఎఱ్ఱనికాంతి ప్రసరింపజేయబడినది. మేహవా తపు నొప్పులు మంటలతో కూడియుండెనేని 1, 2 తూరులు మంటలు తగ్గుటకై నీలియద్దము నుపయోగింపవలసి యుం డును. తరువాత ధూమ్రవర్ణపు (purple) అద్దము వాడద గును. (ధూమ్రమనగా నీలమును ఎఱుపును కలిసిన రంగు) ఎఱ్ఱనికాంతి యెక్కువగ వాడుటవలన మంటలు కలిగినయెడల చల్లనిరంగులను కొంతసమయము వాడినచో మంటలుతగ్గును.

## 5 వ కిరణము.

—• ఎఱ్ఱని రంగువలన హాని యెపుడుగలుగును? •—

రక్త వర్ణాధిక్యము కలిగియున్నపుడును, దేహమునందు మంటలతోకూడిన వ్యాధులున్నపుడును, రాగివెండ్రుక లున్న పుడును, ముఖారవింద మెఱ్ఱగానున్నపుడును, జ్వరములున్న

పుడును, ఉద్రేకకరముగ దేహతత్వ మున్నపుడను, ఎఱ్ఱని రంగు వాడరాదు.

ఎఱుపుధాతువుగల లోహజాతి మందులు మంటలతో గూడినవ్యాధులకు వాడరాదు. ఈవిషయమెఱుగక వాడినచో వేడి, దాహము, తలనొప్పి, శ్వాసావరోధము, రక్తపరిసరణ ముద్రిక్త మగుటవలన గలుగు నితరలక్షణములు గన్పించును. రక్తపూరితులై ఉత్సాహవంతులుగ నుండువారు లోహజాతి మందులను సేవించరాదు. ఎఱ్ఱని ద్రవ్యములయందును, వర్ణ ములయందును నీసిద్ధాంతమె వర్తించును. ఎఱ్ఱని వస్తువుల వలన ననేకజంతువులు సయితము ద్రేకమును పొందుట యెల్ల తెఱింగిన విషయమే. ఎఱ్ఱనిప్రకాశ మిట్టి యుద్రేకస్వభావ మును గలిగియుండుట సుప్రసిద్ధము. "చికాగో ట్రిబ్యూ ను" పత్రికకు డా॥ ఎడ్వర్. యక్ హేల్, యం. డి అను వారు వ్రాసిన జాబులోని యీక్రిందిభాగము నెత్తి వ్రాయు చున్నాను:—

"ఒకానొక ఫ్రెంచిదేశపు పిచ్చివైద్యశాలలో నొక నీలికాంతినే గాక నితరవర్ణముల సయితము వాడిచూచిరి. తత్ఫలితములు వినుటకు వినోదకరములుగ నున్నవి. ఎఱ్ఱని రంగు (రక్తవర్ణ) ముద్రేకమును, ఉన్మత్తతను గలిగించునను లోకప్రతీతిని స్థిరపఱచునట్టి గుణముల నొదవించెను. ఉగ్ర స్వభావమును నున్మత్తతయును గలరోగులను యెఱ్ఱనికాంతి యధికముగనుండు గదులలో కూర్చుండపెట్టుటచే వారిస్థితి మరింత ఘోరమైనది. వారి యుగ్రలక్షణము లన్నియు హె-

చ్చిపోయినవి. వీరినే నీలికాంతి యధికముగ గల గదులలో నికి తీసికొని బోయినప్పుడు శాంతమును నెమ్మదియు గలిగి నది. సంధించిన యొక స్త్రీపై యెఱ్ఱనికాంతిని ప్రసరింపజేయు టచే సన్నిపాతము మరింత యెక్కువయ్యెను. నీలికాంతిగల గదిలోనికి తీసికొనిపోవుటతోడనే ఆమె అబ్బా యెంత హాయి గానున్న దనెను. తరువాత కొంత సేపటికి గాఢనిదురం జెందెను. వేడిమి (Thermism) సహజముగ తన యుష్ణగుణములకు సం బంధించినంతవరకు నొక విధముగ నెఱ్ఱని రంగు గలిగించు గుణములనే గలిగించునుగాని యదృశ్యమైనదగుటవలన నది నేత్రనాడిద్వారా మనల బాధింపదు.

డాక్టరు ప్యాణకోస్టుగారిట్లు వ్రాయుచున్నారు—

"పరిమితిని కాలమును నతిక్రమించి, యధికముగ నుప యోగించినచో, నీయెఱ్ఱనికాంతి నాడీమండలము నంతను మిక్కిలి యుద్రిక్తపఱచుటయేగాక అత్యావసరములగు సమ యములలోదప్ప మఱెప్పుడును దీని నుపయోగింపరాదు. మనము నివారింప ప్రయత్నించుచున్న వ్యాధి యెంతబాధకర ముగనుండునో నంత బాధకరముగనుండు ప్రాణాపాయకర ములగు జ్వరములను, నితరవ్యాధులను సయితమిది యొక ప్పుడు గలిగించును. ఇతర వర్ణకాంతులను నుపయోగింపకుండ కేవలము ఎఱ్ఱని కాంతిని మేమరుదుగ నుపయోగింతుము." నిపుణుడగు వైద్యుడున్న నేగాని కేవలము ఎఱ్ఱరంగును వా డుట హానికరమని డాక్టరు పాణకోస్టుగారి యభిప్రాయము. కాని యీహానిని కలుగకుండనే చేయవచ్చును. ఎఱ్ఱని య

ద్దమును మొదట కొన్ని నిమిషములసేపు మాత్రమే వాడుట, శరీరము మిక్కిలి వేడిమిని పొందగనే యెఱ్ఱని యద్దమును తీసి వేసి దానిస్థానములో నీలవర్ణపు అద్దమునుంచుట, లేక తల పైన తడిగుడ్డవేయుట యను పనులవలన ఎఱ్ఱరంగువలని హానిని తొలగింపవచ్చును. సాధారణవ్యాధులలో మాంద్యము కలి గియుండు విషయములలోనెల్ల తలపై నీలవర్ణపు అద్దమును తక్కిన శరీరమంతటిపై ఎఱ్ఱని, తెల్లనియద్దములను నుపయో గించుట శ్రేష్ఠము. ఈగ్రంథకర్తచే కనిపెట్టబడి, శారీరక, రసాయనిక ధర్మముల కనుగుణముగ వివిధరంగులయొక్క మైక్యత కలుగునట్లు నిర్మింపబడిన థర్మాల్యూమ్ (Thermo-lume) (ఆదిత్యపేటిక, ఆదిత్యస్నానోపకరణము) అను యం త్రము ఇంతకంటె నుపయుక్తము.

## 6 వ కిరణము

### పసుపు, నారింజరంగులయొక్క రోగనివారకశక్తి.

నాడీద్రవ్యమునందు పసుపు, నారింజ, యెఱుపు, ధాతువులు చేరియుండుట వలన నాడులు ముఖ్యముగ పసు పురంగుచేతను, కొంతవఱకు నారింజరంగుచేతను, ఉద్రిక్త ములగుచుండును. ఎఱ్ఱరంగుసైతము నాడుల నుద్రిక్తపఱ చును. నాడులను తీవ్రముగ నుద్రేకపఱచు పదార్థములలో కొంచె మెఱ్ఱరంగుగాని, పసుపు, నారింజవర్ణములుగాని యుం డును. లోపలికి పుచ్చుకొనసినపుడు పైవర్ణములతో కూడి యుండుమందులు అన్నాశయముయొక్క నాడీసంహతులకు (అల్లికలకు)ను, రక్తనాళములకును తగినంత చులుకువనమును

ఉత్తేజమును కలిగించి స్వకర్మలయందు ప్రివృత్తములగునట్లు చేసి యన్నాశయమునందలి పదార్థమును శీఘ్రిముగ వెడలించును. కావున నవి (Emetics) వమనకారులు, వాంతిని కలుగజేయునవి యని పిలువబడుచున్నవి. కొన్నికొన్ని మూలికాదులలోని పసుపుధాతువు మిగుల నెమ్మదిగ పని చేయుటవలనను, పేగులదగ్గరకు వ్యాపించి లోపల పదార్థమును వెనుకకు కొట్టివేయుటకు ప్రియత్నింపక పోవుటవలనను సౌమ్యముగ విరేచనమును గావించును. కావున నవి (Laxatives) సుఖవిరేచన కారులనబడును. అవి తీవ్రిముగ పనిచేసినపుడు (Purgatives) భేదిమందు లనబడును. కాలేయమునకును, పైత్యమునకును సంబంధించిన మూలికలు కొన్ని వానిపై బాగుగ పనిచేయును. అట్టిమూలికలు (Cholagogues) పైత్యస్రావకరము లనబడును. మూత్రిపిండములకు చురుకు నొదవించునవి (Diuretics) మూత్రిము నధికముగ వెలువరించునవి యనబడును. గర్భాశయముతో సంబంధము కలిగి దానికి చురుకుదనము నొదవించునవి (Emmenagogues) రజస్రావకరము లనబడును. చర్మగతనాడులకును, రక్తనాళగ్రింధులకును చురుకుబుట్టించునవి (Diaphoretics) స్వేదకారులు, చెమ్మటను కలుగజేయునవి యనబడును. చర్మగతనాడులకుద్రేకము నొదవించి చర్మమెల్ల నెఱ్ఱబడువరకు రక్తమును చర్మమువంకకు లాగునవి (Rubefacients) చర్మము నెఱ్ఱబఱచునవి యనబడును, ముఖ్యముగ రక్తనాళములకు చురుకుదనము నొదవించునట్టి తీవ్రోద్రేకకర పదార్థములలో మెఱుపువర్ణ ముండినను నాడీసంఘమునకెల్ల మూలస్థానమగు

మెదడునకు చురుకు నొదవించునదియు, నాడుల కుద్దీపనము నొదవించు పదార్థములలో ప్రథానమైనదియు పసుపువర్ణమే.

మేదస్సునకు చురుకుదనము నొదవించుట యందు తీవ్రగ పనిచేయునట్టివి (Cerebral Stimulants) మేదోద్దీపన కారులనబడును.

వివిధనాడీక్రియలకు సంబంధించిన మందులను ఆహార పదార్థములను గూర్చిన కొన్ని యుదాహరణము లిచ్చుచున్నాను.

## 7వ కిరణము

—• (Emetics.) వమనకారులు. •—

కొంచెమెఱుపు, నారింజరంగు కలిసిన పసుపువర్ణము.

(1) Indian Hemp (Apocynum cannabinum) లేతగనుండునపుడు దీనియొక్క మూలము పసుపుదాళు కలిసిన గోధుమవర్ణము కలిగి యుండును. కాని ముదిరిన పిదప యెఱ్ఱని గోధుమరంగు కలిగి యుండును. దానిరుచి వగరుగ నుండును. డోకును బుట్టించును. దానిలోపలిభాగము పసుపుదాళుకలిసిన తెలుపురంగుకలిగి యుండును. అది తీవ్రమైన వమనకారియు, విరేచనకారియునై యుండును. ఒక్కొకపుడు మూత్రమును కూడ వెలువరించును. Cannabis Sativa= గంజాయి. Country Cannabis, Sativa=దేశవాళిగోంగూర. సంస్కృతమున విరేచనఫలయని యందురు.

(2) Lobelina $C_{18}H_{23}NO_2$ లొబిలియా (Lobelia) లోని పసుపుదాళుకలిసిన ద్రవపదార్థము మిక్కిలి చురుకుగ

పనిచేయునదై యున్నది. ఇది వమనకారి. అపుడపుడు విరేచనము స్వేదమునున్నగు వానినికూడ వెడలించును. (శూలతో గూడిన ఉబ్బసవ్యాధులకుపయోగింపబడు Lobelia inflata హిందూదేశపు పొగాకుతో చేయబడిన క్షారతుల్యౌషధము.)

(3) Tartar Emetic ($KSbC_4H_4O_7H_2O$)

(సౌవీరము, పొటాసియమ్, ద్రాక్షసారాయములు కలిసి యేర్పడిన లవణము). టార్టార్ లవణము తెల్లగను, పలుకులు పలుకులుగను నుండును. దానియందు యెఱుపు, పసుపు, నారింజరంగులు విస్తరించియుండును. మోతాదుల ననుసరించి యిట స్వేదకారిగను, మూత్రకారిగను, కఫమును వెడలించు నదిగను, విరేచనకారిగను పనిచేయును.

(4) Bloodroot (Sanguinaria) ఈమొక్కయం దంతటను నారింజరంగురసము నిండియుండును. దీని చూర్ణము గోదుమదాళు (కొంచెము గోదుమరంగు) కలిసిన యెఱ్ఱరంగు కలిగియుండును. దీనియాకులు పైభాగమున పసుపుదాళు కలిసిన ఆకుపచ్చని రంగును అడుగుభాగమున పాలిపోయిన రంగును కలిగి నారింజరంగుగల దృఢమైన యీనెలతో కూడియుండును. ఇది ఒగరుగనుండును. వాంతిని కలిగించును. ఉద్రేకమును, వత్తును కలిగించును. శాంగినారియా కెనాడియుసిన్ (Sanguinaria Canadeusis) $C_{17}H_{15}NO_4$ గసగసా,నల్లమందు చెట్టుజాతి మూలిక. ఉత్తేజకము, బలవర్ధకము, క్షారతుల్యము నగు వస్తువు.)

(5) వమనకరౌషధములన్నియు పసుపురంగు, మెఱుపు రంగు కలవై యుండుటచేత నవి కొద్దిగనో గొప్పగనో రక్తముపై, కండరసంహతులపై, నరములపై పనిచేయునని తెలియుచున్నది. కండరములను నిర్మించునట్టి నాడీకేంద్రములపై నీవమనకరౌషధములు తిన్నగగాని వేఱుమార్గమునగాని పనిచేయుననియు, రక్తముగుండ పనిచేసినయెడల వమనకరౌషధములన్నియు కొద్దిగనో, గొప్పగనో శరీరమును కుర్రింగదీయుననియు హార్టుషార్న్ గారు వ్రాసియున్నారు. వమనకరౌషధములు శ్వాసకోశములకును, జీర్ణాశయమునకును సంబంధించిన నాడి (Pneumogastric nerve)

## 8వ కిరణము

విరేచనకారులు—బేదిమందులు.

వీనిలో పసుపు ప్రధానవర్ణము. తీవ్రమైన బేదిమందులలో ఎఱుపు ప్రధానవర్ణము.

(1) Podophyllum or May apple (పోడోపిల్లమ్ లేక మేయాపిల్) దీనియాకు కాడ పసుపుదాళు కలిసిన ఆకు పచ్చనివర్ణము కలిగియుండును. దీనిపండు నిమ్మపండు చాయకలిగి గోధుమవన్నె మచ్చలతో కూడియుండును. దీని చూర్ణము పసుపుదాళుకలిసిన బూడిదరంగు కలిగియుండును. ఇది తీవ్రమైన తిరుగులేని విరేచనౌషధము. కొంచఅకిది ఓకరింతను, వాంతిని కలుగజేయును. నీళ్లవిరేచనములను, పసరువాంతుల కలుగజేయును. పైత్యస్రావకరములు పైత్యరసమును ప్రవహింపజేయును. పైత్యరసము పసుపురంగు లేక

పసుపు, ఆకుపచ్చవర్ణము కలిసినరంగు కలదగుటచే ఆంత్రి మూలమునకు, క్రిందివేగు వీనిలోనికి పైత్యరసము పోవగనే విరేచనమగును.

(2) Senna (Cassia Marilandica) సీమనేలతంగేడు లేక సునాముఖి. దీని పువ్వులు పసుపుపచ్చని బంగారురంగు కలిగియుండును. ఈ పువ్వులలో నొక్కొకదానికి రక్షకపత్రములుగా పసుపురంగు కలిగి కోలగనుండునట్టి యాకులై దేసియుండును. పసుపుపచ్చని యీనెలు గోధుమవన్నె కింజల్కములు కలిగి పది దిమ్మలుండును. ఇది నిరపాయకరమును, నసమర్థమునునగు భేదిమందు.

(3) Colocynth (Colocynthis) వెఱ్ఱిపుచ్చ. దీనిపూలు పండినపండ్లు పసుపుపచ్చనిరంగు కలిగియుండును. పండులోని గుజ్జు తెల్లగ మూలుగవలెనుండును. ద్రవపదార్థములను పీల్చునట్టి వస్తువులను పోలియుండును. ఇది నీళ్ళవిరేచనములను కలిగించునట్టి తీవ్రమైన భేదిమందు.

(4) Copaiba (కోపేయిబా) ఇది సెగరోగముల కుపయోగింపబడునట్టి ఒక దినుసుజిగురు వస్తువు. ఇది వెలవెలబారు పసుపురంగు కలిగి స్వచ్ఛముగనుండునట్టి ద్రవము. ఇది యుత్తేజకము. మూత్రపురీషములను వెడలించును.

(5) Gluten, phosphate of lime, etc. (గ్లూటెన్) ఇది పిండియందలి సారజనకభాగము, సున్నముతో కూడిన భాస్వరలవణములు మున్నగునవి. ధాన్యములపై యుముక

క్రిందనుండునట్టి పసుపుపచ్చనిగట్టి పదార్థము. కొంతవఱకు విరేచనకారి.

(6) Figs [Ficus] అత్తిపండ్లు. వీనిలో పసుపుపచ్చగను, గోధుమరంగుగను నుండునవి శ్రేష్ఠమైనవి. ఇవి పోషకశక్తికలవి. విరేచనకారులు. జిగటగ తీగెలు సాగునట్టి గుజ్జుతో కూడియుండును.

(7) Magnesia [MgO] ప్రాణవాయువుతో కూడిన మగ్నము. మగ్నతేజమునందు పసుపురంగు, ఆకుపచ్చనిరంగు కలిసిన ప్రబలవర్ణము. ఇది విరేచనకారియగు క్షారము.

(8) Magnesium Carbonate ($mg\ Co_3$) మగ్నకర్బ్బనదము. కర్బనము నందును, మగ్నమునందును ప్రబలముగ నుండు పసుపువర్ణము. విరేచనకారి.

(9) Castor Oil [Oleum Ricini] ఆముదము. దీని రంగుపసుపుదాళుగ నుండును. ఇది సౌమ్యమగు విరేచనకారి.

(10) Olive Oil [Oleum Olivae] ఆలివుపండ్లనూనె. ఇది వెల వెల బారు పసుపు వర్ణముగాని, ఆకుపచ్చదాళుకలిసిన పసుపు వర్ణముగాని కలిగియుండును. ఇదిపోషకశక్తి కలది. సౌమ్యమైన విరేచనకారి. ప్రేవులయందు దేరికము కలిగెడు వ్యాధుల కుపయోగించును.

(11) Sulphur గంధకము. ఇదివెలవెలఁబారు పసుపు రంగు కలది. విరేచనకారి, స్వేదకారి.

(12) Magnesium Sulphate (Epsom salt, mg $sO_4$) మగ్నగంధకితము. దీనియందు మగ్నమునందును, గంధకమునందును బలవత్తరముగ నుండు పసుపుపచ్చనివర్ణముకలదు. కాని ప్రాణవాయువునందలి చల్లని నీలికాంతిచే తీవ్రగుణముతగ్గింపబడియుండుటచే నిది సౌమ్యమును నిరపాయకరమును. నగు భేదిమందని పిలువబడు చున్నది. ఇదిచల్లదనము నొదవించును.

(13) Eggs (Ovum) గుడ్లు. వీనిలోని పచ్చని జెన పచ్చిదిగనుండునపుడు విరేచనకారియని తలపబడుచున్నది.

(14) Prunes (Prunum) ఎండురేగు బండ్లు (ఆలుబఖారా) ఇవిపసుపు దాళుకలిసిన గోధుమరంగు లేక నారింజవర్ణముతో కూడిన గోధుమరంగు గలిగియుండును. విరేచనకారులు. పోషకశక్తికలవి.

(15) Peaches ఒకజాతి సీమదొండపండ్లు. వీనిలోనిగుజ్జు పసుపుదాళుగనుండును. సౌమ్యమగు విరేచనకారులు.

(16) Cape Aloes (Aloe) కలబంద. దీనిచూర్ణము ఆకుపచ్చదాళుకలిసిన పసుపురంగు కలిగియుండును. విరేచనకారి.

(17) ఇట్టి యుదాహరణము లెన్నియైన చూపవచ్చును. కాని అంత్రములకు సంబంధించిన నరముల కుద్దీపనము కలిగించుటయందు పసుపుపచ్చనిరంగు యొక్క శక్తిని నిరూపించుటకు పైవిషయములే చాలియున్నవి.

---

ఎఱ్ఱరంగుతోకూడిన మందుల నెక్కుడుగా వాడినచో నవి రక్తమునందలి స్థూలతరద్రవ్యములపై పనిచేసి ప్రత్యేకముగ నాడులయందలి సూక్ష్మతర పదార్థములపై నుపయోగించి నపుడు కలిగెడి గుణములకంటె తీవ్రమైన అపాయకరమైన గుణములు కలుగునట్లు చేయునని తెలుపుట కీక్రింది యుదాహరణముల నిచ్చుచున్నాను.

(18) Gamboge (రేవల్చిన్ని పాలు అనబడు దినుసు) ఇది రేవల్చిన్నినుండి తీసినది కాదు ఇది పగులగొట్టినప్పుడంతటను ఎఱుపుగలసిన నారింజరంగుగానుండి కాంతివంతమైన పసుపు రంగగును. ఇది తీవ్రమగు విరేచనౌషధము. వాంతికరము. పూర్తియైన మోతాదు నిచ్చినచో వికారమును, వాంతిని కలిగించును.

(19) Black Hellebore (Helleborus Niger) కటుకరోహిణి నల్లనిది. పుష్పకాడ క్రిందిభాగమున దోరయెఱుపుగానుండును. గులాబిపూలవంటి పూలబూయును. పుష్పదళములు తెల్లగగాని, లేగులాబిరంగుగగాని యుండును. అపుడపుడు కొంచె మాకు పసుపువర్ణమును కలసియుండును. వేరు పైభాగము నల్లగాగాని, గాఢమైన గోధుమవర్ణముగా గాని యుండి, లోపలిభాగమున తెల్లగాగాని లేబసపురంగుగాగాని యుండును, నాల్కపై వేసినచో వేడిద్రావకములవలె నాలుకమంటను, తిమ్మిరిని కలుగజేయును. నల్ల కటుకరోహిణి తీవ్రమైన నీళ్ళవిరేచనకారి. రజస్రావమును వేగముగ బ్రవహింపజేయు శక్తులనుకూడ కలిగియున్నది. క్రొత్తవేరు చర్మము మీాద వేసి కట్టినచో మంటలుపుట్టి పొక్కును. నలుపురంగు

నకును, ఎఱుపురంగునకును మంటలుపుట్టించు శక్తి కలదనుట
కిది యొక దృష్టాంతము.

(20) Croton oil (Oleum Tiglii) నేపాళపుగింజల
చమురు. లేబపు మొదలు నల్లని యెఱుపుగలిసిన గోధుమరంగు
వఱకు నుండు రంగులను గలిగియుండును రుచివగరుగను,
మంటగను నుండును. తీవ్రవిరేచనకారి మోతాదు నెక్కు-
వగా నిచ్చినచో వికారము, వాంతి, నొప్పియు కలుగును.

(21) Senna (Cassia acutifolia, etc.) సునాముఖి
ఆకులు పసుపుకలసిన యాకుపసపురంగుగానుండును. పువ్వులు
పచ్చగను, పండుధూమముగలసిన గోధుమవన్నెగను నుండును.
కషాయము చిక్కనియెఱుపుగలిసిన గోధుమవన్నెగానుండును.
కొలదికాలము గాలిలోనుంచినచో నీటిలోకరుగని పచ్చని
మస్టు అడుగుకు దిగును. చులుకైనట్టియు క్షేమకరమగునట్టియు
భేదిమందు. ఒక్కొకపు డిది కడుపులో మెలివేసినట్లు నొప్పిని
గలిగించునని చెప్పుచుందురు.

(22) Rhubarb (Rheum) రెవల్చిన్ని. మంచిరేవల్చిన్ని
యెఱుపు గోధుమవర్ణము కొద్దిగాగలిసిన పసుపువన్నె కలిగి
యుండును. దానియందు విరేచనము గలిగించి బంధించుస్వభా
వము కలదు. విరేచనమును గల్గించుగుణముతో బంధించుస్వ
భావము జోక్యము కలుగజేసుకొనదు. బంధమునకు ముందు
విరేచనమగును. స్వీకార్యవయవములకన్న నెక్కుడుగా కండరనర
ములనే యుద్దీపింపజేయునట్లు కాన్పించుచున్నది. దీనివలన పేగు
గులలో నొక్కొకప్పుడు మెలివేసినట్లు నొప్పిగలుగును.

(23) ఇతరపదార్థములయందలి వ్యాపకత్వ ఉష్ణత్వాదు లను మితపటుచియు. చల్లపటుచియు యామ్లములందువలె వీని యందును బనిచేయునట్టి ప్రాణవాయువు $C_4 H_4 K_2 O_6$ అను పదార్థమునం దెంతయున్నదో మనము పరికించితి మేని Potassium tartrate వంటి పదార్థమును లవణయుత ములగు నితరపదార్థములును, ఎఱుపువర్ణమును గలిగించునట్టి పొటాసియద్రవ్యములను గలిగియుండియు సౌమ్యమైనట్టియు చలువచేయునట్టియు భేదిమందుగ నుండుటకుగల హేతువె య్యదో మనము సులభముగ దెలుపగలము.

## 9 వ కి ర ణ ము

—• { ఎఱుపు నారింజవర్ణములతో గూడిన పసుపు కాంతి యొక్క చికిత్సాప్రభావము. విరేచనకారి, ఉద్దీపనకారి } •—

### —•1 మలబద్ధము (Costiveness) •—

నాకచేరీలోని యొక మలబద్ధరోగి పొట్టమీద నేను జూన్ నెలలోపసుపుపచ్చనినారింజగంగుగల—సాధారణముగా పసుపురంగనబడు రంగుగల—యద్దముగుండ సూర్యకాంతిని ప్రసరింపజేసితిని. నిశ్చితస్థానములపై కిరణములను కేంద్రీకరింప గలుగునట్లు అద్దముమీద మఱియొక యద్దపుబిళ్లనుంచి పసు పుకాంతిని క్రమముగా ప్రేగులపైనంతట ప్రసరింపజేసి ముఖ్య ముగా నెడమప్రక్క క్రిందిభాగమున నధోముఖమగు పెద్ద ప్రేగుమీద ప్రసరింపజేసితిని. సాయంత్రము రెండుఘంటలకు

మొదలిడి 10 నిమిషములసేపు కిరణప్రసారము లుగజేయగా 70 భాగల ఉష్ణమే యుష్ణమాపకమువలన సూచింపబడుచున్నను రోగియొక్క శరీరమునిండ చెమ్మటబోసినది. సూర్యకాంతి ప్రయోగానంతరము 5 నిమిషములలో మందుపుచ్చుకున్నవానికివలె కడుపులో గుడగుడలాడి 18 నిమిషములలో నిర్బాధకముగా మలవిమోచనమాయెను. సామాన్యముగా నందటికిని నింతకంటె రెండుమూడు రెట్లెక్కువకాలము పట్టును. నేను కనిపెట్టిన వర్ణకేంద్రీకరణోపకరణమువలన గుణము త్వరితముగను, ననన్యసాధ్యముగను, నిశ్చయముగను గలుగును. లేదా, యెచిక్కని పసుపుపచ్చని యద్దముతోనైనను పనిజరుపుకొనవచ్చును. నేను కనిపెట్టిన పల్లములగు సీసాలతో దేహముపై కాంతిప్రసరింపచేసికొనిన ఇతరోపకరణములు వేనితోడను కల్గనిగుణము కల్గును. ఆసీసాలలోని నీటిని పైన పూయుటవలనను, లోనికిచ్చుటవలనను గూడ మంచిగుణమొదవును.

## — 2 శ్వాసాశయములందు బాధ —

## (Bronchial Difficulty)

ఒకనికి కాలికమైన శ్వాసాశయబాధ యుండెను. వర్ణకేంద్రీకరణోపకరణము (chromo disc) తో నేను తీవ్రమైన సూర్యకాంతిని కేంద్రీకరించి పసుపుపచ్చని యద్దముగుండ శ్వాసాశయములపై ప్రసరింపజేసితిని. నిమిషమునకంటెతక్కువకాలములోనే చర్మమెఱ్ఱబడెను. దినమునకు 15-20 నిమిషముల చొ॥ అనేకదినము లిట్లుచేయగా సతనికసాధారణమైన ప్రాణశక్తిగలిగి మానసికశక్తు లభివృద్ధియై క్రమక్రమముగా శ్వాసావరోధము తగ్గెను.

కేంద్రీకరణోపకరణము లేనప్పుడు పసుపుపచ్చని యద్దముఁను వాడినచో కొంతయెక్కువకాలము పట్టినను గుణముఁ కల్గును. కేవలము సూర్యకాంతినే ప్రయోగించినను కుదురును. కాని యింకను చాలాకాలము పట్టును. ముందు వివరింపఁబోవు పల్లముగలసీసా (chromo - lens) అన్నిటికంటె మిక్కిలి త్వరితముగా పని చేయును.

## —* (3) మల బద్ధము వర్ణోదకముచే కుదురుట *—

## Costiveness cured by charged water etc.

శరీరముపై తిన్నగా పనిజేయుటయందు పసుపు నారింజ వర్ణముల ప్రభావము మనకు తెలిసినది. కాన వర్ణారోపితము (colour charged) చేసిన పదార్థములకు నైతమిదే శక్తియుండునని గ్రహింపవలయును. సాధారణ దీపము, గ్యాస్‌లైటులయందు కర్బనము (carbon) నందలి పసుపు నారింజ రంగు ధాతువులుండుటవలన నాదీపములకు పసుపుపచ్చని యద్దములనుచేర్చి యుపయోగించినచో మిక్కిలి మేలు కలుగును. నేను కొన్నిదినములు మలబద్ధముచే బాధపడి పరుండఁబోవునప్పుడు కిరసనాయిల్ దీపపువెలుగుచెంత తృణమణిరంగుసీసా అఱ ఔన్సుసీళ్ళుపట్టుదానిని 7 నిమిషముల నేపుంచి ఆనీటిని త్రాగితిని. తెల్లవారినవెంటనే రెండు సుఖవిరేచనములయినవి. కొన్ని వారములవఱకు తిరిగి మలబంధము కనుబడనేలేదు. సూక్ష్మతమశక్తులవలనఁ గలుగు చికిత్సాఫలితములు స్థిరస్థాయులై యుండుననుట కిది యొక దృష్టాంతము.

(4) సైరంగుల యొక్క యుత్తేజక, విరేచనకర గుణములు.
**Animating and laxative effects of Do.**

న్యూయార్కులోని ఆల్బనీ 59, కొలంబియా స్ట్రీటు లోనుండు చిత్రికారుడగు ఇ. నోరిస్ గారీ క్రిందిజాబు వ్రాసి యుండిరి:—

"డాక్టరు బాబిటు గారికి:—ప్రియమైన అయ్యా! పసుపుకాంతి యొక్క విచిత్రగుణ పరిశోధనము చేసి తత్ఫలితములం జూచి యాశ్చర్యపడితిని. పసుపురంగద్దము గుండ సూర్యకాంతి ప్రసరింపజేయబడిన నీరు సంపూర్ణమైనట్టి, నావిషయమున తప్పకుండ పనిచేయునట్టి జేదిమందైయున్నది. కొలదిగ సేవించినచో సుఖవిరేచనకారియై, అన్నివిషయములలోను మనోల్లాసకారియై యుండును ఈ సుగుణములుగాక నింకే సుగుణములు కలవో నాకు తెలియదు గాని తెలిసినమట్టుకు తప్పకుండ నది యద్భుతావహమైనది. నా కది గొప్ప వరమై యున్నది. కృతజ్ఞతతో నేను మిమ్ము జ్ఞాపకముంచుకొందును. నేను మంచియారోగ్యముగలవాడనై యున్నాను. పసుపుకాంతియే న న్నిట్లుచేసి కాపాడుచున్నది."

5. మలబద్ధము. **(Constipation)**

ఈస్టు టెన్నెస్సీ కాపురస్తురాలగు నొక నారీమణి నెన్నో వత్సరములనుండి మలబద్ధము చేతను, అనారోగ్యము చేతను బాధపడుచుండ పసుపుగంగు సీసాలలోనుంచి సూర్యకాంతిలో సిద్ధము చేయబడిన నీటిని పానము చేయుమని నేను చెప్పియుంటిని. పిమ్మట నామె తాను పసుపురంగు సీసాలలోని నీటిని పానము చేయుచున్నానని యు, సరియైన రంగుగలసీసాలను తనకు పంపవ

లసినదనియు వ్రాయుచు నీక్రిందివివరమును వ్రాసెను:—"వ రుసగా 5 దినములు విరేచనమైనది. నాకు మిక్కిలి యాహ్లాద ముగనున్నది. మీరు సీసాలుపంపువఱకు నేనూరకుండజాలను". పసుపురంగద్దపుబిళ్ళలు నావద్దనపుడు లేవు. కావున సాధార ణమైన పసుపురంగు సీసాలవాడుకనే విధింపవలసినవాడనైతిని.

## —* 6. మలబద్ధము, మూలవ్యాధి *—

## Costiveness and Hemorrhoids

Household treatment and medical Adviser అను గ్రంథమును రచించినట్టియు, చాలినంత యౌషధవైద్యానుభ వముగలదియు, న్యూయార్కుపట్టణవాస్తవ్యురాలునునగు గృ హిణి వాన్ కోర్టు పసుపుకలిసిన నారింజరంగుసీసాలో తయారు చేసి నేను పంపిన దుగ్ధశర్కర(పాలపంచదార) ను ఒకటి మొద లు మూడుబటాని గింజలంతంత మాత్రలుగా మొరిశానియా కాపురస్తురాలగు గృహిణి వాన్కురేని గారి కుపయోగించిరి. పిమ్మట తత్ఫలితములను గూర్చి యొక జాబువ్రాసి వాన్కురే నిగారొసగిన యోగ్యతాపత్రముతోచేర్చి గృహిణి వాన్కోర్టు గారు నాకు పంపించినారు. ఆ జాబు నీక్రింద ప్రకటించితిని:—

"గృహిణివాన్కురేని తీవ్రమైన మూలవ్యాధిచే మి క్కిలి బాధపడుచుండెను. వైద్యులెందరో బేదిమందు లనేక మిచ్చినారు. బాధయు నీరసము హెచ్చుట తప్ప ప్రయోజ నము లేకపోయెను. మీరు పసుపుకాంతిలో తయారుచేసిన మందు హితముగనుండి నెమ్మదిగను ఆశ్చర్యకరముగను పని చేయుచున్నది" సి. ఎ. వాన్కోర్టు.

ఈ క్రింది జాబు గృహిణివాన్ కురేనిగారిది.

"వాణ్కోర్టుగారికి: — తామిచ్చిన మందు కోరిన రీతిగా గుణమిచ్చినదని డాక్టరు గారికి చెప్పవలయును. మొదట మాత్రకు కొంత యితర సాయ మవసరమైనది కాని 24 గంటల॥ తర్వాత వాడిన మాత్రవలన నే సహాయము లేకుండనే సుఖవిరేచనమైనది. అనేక మాసములనుండియు నే నెఱుగని సౌఖ్యమును నేటిరాత్రి యనుభవించుచు హాయిగా నున్నాను" కఠినమైన మలబద్ధముండుటచే మొట్టమొదట నామెకొసగిన 1 మొదలు 3 బటానీ గింజలంత పంచదార యామెకు చాలలేదు. కఠినమైన మలబద్ధములకు 2 మొదలు 4 పెద్ద చెంచాలనిండు (Table Spoonfuls) పసుపువర్ణారోపితోదకము ప్రతిసారి భోజనాత్పూర్వము మలబద్ధము వదలువఱకును పుచ్చుకొనుచుండవలయును. అవసరమైనయెడల గంటకొకసారికూడ సేవింపవలయును. తీవ్రమైన సూర్యరశ్మి యున్నపుడు ఒకగంటసేపులో జలమును వర్ణారోపితము చేయవచ్చును. నేను మాత్రము సీసాలలోని నీరు ప్రతి 3, 4 దినముల కొకసారి మార్చుచు, సీసాలనెల్లపుడు కిటికీలో వ్రేలాడగట్టి యెండలోనే యుంచెదను. పసుపు నారింజరంగు సీసాలలో తయారుచేసిన నీటిని అనేక వందలమందికిచ్చి పరీక్షించితిని. అందఱికి సమానగుణమే కలిగెను. న్యూయార్కులో నొకకోటీశ్వరునికి మందువలనదక్క విరేచనము కాకుండెను. పసుపు వర్ణోదకము చేవానిబాధలన్నియుఁ దొలగి ధారాళముగా విరేచనమై యానందము కల్గెను. ఆయానందము 1000 డాలర్ల విలువకలదని యతడు నుడివెను.

డును. తెల్లావాలు పసుపుదాళుగా నుండి కారము తక్కువగ నుండును. ఆవాలు సౌమ్యవిరేచనకారులు. ఉడుకబెట్టి కట్టిన యావపిండి మిక్కిలి యెక్కువగా చర్మము నెఱ్ఱబడజేయును.

## 11 వ కిరణము

—°{మేదోద్దీపనకారులు. ఎఱుపు, నారింజవర్ణములు కలిసిన పసుపురంగు కలవి.}°—

(1) Opium. నల్లమందు. ఎఱ్ఱదాళుకలసిన గోధుమ వర్ణము. పొడిచేసినపుడు పసుపుపచ్చని గోధుమవర్ణము కలిగి యుండును. ఇది యుద్రేకకారి. మత్తుపదార్థము (నిద్రావహ ము). నాడియొక్క బలమును, నిండును, వేగమును వృద్ధిచే యును. ఉత్సాహకారి, బుద్ధిశక్తులకు నూతన బలము నిచ్చును. దీనిగుణము మేధస్సునకు విచిత్రబలముతో వ్యాపించి దాని వృత్తుల కుద్రేకము కలుగజేసి మత్తును, చిత్తవిభ్రమమును నైరతము కలుగజేయును. అటుపైనిందుకు ప్రతిక్రియగా నిద్ర కలిగి ఆమీద డోకు, తలనొప్పి, వణుకు కలుగును. చెమ్మట యొకటి తక్క తక్కిన మలములు వెడలకపోవుటయో, కొద్దిగ వెడలుటయో సంభవించును. ప్రేగులలోని మంథనక్రియ మందగించును. ఈమున్నగునవి నల్లమందు గుణములైయున్నవి.

(2) Safforn (Crocus) కుంకుమపువ్వు చిక్కని గా ఢమైన నారింజరంగు కలిగియుండును. కొద్దిగా పుచ్చుకొనిన మనోల్లాసము కలిగి నిద్రపట్టును. ఎక్కువగా పుచ్చుకొని నచో తలనొప్పి, మత్తు, చిత్తవిభ్రమాదులు గలుగును.

(3) Valerian (Valeriana) జటామాంసి. దీని చూ ర్ణము పసుపురంగు కలిసిన బూడిదరంగుగా నుండును.

(4) Sassafras Oil (Oleum Sassafras) శాశ్శా ఫ్రాస్ ఆయిల్. ఇది పసుపు దాళుగనుండి ముదిరినకొలది నెఱ్ఱగ నగుచుండును. ఇది సౌమ్యమగు స్వేదకారి.

(5) Seneka (Senega) సెనేకా. ఇది పైభాగమున కొంచెము గోధుమవర్ణమును, లోపలిభాగమున కొంచెము పసుపువర్ణమును కలిగియుండును. చురుకైన ప్రేరేపకమైన కఫహరమైన మందు. మోతాదెక్కువైనచో నక్కయుల్లిగడ్డ వలె పనిచేసి, తీవ్రముగ వమనములను వెడలించును. ఇది మూత్రపిండములపైనకూడ కొంతపని చేయుస్వభావము కలదై యున్నది.

(6) Buchu (Leaves of Barosma) బుచు. ఇది గోధుమవన్నె కలిసిన పసుపురంగు కలది. పై వస్తుగుణములను కలిగియుండును. ప్రత్యేకముగ మూత్రావయవములపైపని చేయు స్వభావముగల మృదువైన యుద్దీపనకారి. మూత్రము నమితముగ వెడలించును. ఇట్టిమందు లన్నిటివలెనే యిది యును అనుకూల పరిస్థితులలో చెమ్మటను కలిగించును.

(7) Oil of Savine (Oleum Sabinx $C_{10}H_8$) శావిన్ తైలము. ఇది వర్ణరహితముగగాని, పసుపురంగుగలదిగగాని యుండును. దీనియందు జలవాయువు (ఉదజని) నందలి యొక్కనిధాతువు కలదు. ఉద్దీపనకారి. ఋతుస్రావమును జారీ చేయును. చర్మమును శీఘ్రముగ నెఱ్ఱబడజేయును.

(8) Mustard (Sinapis) నల్లావాలు. ఇవి చిక్కని గోధుమవర్ణము కలిగి పైభాగమున స్వల్పముగా ముడుతలు కలిగియుండును. లోపలిభాగమున పసుపురంగు కలిగియుం

కుద్దీపనము నొదవించున దగుటవలన నన్నివిధములగు పక్షవాతములకును, ప్రచ్ఛన్నములగు నాడీవ్యాధులకును తగిన మందై యున్నది.

## 10 వ కిరణము

—* { మూత్రకారులు, స్వేదకారులు, రజస్రావకరములు మొదలగునవి. అధికమైన యెఱుపు రంగుతో కూడిన పసుపురంగు. } *—

ఈరంగు గలిగియున్న పదార్థముల నిదివఱకే చాల వఱకు వివరించితిని. ఇంక కొన్నిటి నీరంగుగల పదార్థముల నుదహరించినఁ జాలును.

(1) Dandelion (Taraxacum) డాన్ డేలియన్. ఇది పచ్చని హేమవర్ణ పుష్పములుకలది. దీనివేరు ముదిరినది పైన లేఁగోధుమవర్ణము కలిగియుండును. లోపల తెల్లగానుండును. లోపలిచేవ లేఁబసపువర్ణము కలదైయుండును. ఇది కొలదిగా బలవర్ధకమును, మూత్రకారియును, విరేచనకారియునునై యున్నది. పైత్యపులిత్తిపై ప్రత్యేకముగా పనిచేయుననికూడ తలంపబడుచున్నది.

(2) Pure Carbonate of Potassium ($CO_3K_2$). $2 \times (H_2O)$ అచ్ఛమైన పొటాసియంకర్బనితము. నీలవర్ణముచేత తగ్గింపబడిన యెఱుపు పసుపువర్ణములు కలిగియుండును. ఇదిమూత్రకారి, క్షారమైనది. ఆమ్లమునకు విరుగుడు.

(3) Potassium Nitrate (Salt Petre, ($NO_3K$) or ($NO_2OK$) ఇది గాఢమైన ఎఱుపు, పసుపు నీలవర్ణములుకలిగియుండును. స్వేదకారి,చల్లఁబఱచుస్వభావముకలది.

ప్రేగులయందలి వేడిచే కలిగిన మలబద్ధమునకు పసుపువర్ణము పనిచేయదు. అప్పుడు నీలవర్ణోదకమును పరుండబోవునపుడు త్రాగుచుండవలయును. ఇట్లు కొన్ని రాత్రులు గడచువఱకు సేవించవలయును. లేదా కాలిజముమీదను, ప్రేగులమీదను పసుపురంగద్దముగుండ సూర్యకాంతిని బ్రసరింప జేయవలయును.

వైద్యుల యొక్క మందులన్నియు నిరర్థకములైన మలబద్ధరోగముల నేకము పసుపువర్ణోదకము పసుపుకాంతి వీని వలన నివారణమైనవి. కఠినమైన మలబద్ధముచే పీడింపబడుచుండి పై వర్ణోదక సేవనమువలన వ్యాధి నివారణము చేసికొనినట్టి కొలంబియా (కాలిఫోర్నియా) కాపురస్తురాలగు ఫానీ లివింగ్ స్టన్ అను నామె యీక్రిందిరీతిని వ్రాసినది:—

“నేనీవర్ణోదకమును జీవామృతమని తలచెదను. పసుపు నారింజవర్ణములు కలిసిన రంగుసీసాలోని నీరు త్రాగి యత్యద్భుతమైన సుగుణములను గాంచితిని. మొదట మూడువారములవఱకు సూర్యుడు సరిగ ప్రకాశింపలేదు. అయినను నేను సీసాను కిటికీలోనే యుంచి మధ్యమధ్య ప్రసరించు ప్రతికిరణమును పట్టగలుగునట్లు చేసి గంటకొకటి రెండు గుక్కలు చొప్పున త్రాగుచుంటిని. ఇపుడు మాత్రము క్రమముగనే జలపానము చేయుచున్నాను. ఎనిమిదిసంవత్సరములనుండి మలమోచనము లేనినాకు సుఖవిరేచన మైనందుకు నేనెంత యానందమును బొందితినో, యెంత కృతజ్ఞురాల నైయున్నానో మీరూహించు కొనవగును.”

ఈపసుపు-నారింజ (Amber) వర్ణోదకము నాడుల

సౌమ్యమగు నుద్దీపనకారి. ముఖ్యముగా నాడీమండలము నుద్దీపింపజేయు గుణముగలది. మోతాదెక్కువైనచో తల బరువు, తలనొప్పి మున్నగు లక్షణముల నొదవించును.

(4) Ether (ఈథర్ అనే ద్రావకము) ఇది రంగులేని ద్రవము. అయినను కర్బనమునందలి, పసుపువర్ణమును, జల వాయువు ($C_4H_{10}O$) నందలి యెఱుపువర్ణమును, నిండు గాఢముగ నున్నవి. ఇది శక్తివంతమును, వ్యాపించునదియునగు నుద్దీపనకారి. కఫమును హరించునట్టి, ఈడ్పును పోగొట్టునట్టి మత్తును కలుగజేయునట్టి గుణములు దీనిలోనున్నవి. ఇది శుద్ధ రక్తనాళవ్యాపారమును వృద్ధిచేసి చిత్తభ్రమను, ఇంద్రియ జ్ఞానక్షయమును కలుగజేసి, స్మృతి తప్పుట మున్నగు లక్షణముల నొదవించును.

(5) పసుపుపచ్చని సీసాలో పోసి పసుపు ఎఱుపు కలిసిన వెలుతురులో నుంచిననీరు. ఇది యీగ్రంథములోని 9 వ కిరణమునందు వర్ణింపబడినట్లు మెదడునకు, నాడులకు, నుద్దీపనము నొదవించును. ఇట్టి గుణమునిచ్చునట్టి మందులవలన తరువాత కలుగునట్టి దుర్గుణములు మాత్రము దీనిలో లేవు. అనగా మందులిటుల నుద్దీపన గలిగించినను తరువాత నాడులను కుంగజేయును. వర్ణోదకమట్లుగాక నిరపాయకరమైనది.

## 12 వ కిరణము

—*{ బలవర్ధకములు. పసుపు ఎఱుపు, ప్రధానవర్ణములు. }*—

**(1) బలవర్ధకౌషధము లన్నిటియందును మెల్లగా, పట్టు విడువకుండ మనుష్యదేహమును, ముఖ్యముగా పోషక, రక్త**

కరవృత్తులకు ప్రేరేపణము నొందవించి బలమును కలుగజేయు స్వభావముండును. ఇట్టి వనేక మిదివఱకే పేర్కొనబడినవి. ఇపు డొక కొన్నిమాత్రమె వర్ణింపబడును. ఉత్తమ బలవర్ధకౌష ధములలో విద్యుత్సంబంధములగు రంగులుకూడా చేరియుం డును. శాకజాతి బలవర్థకములు సాధారణముగా చేదుగనుండి ఆకలిని గలిగించును. క్వైనా, ఇనుము నిక్కిలి ముఖ్యమైన బలవర్థకములని చెప్పబడుచున్నవి.

(2) Quassia (క్వాసియా) ఇది లేబనపురంగు కలిగి యుండును. దీనిపూవు లొక్కొకవు డెట్టిగను నుండును. ఇది మంచి బలవర్థకము.

(3) Gold thread (coptis) గోల్డుత్రెడ్. దీనివేరు హేమవర్ణముగా నుండును. చేదైన బలవర్థకము.

(4) Gentian (Gentiana) శిలాజితుకొయ్య. పసుపు దాళుచూర్ణము, బలవర్థకౌషధము.

(5) Peruvian Bark (Cinchona) క్వైనాచెట్టు. ఇది తెలుపు, ఎఱుపు, పసుపురంగులు వేర్వేరుగ కలిగి మూడు రకములుగ నుండును. జీర్ణాశయము నిూదిభాగము మున్నగు చోట్ల నుష్ణమును ప్రేరేపించును. డోకుబుట్టించి వాంతులను, ఒక్కొకపుడు విరేచనములను కలుగఁజేయును. నాడి తఱచుగా కొట్టుకొనుటను హెచ్చుచేయును. తలలో బిట్టి బిగిసినట్లుం డుట, లేక బరువుగ నుండుట, లేక కొంచెము నొప్పిగ నుండుట చెవులలో ధ్వనిపుట్టుట, కొంత చెవుడుకలుగుట యీ లక్షణములు నాడీమండలముపై నది చేయు పనినిగూర్చి

తెలియజేయుచున్నవి. దీని ముఖ్యసారము క్వైనాయిడమున్నది. ($N_{20}C_{12}H_{2}O$) దీని భాగములైయున్నవి.

(6) Iron. ఇనుము. దీనినిగూర్చి యిదివరకె వర్ణింపబడినది.

(7) Myrrh (Myrrha) గోపరసము. ఇది మెఱుపు కలిసిన పసుపు లేక మెఱుపు కలిసిన గోధుమవర్ణము కలిగియుండును. ఉద్దీపనకారియగు బలవర్ధకము, శ్వాసాశయము పైనను, గర్భాశయముపైనను పనిచేయు స్వభావము కలది.

(8) Ginger (Zingiber) (అల్లము) పసుపు కలిసిన గోధుమరంగు కలిగియుండును. తీవ్రోద్దీపనకారి.

(9) Black Pepper (Piper Nigrum) (మిరియాలు) మిరియముల లోపలి పైపరిన్ అనబడు చురుకైనవస్తువు స్వచ్ఛమైన స్ఫటికములవలె నుండును. సాధారణముగా దొరకునది పసుపుపచ్చగా నుండును. పైపరిన్ యొక్క భాగములు వెర్త్‌మ్‌గారి లెక్కలప్రకారము ($N_{2}C_{70}H_{37}O_{10}$) గానున్నవి. మిరియములు వేడిమిని కలుగజేయునట్టి, వాతమును హరించునట్టి ఉద్దీపనకారులు. శుద్ధ రక్తనాళములలో సాధారణోద్రేకము నొదవించు శక్తికలవైయున్నవి.

## 13 వ కిరణము

—* పసుపువర్ణము హానికరమెపుడగును. *—

1 అదివరకే నాడీమండలము చురుకుగా పనిజేయుచుండి రేగియుండునపుడు పసుపురంగువాడుట యపాయకరము. ప్రచ్ఛన్నమైన, పక్షవాయుసంబంధమైన, మలబద్ధముగల వ్యాధులకు, పడిసెమునకు, కాలికరోగములకు, బండ

బారిన గ్రంథులు మున్నగువానికి యెఱుపుతోఁగూడిన పసుపు రంగు చక్కగా పనిచేయును. కాని జ్వరములు, తరుణమగు మంటలు, సన్నిపాతము, అతిసారము, నాడీబాధ, గుండెదడ, సర్వవిధములగు నుద్రేకములు కలవారి కీరంగులు వాడ కూడదు. డాక్టరు హెల్‌గారి గ్రంథమునుండి వాక్యములను నుదహరించెదను:—

2 "ఆకుపచ్చనిరంగు చిక్కగ నుండనిచో ఉపశమన కారియైయుండును. నల్లనియాకుపచ్చరంగు నల్లని నీలము వంటిది. నలుపెక్కువైనకొలదిని దాని యొక్క యుపశమన కరగుణము క్షీణించునట్లు కన్పట్టుచున్నది. ఆకుపచ్చరంగు నందు పసుపురంగు లేశమైన నుండకూడదు. ఎందువల ననగా ఎఱుపువలెనే పసుపురంగుకూడ పిచ్చివారినాడుల కుద్రేకము నొదవించును. పసుపువర్ణము తమ కుద్రేకమును కలుగజేయుటచే కొందఱు రోగులు పసుపు అద్దములను తీసి వేయుమని నన్ను కోరిరి. నేను వెనుకచెప్పిన చికిత్సాలయము నందు విషాదరోగులుండిరి. వారిలో కొందఱిని నీలవర్ణపు గదులలోను, కొందఱిని ఆకుపచ్చరంగు గదులలోను నుంచి తిమి. రెండు గదులలోనున్న వారికిని రోగము తగ్గకపోగా అధిక మైనట్లుతోఁచెను. పసుపుపచ్చని గదులలోనివారు తమకు సుఖ ముగా లేదని తెల్పిరి. వారికి మఱింత చిరాకుగలిగెను. ఎఱ్ఱరంగు గదులలోను నున్నితమగు ఊదా రంగు (ultra voilet rays) గదులలోను నుంపబడినవారికి మేలు కలిగెను. మిక్కిలి చిక్కని ఊదారంగు కిరణములు నాడీమండలమున కుద్దీపముకలిగించును.

మిక్కిలి చిక్కని యూదాకిరణములను ధూమ్రవర్ణ కిరణములని పిలిచెదరు. ధూమ్రము (ఎఱుపు, నీలము కలిసినరంగు, ఎఱుపు, పసుపు విశేషముగా కలిగియుండునట్టి తీక్ష్ణమైన సూర్యరస్మిసోకిన శిశువులు మిక్కిలి దుర్బలులయ్యెదరు. దంతములు వచ్చునపుడు అస్వస్థులై యుండునపుడును జ్వరపీడితులై యుండునపుడును, మెదడు రోగగ్రస్తమై యుండునపుడును శిశువులు సహజముగా ఎండలోనుండలేక లేచి పోవుదురు. తేలికైన నీలకాంతి, బూడిదవర్ణము వారికి మేలుచేయునట్లు తోచుచున్నది."

(3) ఈవిషయమున డాక్టరు హేలు గారు సావధానమైన పరిశ్రమచేసినట్లు పైవిషయములు బోధించుచున్నవి. కాని యిందు కొద్దిగా మార్చవలసిన విషయములు కొన్ని గలవు. అట్లు మార్చకున్నచో పాఠకులు పొరపాటు పడుట సంభవించును. నల్లని ఆకుపచ్చరంగు, నల్లని నీలవర్ణము వీనిలో యుపశమన స్వభావము లేదని వారు చెప్పిరి. వారు కలుషరక్తపూరితులగు విషాదరోగగ్రస్తుల గూర్చి వివరించినారు. అట్టి వారి కీరంగులవలన మనోవ్యాధి మరింత వృద్ధియై శాంతి చేకూరనిమాట నిజమే. ఇకముందు వివరింప బడబోవునట్లు చల్లని కాంతులన్నియు. (Electrical colors) నుద్రేకించిన మానవ దేహమునకు శాంతినే చేకూర్చును. పై చికిత్సాలయములోని రోగుల యొక్క స్థితిగతులు వారిదేహములలో వారికి నీలకాంతి ప్రతికూలముగ

నున్నదని తెలుపునట్టి కలుషరక్తమధికమగుట చేతను, పసుపు కాంతివలన వారికి కీడు కలిగినదని సూచించునట్టి నాడీదౌర్బల్యము యొక్క యాధిక్యతవలనను విషాదరోగము కలిగినదని తెలియజేయుచున్నవి. ఎపుడెపుడు ఆ రోగులకు పసుపు కాంతి యొక్క రసాయనికానురోగముతో (ఊదారంగుతో తుల్యమైన కాంతితో) సంబంధము కలుగుచుండెనో అపుడెల్ల వారికి మేలే కల్గుచుండెను. డాక్టరు హేలుగారు తలంచినటుల నాడులకు చిక్కని (ultra) ఊదారంగు ఉద్రేకమును కల్గించునదగుటవలన నా మేలు కలుగలేదు. ఇందుకు విరుద్ధముగా వెనుకటి ప్రకరణములలో తెలుపబడినటుల ఊదారంగు ఉపశమనకారియగుట వలననే కలిగినది. వారినాడు లదివఱకే మిక్కిలి యుద్రిక్తములై యుండెను. ఎఱ్ఱని ధూమ్రవర్ణము ( purple) ముఖ్యముగ రక్తమున కుద్రేకమును కలిగించును. రక్తనాళముల యందలి నీలవర్ణాధిక్యమును పోగొట్టగల ఎఱ్ఱనిరంగులోని యుత్తేజకము వారికి మిక్కిలి యావశ్యకము.

ఇందువలననే యెఱ్ఱనివర్ణము వారికంత లాభకరముగా నుండెను. సర్పి లేక చెలిది వ్యాధిపీడితులును, ఉద్రిక్త నాడీమండలము కలవారును హానిబొందకుండ తీక్ష్ణమగు సూర్యరశ్మిని భరింపజాలరని స్వానుభవమువలన తెలిసికొంటిని. ఎఱుపు నారింజ, పసుపు కిరణములు వారికెక్కువగ నుద్రేకము కలుగ జేయునట్లు ఋజువుపడెను. ఒకస్త్రీకి విసర్పిరోగము (Erysipelas) కలిగి నాడీతాపమును ఉన్మాదముకూడ సంభవింపగా తెల్లని యద్దపు వెలుతురులో నుంచిరి. అందువలన నామెరోగము ప్రబలమయ్యెను. తెల్లనికాంతికోడినీలకాంతి సైతము

ఆమెకు మిక్కిలి యుద్రేకము నొదవించెను. నీలవర్ణపుఅద్ద ము చాలయెక్కువ యుపశమనకారిగనుండెను. కాని యామె వాడిన యద్దపు మ్యాజరీన్ (Mazarine) అద్దమైయుండుట వలన నెక్కువ యుద్రేకకరములగు కిరణములు దానినుండి ప్రిసరించుటచే దాని వెలుతురులో నామె యెక్కువకాలముండ లేకపోయెడిది. తక్కిన కిరణములు ప్రిసరింపకుండునట్లు జంట ద్దములను వాడుమని నేను సలహానిచ్చితిని.

(4) నాడుల నుద్రేకించునట్టి పసుపువర్ణధాతువులును వానితో కలసి రక్తము నుద్రేకించునట్టి యెఱుపు వర్ణమును నుండును. గాన ప్రిస్సికామ్లము (Prussic acid) స్ట్రిచ్నైన్ (Strychnine) మొదలగు నతితీవ్రివిషములందెల్ల పసుపు అగ్రివర్ణముగానుండును. లీబిగ్ (Liebig) చెప్పినట్లు స్ట్రిచ్ నైన్ ($N_2 C_{44} H_{23} O_4$) 2 భాగముల నత్రిజని 44 భాగముల అంగా రము 23 భాగముల ఉదజని 4 భాగముల ప్రాణవాయువు తోను జేరి యగును. అంగారమునందలి పసుపు ప్రిధానము గను ఉదజనియందు అధికమగు యెఱుపుశక్తియు గల్గి దానికి ప్రితిపక్షముగా తగినంత శీతకరమగు ప్రాణవాయువు లేకుం డుటవలన వాని యొక్క యుద్రేకకరమైనట్టియు, దహించు నట్టియు స్వభావమునకు ప్రితిక్రియ గలుగుటలేదు. ప్రిస్సికా మ్లమునకు తరువాత విషపుమందుల జాబితాలో స్ట్రిచినియా (Strychnia) మాత్రిమే అతితీవ్రిమగు విషపుమందు కావచ్చు ను. ప్రిస్సికామ్ల మిట్లుండును (CNH) సమభాగములు అంగా రము నత్రిజని, ఉదజని; యిందు అంగారము నత్రిజనులయందలి పసుపువర్ణమును ఉదజనియందలి యెఱుపు వర్ణము మాత్రిమే

యుండి రసాయనిక క్రియయందు సత్రజని యొకింత శీతకరమే యైననుయీ వేడినితగ్గింపగలశీతతత్వము లేదనియే చెప్పవచ్చును. Strychnine స్ట్రిచ్‌నైన్ (Motor Filaments of spiral cord) ను ఉద్రేకపఱచి కంఠనాళసంబంధమైన కండరములం దీడుపును గలిగించును. "హైడ్రోసినిక్ అనగా ప్రిస్సికామ్లము ఉప ద్రవకరమైన మోతాదులనిచ్చిన మేదస్సుమీదను, వెన్ను పాముమీదను పనిజేయును. ఈ విషముచే జంపఁబడగా నేను జూచిన జంతువులన్నియు కెవ్వన అరచి స్మృతినిగోల్పో యి, యీడ్పుగలిఁగి యుండును. ఇవే మూర్ఛకును చిహ్న ములు...చేరరాని పదార్థము చేరుట (Congestion) మూర్ఛకు లక్షణము. మేధస్సు సంబంధమైన క్రియలు తాత్కాలికముగా నాగిపోయి వెన్నెముక యొక్క క్రియలు విపరీతముగా నుద్రే కించును." బెన్నెట్ (Bennet). ప్రిస్సికామ్లము పెద్ద మోతా దులుగా గ్రహించినచో మెరుపు (lightning) వలన పడిపోయి నట్లె రోగి దాదాపు పడిపోవచ్చును.

(5) పసుపువర్ణము నాడులమీద నింతతీవ్రముగా బని జేయును గనుకనే, పసుపు వర్ణముగల యౌషధులు అమితపు మోతాదుల వలన యీడ్పు, సంధి, వాంతులు, తీవ్రమగు భేదులు మొదలగునవి గలుగుట కేమి హేతువో మనమును లభముగా గ్రహింపవచ్చును. కాఫీవంటి సౌమ్యమగు పదా ర్థము నందుసయితము పసుపు తోగూడిన ధూమ వర్ణముం డును కాన నిద్రపట్టక, నాడు లుద్రిక్తమైయుండు తరుణ మగు మంటలతోగూడిన వ్యాధులయందు నిషేధింపఁబడు చున్నది.

డాండిలియన్ (Dandelion) అనునొక జాతికలుపుమొక్క ప్లీహపుల యొక్కయు జీర్ణాశయము యొక్కయు సుద్రి క్తద శయందు గలిగిన చోటులయందు నిషేధింపబడినది. పాద రసము, జాలపు, నల్లమందు, సారాయి మొదలగు పసు పు యెఱుపుతోఁగూడిన పసుపుధాతువులు ప్రధానముగాగల తీవ్రతరౌషధములు యుద్రి క్తనాడీరుధిర (Nervine sanguine) తత్వములు గలవారికి యెక్కువ మోతాదులను వాడినచో నింకను బ్రమాదయుతములగును. కాఫీ పసుపు వర్ణముతో గూడి కొంచెము భేదికరమయినను, దానియందున్న టానిన్ అను విషమునందు సంకోచస్వభావమును, అభిష్యందమలనాపు స్వభావమును గలదు. కాఫీ 5, 10 నిమిషములకన్న యెక్కువ సేపు కాగనిచ్చినచో టానిన్ కషాయములోనికి దిగును. అట్లు గాక 5, 10 నిమిషములే కాగనిచ్చినచో భేది స్వభావము మాత్రముండి యితరములగు దుస్వభావములందుండవు. అట్టి పరిస్థితులందది కేవలము భేదిస్వభావమునే గలిగియుండుట నేనెఱుఁగుదును.

## 14 కి ర ణ ము

నీలము, ఊదావర్ణముల యొక్క రోగనివారక శక్తి. నాడీశమనకరము, శైత్యకరము, జ్వరని వారకము, ఉపశమనకరము.

ఇక శీతకరమును, వైద్యుతములును, సంకోచమునొందిం చునట్టియు శక్తులను గుఱించి ప్రారంభింతము. మిక్కిలి సుని శితమును, చొరబాఱుశక్తిగలట్టియు, నీశక్తులు దాహాయుతము

లును, నాడులుద్రేకించినట్టియు తత్వములను శాంతపఱుచు స్వభావము గలవి. రసాయనానురాగముల వర్ణము లన్యోన్యమ్యముగ సమ్మేళనము నొంది సమతనుబొంది సర్వపదార్థములకును క్షేమకరమైన ఉభయపక్షసమస్థితిని బొందునని వెనుకటి ప్రకరణమున జదివియుంటిమి. ఈ సూత్రము మిక్కిలి విరివిగా నిర్వచింపఁబడినది. కాన యెఱ్ఱని శుద్ధరక్తము అతివ్యాపృతమును, దాహకరమును నగునేని నీలికాంతియో నీలిపదార్థములో అందున్నప్రతి పక్షమునః సమస్థితిని బొందించునట్టియు శక్తిగానుండవల్లయునియు, నల్లే నాడులయందలి పసుపును, కొంతవరకు యెఱుపు నారింజవర్ణములును అమితముగా నుద్రేకించినచో ఉపశమనకరములగు ఊదా, నీలము, నీలిమందు వర్ణము లుపయోగింపవలసి యుండుననియు జెప్పుట యూహామాత్రముగాదు. కపాలము, జీర్ణాశయము, ప్రేవులు, మూత్రపిండముల నాడులకు సయిత మిదే వర్తించును. కపాలాదుల యందలి నాడులయందు, వేడిజేయునట్టియు వ్యాకోచనము నొందించునట్టియు నుష్ణతత్వములవలన క్రమముగా సన్నిపాతము (జన్ని) వాంతులు, అతిసారము, మూత్రాధిక్యతల గలిగించును. శీతవర్ణములన్ను గలిగి శీతకరములును, సంకోచస్వభావముగలట్టియు, పదార్థములవలన మాత్రమె యవి శాంతిని బొందును. అంకగణితమువలె సక్రమముగను, స్పష్టముగనున్న యీసూత్రము చిరకాలమునుండి యున్న వైద్యప్రపంచమున నవలంబింపఁబడుచున్న అనుభవములో జూపగలగా ? ఈ క్రిందవివరింపఁబడిన విషయములవలన వర్ణచికిత్సాశాస్త్రమును సిద్ధాంతముజేసి శాస్త్రనిర్మాణము జేయుటకు వీలగును.

పదార్థములందలి శీతకరమగునీలము ఊదావర్ణముల గలిగించు నట్టి అణువులులోపలనుండి దాదాపు పైభాగముననుండెడి యుష్ణాణువులచేగప్పబడును గాన వానివర్ణములుదాచబడియుం డునుకాని సూత్రిము మాత్రిమట్లేయుండును.

1 Aconite (Aconitum Napellus) వననాభి :—

నలుపుగలసిన యూదావర్ణపుష్పములు. మిక్కిలి నా డీశమనకరము. బాధోపశమనకారి. కపాలదాహమునం దుప యోగింతురు. (విషము)

2 Belladonna (బెల్లడోనా) నల్లఉమ్మెత్త.

ఊదారంగువంటి రంగుగలకాడ. ఆకులు చిక్కని ఘూ దారంగు. లోపల ఊదారంగురసము వేరులోపల తెల్లగానుండి పైన యెఱ్ఱనిగోధుమ వర్ణము గలిగియుండును. పార్సనిఫ్ (Parsnip) అని భ్రిమగలుగును. బాధను పోగొట్టును. ముఖ్య ముగా నాడీ సంబంధమైన బాధలనుఁదగ్గించును. గాఢమైన మత్తు మందు. స్వేదకారి.మూత్రివర్ధకము కనుపాపలుబ్బును.తీవ్రవిషౌ షధము. బెల్లడోనయందు కర్బనిద (carbon) ముండును. కర్బనిదములోనిమెఱుపు పసుపువలన వేడియును నాడీయుద్రేక మును, వస్తువునందలి శీతవర్ణములవలన శీతశక్తియు నందువలన శమనశక్తియునను 2 విధములైన శక్తులును గలవు.

3 Fox-glove (Digitalitis Purpurea)

చక్కనియూదావర్ణపుష్పములు. చూర్ణము చక్కని ముదురుయాకు పసుపువర్ణము. ఎఱ్ఱనిధాతువులు గలవు. ఆకుల యందలి ఆకుపసుపుపదార్ధము. శ్వేతధాతువు. గంజిపదార్థము గలదు. మత్తుద్రివ్యము. శమనౌషధము. మూత్రివర్ధకము.

ఎక్కువగా వాడినచో విషౌషధము. అందువలన కంపము, వాంతులు గలుఁగును.

## 4 Ergot (Ergota)

ఊదాగలసిన గోధుమవర్ణముపైనను, తెలుపుగలసిన పసుపుగాని, తెలుపుగలిసిన యూదా వర్ణముగాని లోపలభాగమునను గల గట్టి ధాన్యము మూత్రికను సంకుచితపరచుటకిది తరుచుగా వాడుదురు. పైభాగమున వాడినచో విడివడిన పెద్ద శుద్ధరక్తవాహికల్లనుండి కారురక్తము నాపునని డాక్టరు ముల్లరుగారు వ్రాయుచున్నారు చూర్ణముగాని, కషాయముగాని వాడినచో రక్తాభిష్యందమును వెంటనే యరికట్టునని డా॥ రైట్ గారు వ్రాయుచున్నారు.

## 5 Cranesbill (Geranium)

తరుచుగా మచ్చలు గల పెద్ద యూదారంగు పుష్పములు. దేశీయమైన శైత్యౌషధము.

## 6 Logwood (లొంగరుచెక్క) Haematoxylon

గోధుమరంగు గలసిన యూదావర్ణపు గిన్నెవంటి వెనుకభాగను. పచ్చని దళములు దానియందు స్వయముగా రంగు నిచ్చుశక్తి లేకున్నను స్ఫటిక క్షారముతోను గాలి యందలి ప్రాణవాయువుతోడను జేర్చి నీలము, ఊదా, మెఱుపురంగులను జేయుదురు___వేడినిఁ దగ్గించును. బ్లూబ్లాక్ రకపు టానిక్ అను విషమిందుగలదు.

## 7 Purple Willow Herb (Lythrum Salicaria)

మచ్చలైన యూదా పుష్పములు. వేడిని తగ్గించి, చల్లదనము నిచ్చును.

## 8 Indigo, (నీలిమందు.)

ఉపయోగించునను యూహతో మూర్ఛ, చిన్నబిడ్డ చేష్ట, పిశాచనాట్యము, స్త్రీలకుగల శ్వేతధాతుపుష్టమునకు దీనిని వాడుదురు.

9 Phosphoric Acid (స్ఫురదా్రవకము) ($PO_4H_3$) ఇందున్న ప్రాణవాయువునందలి నీలిధాతుపు ప్రధానవర్ణము పలుచన చేసినచో వేడిని తగ్గించి జీర్ణశక్తినివృద్ధిజేసి బలము గలిగించును. ఈడ్పును బోగొట్టును.

10 Sulphuric Acid (గంధకికామ్లము) ($SO_4H_2$) నీలము, నీలిమందువర్ణము. యూదావర్ణములు గాఢముగానిందుండును. పలుచనజేసినచో బలవర్ధకము. వేడినిఁబోఁగొట్టి చలువనుఁ గలిఁగించును.

11 Nitric Acid (నత్రికామ్లము) ($N_2O_5OH_2$) నీలము నీలిమందు మొదలగునవి ప్రధానవర్ణములు, బలవర్ధకము. పూతి నాశకము. ఎక్కువనీటితో మిక్కిలిపలుచగాఁ జేసినచో జ్వరాదులయందు దాహమున కుపయోగించు పుల్లనినీరగును.

12 Hydrochloric Acid (ఉదజహరికామ్లము) (Hcl) హైడ్రోజనిదములోని నీలము-ఆకుపసపు; నీలిమందు, నలుపుగలసిన యూదావర్ణములును; క్లోరైన్‌లోని నీలము అకుపసుపు, నీలిమందు, నీలి వర్ణములును నిందుండుటవలన నిది శీతస్వభావముగలది. బలవర్ధకము, ఉష్ణోపశమనము పూతి నాశకము (కుళ్లకుండ జేయునది)

13 Tartaric Acid (టార్టారికామ్లము) ($C_4H_6O_6$) నీలి యూదావర్ణములు. దాహశమనములు. ఉష్ణోపశమనము.

14 Tannic Acid టానికామ్లము ($C_{27}H_{22}O_{17}$)

తేలికరైన నీలిగానుండు పసుపురంగుగల చూర్ణము. యీ మిశ్రిణమునందున్న అంగారము, ఉదజనివలన నిది యుష్ణప్రిధానమైనదని యూహింపవచ్చును. నీటియందువలె నిందును 2 అణువుల ఉదజనితో 1 అణువు ప్రాణవాయువుతో సమ్మేళనమునొందుటవలన, శీతవర్ణములందు సయితము అంగారము, ఉదజనియు బలముగానుండ నవగుటవలనను, పచ్చని అంగారపు అణువులు పైనుండినను లోపల శీతాణువులే యుండుటవలనను, నిందు శీతగుణము నత్యధికముగా నున్నది. శమనకరములగు శాకములలోని ధాతువుగలది. అభిష్యందముల Hemorrhages నాపును.

15 Galls (galla).

మంచివాని పైభాగమున కొంచెమాకుపసరు ధాతువుగల నల్లని నీలివర్ణముగాని సీసపురంగుగాని యుండును. లోపల గోధుమవన్నెగా గాని తెల్లగా గాని యుండును. ఉష్ణోపశమనౌషధము.

16 Sulphate of Copper (మైలతుత్తము) Cupric sulphate or blue Vitrol ($SO_4CuO_5H_2$) చిక్కని నీలివర్ణము కొలదిగా వాడిన వేడిని దగ్గించును. అందు పసుపు నారింజ ధాతువులు సయితమున్నవిగాన యెక్కువగా వాడిన వాంతుల గలిగించును.

17 Ferrous Sulphate (అన్నభేది) (Green Vtriol $FeSO_4$)

తేలికనీలముతో గలసిన ఆకుపసరువర్ణము. ఉష్ణోపశమనము. బలవర్ధకము.

18 Blackberry (నేరేడుపండు) (Rubus Villosus) ఊదా రంగుగల రసము. ఉష్ణోపశమనము.

19 Chloroform (క్లోరోఫారము) $CHCl_3$

ఇందు క్లోరైన్ యెక్కువగా నుండుటవలన యిందు నీలము నీలిమందువర్ణము ప్రధానముగా నుండును. సూటిగా నాడిమండలమును సౌమ్యపరచును. లోపలికి పీల్చినచో స్మృతి తప్పునట్లు జేయును. కాని దీనివలన దరచుగా హృదయస్తంభనము గలిగి మరణము గలుగును.

20 Chloral Hydrate ($C_2HCl_3H_2O$.)

ఇందును నీలము నీలిమందువర్ణము యూదావర్ణములే ప్రధానములైనను యిందు క్లోరాఫారము నందున్న నుష్ణతర ధాతువులచే శోషపఱచబడుటవలన యపాయకరమైనది కాదు. నల్లమందుకన్న నపాయమునందును గుణమునందును దక్కువగానుండినను: నిద్రగలిగించి బాధను తగ్గించును. సన్నిపాతములయందుపయోగింతురు విషము.

21 Green Tea (తేయాకు) (The Viridis) సాధారణముగా నలుపుగలసిన యాకుపసుపు వర్ణముగా గాని గోధుమవన్నె గలసిన నీలవర్ణపుకషాయము యాకుపసపు గలసిన లేబసపువర్ణముగా నుండును. చలవజేసి కొద్దిగా నుద్రేకము జేయును. అనుపానభేదములచే నాడీమండలముపై పనిజేయును. ఉషారును గలిగించును. నిద్రను బోగొట్టును. మితముదప్పి యెల్లప్పుడును దాగుచుండునెడల అసహ్యకరములగు నాడీవ్యాధులును నగ్నిమాంద్యమును గలిగి నాడీయుద్రేకమును మేదోద్రేకమును గలుగును. కాఫీకన్న దీనియందిట్టి దుర్గుణము లెక్కువ

యున్నవి. ఇందు వేయింటికి 178 పాళ్లు టానికామ్లముగలదు. పసుపువర్ణమునం దుద్రేకమును నీలిమయందు సౌమ్యతయును గలదు. ఈరెండు రంగులును గలసిన యాకుపసుపురంగు గల యౌషధులయందు యీద్వివిధ స్వభావములుండును.

## 15 కిరణము.

{నీలము ఊదారంగుల యొక్క రోగనివారకశక్తి.
బలవర్ధకము తాపశమనము, చలవజేయును}

పై పేర్కొనఁబడిన యౌషధులయందలి రోగనివారకశక్తులన్నియు నీలము నీలిమందువర్ణము ఊదావర్ణములయందు గలవు. ఐనను పై పేర్కొనఁబడిన యౌషధులయందలియపాయ స్వభావముగాని, తరువాత నపాయముఁజేయు స్వభావముగాని నిందేమియు లేక సిశితమై సూక్ష్మాతి సూక్ష్మాణువులకంటవ్యాపించి రోగనివారణము జేయ సమర్థములగుచున్నవి. ఇది సిద్ధాంతము మాత్రమేగాక యనుభవసిద్ధమని యీక్రింది విషయములను బట్టి గ్రహింప దగినది

### Siatica, Inflamation Etc.

### తుంటినొప్పి మంటలు మొదలగునవి.

లాల్ వుడ్ వీధిలోని హాస్పిటల్ స్థలమున "ఒకామెకు 59 సంవత్సరములు. కాని 11 సంవత్సరముల నుంచి ఒకదినమైనను బాధనుండి పూర్తివిడుదలలేక మిక్కిలి తీవ్రముగా తుంటినొప్పిచే బాధపడుచు 70 సంవత్సరముల ముసలిదానివలె కృశించియుండెను. ఎడమకాలు మోకాలు చీలమండలు వాచిమామూలుకు రెట్టింపు లావుబారెను. వారమునకు పూర్వము 3 నీలిఅద్దములు ఎడమటవైపు కిటికీలోనుంచి బాధ

యెక్కువగానున్న చీలమండకు కాంతి బ్రసరింప జేసిరి. 2, 3, గంటలలో కోడిగుడ్డంత పరిమితి గలిగి యూదారంగు గల కాయకరగి కాన్పింపకుండ జోయెను. దానితో బాధయును శాంతించెను. మరురాత్రి యాబాధ తిరిగిపాదములో గాన్పించెను. కాంతి బలహీనముగా నుండుటచే 2, 3, దినములు జరిగినను వెనుకటివలె బాధ త్వరగా తగ్గలేదు కాని తర్వాత తీవ్రమగు సూర్యకాంతిని రంగద్దముద్వారా ప్రయోగించుటచే శాంతి భంగము గలిగించు బాధ శాంతించెను. వ్యాధి యామెకు శనివారమునా డారంభించెను. ఆమెకు మిక్కిలి తీవ్రమగు బాధ కలుగుచుండెను. అదివారమునాడు యీ నీలియద్దముద్వారా ప్రయోగించిన సూర్యకాంతివలన మిక్కిలి ప్రయోజనము గాన్పించెను. ఆదివార ముదయమున మోకాలు మిక్కిలి వాచినది. బాధితావయవములపై నేమాత్రపు బరువుంచినను యామె కష్టుగలుగుచుండెను. నీలియద్దము ద్వారా వెంటనే వెలుంగును బ్రసరింపజేసిరి. ముప్పాతిక గంటలో బాధ, వాపు తగ్గి కాలెప్పటివలె యారోగ్యముగా గాన్పింపసాగెను. 16 ఏండ్లబాలికవలె నిన్న నామె యింటదిరుగ నారంభించెను. ఇంకొక యాశ్చర్యకరమైన విషయమేమనగా సంవత్సరముపైగా మొద్దువారిపోయి పూర్తిగా నిరుపయోగమైన యెడమకాలి వ్రేళ్ళు యీనీలికాంతి యాతపస్నానముల వలన నవి చైతన్యమును బొంది స్వాభావికముగ నుపయోగింపనారంబించెను. Providence Press 14 th Feb 1877.

— • { 2. Violent Hemorrhage of the Lungs / తీవ్రమగు శ్వాసాశయాభిష్యందము. } • —

మాకుటుంబములో నొకయిల్లాలు. ఒకామెకు 8 వారములనుండి శ్వాసాశయము లందుండి నెత్తురు పడుచుండెను. అందు 10 దినములనుండి ప్రతిదినము బొత్తుగా రక్తమే బడుచుండెను. ఈ రక్తప్రవాహమువలన యామె బలహీనతయును మీదు మిక్కిలి భయమును బొందుచుండెను; నేనొక నీలియద్దమును సంపాదించి యామె కూర్చుండు కిటికీయందు క్రింది సగమునం దిమిడ్చితిని. దినమున నొకగంటకాల మాకాంతిని మెడనరములపయి బ్రసరించునట్లు కూర్చొనుచుండెను. రెండవరోజున సూర్యకాంతి అతితీవ్రముగా నుండుటచే నామెను నీలికాంతి యెక్కువ తగిలెను. ఆ రాత్రి మెడనరము లెట్లో యుండి తలభారముగా నుండెను. మరునాడి బాధలు తగ్గెను ఇక నంతకాలమెప్పుడును నీలికాంతియం దామె కూర్చుండుట లేదు. కాని చికిత్సారంభమునుండియు నామె బలమభివృద్ధియై ముఖము స్వాభావికతనుఁ బొంది వారముదినములో యెప్పటివలె యారోగ్యమునుఁ బొందెను. అంత స్వల్పకాలములో శ్వాసాశయములందున్న వ్యాధియంతయు పోయినదని జెప్పజాలము. కాని యామె హృదయమునందుండి వెలువడుచున్న రక్తము కట్టుకొనుటచే యామె కాయు నారోగ్య మభివృద్ధికా నారంభించెను. తరువాతనొకవార మాకాంతియందు కూర్చుండుటచే మెడమీదను భుజములమీదను యెఱ్ఱనికాయలు లేచిరక్తమునందలి కలుషమును వెలుపరించెను; From Duleton, New work 12 th Jan 1877 in ('Correspondenc- of Chicago Tribune') పైన పేర్కొనబడినట్లు నీలికాంతి యెక్కువైనదనుట తప్పు. నీలికాంతితో గూడ యుద్దీపన గలి

గించు తెల్లని యద్దముసైత ముపయోగించుట చేతను నుద్దీ
పన యామె తత్వమును కించిత్తైనను భరింపదగుటను నామె
కది యాబాధను గలిగించెను. ఆమెకు మిక్కిలితక్కువనీలము
తగిలినది. మేజరునీలము సయితమైనను లోనికి యితరవేడికాం
తిని స్వీకరించును. మేధస్సు నాడులు సుకుమారముగా నున్న
రోగులకు నీలికాంతిలో యేమాత్రపు వేడిరంగులు గలిపి
వాడినను తలమీదను వెన్ను పై భాగమునను తేపకొక గంట
కాలమే వాడుట క్షేమకరము. ఈ పొరపాటు అన్నిరోగము
ములకు నొకటేచికిత్స చేయుటచే కలిగినది.

## 3. Cerebro Spinal Meningitis
## మేధస్సును వెన్నుపామును బిగదీయు వాతజ్వరము

కెయిరోలోనున్న ఇల్లినాయిస్‌లో నున్న నొకామె
జనరల్ ప్లైజన్‌టన్‌గారికి తాను నాల్గుసంవత్సరముల నుండి
పైవ్యాధిచే బాధపడుచు నీలికాంతి ప్రయోగముచే తనరోగ
మును బోగొట్టికొంటినని జాబువ్రాసెను (Condensed from
New York World.)

## 4. Neuralgic Headaches,
## నాడీ సంబంధమగు తలనొప్పులు

బ్రాడ్వేలోనున్న నొకవర్తకుడు వారమునాడు చర్చికి
బోయి తలనొప్పితోను నాడీబాధతోను యింటికి వచ్చితినని
యీ గ్రంథకారునితో చెప్పెను. వర్ణచికిత్సయందు నమ్మకము
లేకున్నను అయినను చూచెదమని మేజరయిన నీలికాంతిలో
నొక ½ గంట కూర్చుండి బాధోపశాంతిని బొంది బాబిట్
గారి ప్రసంగతిని తెలియపరచెను.

## 5. General Nervousness. నాడుల బలహీనత

వైక్ లైడ్ లోని యొక సుప్రసిద్ధ వైద్యశాలాక కిటికీ లో నొక పెద్దనీలియద్దము నడ్డనుంచి యాకాంతి ప్రసరించు చోట నొక కుర్చీవైచి తనవద్దకు వచ్చు రోగుల నందుగూ ర్చుండ బెట్టుచుండెను. తరుచుగా వచ్చునట్టి యొక బలహీను రాలైన ముసలామె ఆకుర్చీమీద కూర్చుండబెట్టబడి క్రమము గాలాభమును బొందుచుండెను. ఆ నీలియద్దము యొక్క ప్రభా వము వైద్యశాలవలన దెలిసికొని తానట్టియద్భుతమగు సుఖా నుభవమును బొందుచుంటిననియు దానికి కారణము తన కంత ముందుదెలియదనియు జెప్పెను.

## 6. Rheumatism. మేహవాతము.

విలియం లారభి తీవ్రమగు మేహవాతముచే లేవలేని స్థితిలోనుండి గొలదికాలము నీలి వర్ణకాంతిస్నానముల జేసి స్వస్థ తను బొంది తన వ్యాపారమును చూచుకొన గలిగెననియు నిది యత్యద్భుతమనియు హార్ట్ ఫోర్డుపోస్టను పత్రిక ప్రక టించెను.

## 7. Rheumatism, మేహవాతము,

జనరల్ ప్లెజంటన్ గారికి న్యూయార్కు లోని డాక్టర్ రాబర్ట్ రోలెండ్ గారిట్లు వ్రాసిరి:—ఒకసంవత్సరముక్రిందట తీవ్రమగు మేహవాతముచే బాధపడుచున్న నొకరోగిని నీలి కాంతియందు గూర్చుండబెట్టుటచే 5 నిమిషములలో బాధో పశమనమును బొంది బాధలేకుండ నిటునటు దిరుగగలిగెను.

వానినాలుకపై మాత్రము చిలుమువాసనగొట్టి పాచి బట్టెనని జెప్పినది రాగి, తుత్తునాగము మొ॥ మోటులోహములు సౌమార్ద్యమున నైచిత్యమును బొంది నీలికాంతియందంతర్గతమై యుండును. బ్రూక్లీన్‌నందు ఫ్రీ. కె. యనువారియొద్ద జికిత్సనందుదున్న యొకరు తమచేతిని నీలికాంతియందుంచి నాలుకపై చిలుమువంటి పాచిపట్టినదని చెప్పినని డాక్టరు రోహలెండ్ గారు వ్రాయుచున్నారు.

## 8. Tumour on an Infant. శిశువునకు గ్రంధి.

"ఒకమాసమునాడు జన్మించిన శిశువునకు యెడమదౌడన కోడిగుడ్డంత గ్రంధిపుట్టెను. దినమున కొక గంట నీలియద్దము అడ్డముంచి సూర్యకాంతిని ప్రసరింపజేయుటచే 40 దినములలో గ్రంధి సమసిపోయెను. అంతట శిశువు ఆశ్చర్యకరముగా నభివృద్ధినొంది, అపరిమితారోగ్యము గలిగి మిక్కిలి తేజస్సుగా నున్నాడు తదాది యీ 6 మాసములును యిసుమంతయేని బాధగాని వ్యాధిగాని గలుగలేదు శిశువ్యాధులనాపుట కీనీలికాంతి ప్రభావవంతమైనదనియే నమ్ముచున్నాను. Wm. Mc. Laury (M. D.) to Gen. Pleasanton in "Blue and Sun lights." ఆంతర్గతమైనయిట్టి కాలిక గ్రంధులనువెలువరించుటకు యెఱ్ఱధాతువుగాని, యెఱుపుగలిసిన యూదావర్ణముగాని గావలసియుండును. గాన యెఱుపుగలిసిన యూదావర్ణముగాని యెఱుపుగాని సూర్యకిరణ కేంద్రీకరోపకరణముచేగాని ఉప్పెచేగాని కేంద్రీకరించినచో చైతన్యము గలిగి గ్రంధి యనేకరెట్లు స్వల్పకాలములో తగ్గిపోయెడిది.

## 9. Colors for Lunacy. పిచ్చినిగుదుర్చురంగులు.

రోముదేశమునందలి ఫాదర్ సెచ్చియనువారికి పయడ్‌మోంటులోని పిచ్చిచికిత్సాలయపు టధికారులగు డాక్టరు పోంజాగారు మానసికవ్యాధులను సూర్యకాంతిని బ్రయోగించిన కుదురునని తనకు దోచుచున్నదని వ్రాసిరి. దానిపై వారు "సూర్యకాంతియందునను నూదాకిరణముల ప్రయోగించి పిచ్చిని గుదుర్తుమను నాలోచన మిక్కిలి సమంజసముగా నున్నదనియు నూదారంగునందు దుఃఖశమముల నణచు స్వభావమున్నదనియు నందుననే మనోవ్యాధి నూదావర్ణముగా నుండునని కవులు వర్ణించిరనియు కిటికీలన్నిటియందును నూదావర్ణపు అద్దములనుంచవలసినదనియు గోడలకంతటను యూదావర్ణమునే చిత్రింపవలసినదనియు కిటికీలు సాధ్యమైనంత యెక్కువ సంఖ్యకలవిగానున్న మరింత మంచిదనియు రోగులు రాత్రిలయం దందుండవలయుననియు" జవాబు వ్రాసిరి. డాక్టరు పోంజాగారు వివిధవర్ణముల గదులను గట్టించి యందు తమరోగుల నుంచెను. (2) ఒకడు ముచ్చువలె యెవరితోడను మాట్లాడడు. వానిని యెఱ్ఱనిగదియందు 3 గంటలుంచుటచే ముచ్చుదనము బోయి ధారాళముగను మరియాదగను మాటలాడ నారంభించెను. (3) ఇంకొకనికి మనోవ్యాధి. అన్న ముట్టడు. 24 గంటలు యెఱ్ఱని గదియందు కూర్చుండబెట్టిన తరువాత గొంత యాహారము నుగోరెను. (4) ఉద్రేకమును బొందుచున్న యొక పిచ్చివానిని నీలిగదియందుంచుటచే 24 గంటలలో వాని తిక్కుదిగెను. (5) వేఱొక పిచ్చివానిని యూదాగదియం దొకరాత్రియుంచిరి. పోంజాగారి యొద్దమరునాడుదయము సెలవుదీసికొని

తనకు నయమైనదని చెప్పిపోయెను. పై యుదాహరణముల బట్టి డాక్టరు పోంజాగారు తమయనుభవముల నిట్లు వివరించిరి:— "ఊదారంగునందు తక్కినరంగులకన్న చలువజేయు గుణ మెక్కువయున్నది. ఎఱుపునందు మిక్కిలి వేడిచేయు స్వభావమున్నది నీలికాంతియందు యీ 2 శక్తులును మిక్కిలి తగ్గియున్నవి. అందు దేహముల నణచుశక్తులున్నవి." 3 వ కిరణములో జెప్పినట్టే యిందును నీలివర్ణము ద్వివిధశక్తులయందును లోపించియున్నదనుట వారియొక్క విషయమునందలి యసంపూర్ణజ్ఞానమును దెల్పుచున్నది.

## 10. Sun-stroke. ఎండదెబ్బ.

న్యూయార్కు యూవినింగుపోస్టులో ప్రచురించిన యొకని ఆరోగ్యవృత్తాంతమును నామరోలెండుగారు నాకు చూపిరి:— అంగిల్ వుడ్ నివాసియగు యొక పెద్దమనిషి న్యూయార్కు నగరమున వర్తకము జేసికొనుచు 2 సంవత్సరములు యెండను భరింపలేక బాధపడుచుండెను. టోపీలోపల నీలిబట్టవేసి ధరించుటచే నాతడు సూర్యరశ్మికి తాళజాలెను. సూర్యకాంతి లేనిచో వర్ణములు పనిజేయవనుట నిరాధారమైనదని పై విషయము బోధించుచున్నది. కానిసూర్యకాంతివలన వర్ణముల శక్తి వృద్ధియగుననుట యు నిశ్చయమే.

## 11. Sciatica. తుంటి నొప్పి.

"32 సంవత్సరములు వయసుగల వితంతువు అనేక సంవత్సరములుగా తుంటినొప్పి ముడ్డిపూసలు పచ్చిపుండువలె నుండెను. నీలిఅద్దపు సూర్యకాంతియందు వెలుగు వెన్నునకు

తగులునట్లు తేపకు షుమారు 2 గంటలు చొప్పున గూర్చొను నట్లు మే ముపదేశించితిమి. 3 వ తూరి గూర్చున్నతరువాత వెన్నుపాముయొక్క మృదుత్వము తగ్గి తుంటినొప్పి తగ్గనారంభించెను. ఇట్లు 10 దినములు మాత్రము చేయుటచే చిహ్నములన్నియుతగ్గి పూర్తిగా నివారణమాయెను." Dr. Pancoast's Blue and Red Light. P. 274.

## 12. Cholora Infantum and Marasmus.

## శిశువులకు గలుగు కలరా (నీరసమును).

18 మాసముల శిశువు. దంతోత్పత్తికాలమందు శిశువులకు గలుగు వేడివాతావరణమున తీవ్రమగు భేదులు గలిగెను. ఒక సమర్థుడగు మందువైద్యుడు చికిత్సజేసెను. శక్తి నానాటికి తగ్గిపోవుచుండెను. చివరకు నీలికాంతి నుపయోగింతమను కడసారి సూక్ష్మమగు నూహదోచెను. ఆశిశువు మిక్కిలి చికాకుగా నుండెను. నీలికాంతియందు బరుండబెట్టుటచే చికాకుతగ్గి నిద్రపట్టి నీలికాంతిలోనుండి తీయునప్పటికి నెమ్మదిగను నేదదీరియు నుండెను. ఇట్లు 2 మాసములు చేయుటచే యా శిశువునకు బలారోగ్యములుగలిగి యానందముగను తేజస్సుగను నుండెను. ఈ నీలికాంతిగాక యింకేచికిత్స జేసినను ఆశిశువు మరణించియే యుండును. ఈ కాంతివలననే జీవించెను. ఇంకేచికిత్సయు నితనిని రక్షించెడిది కాదు."

—Blue and Red Light.

## 13. Nervous Irritability. నాడుల యుద్రేకము.

35 సంవత్సరములవాడు చిరకాలము శక్తికిమించిన అతికాలముచేసిన దేహమనోశ్రమలచే వాని నాడీమండల

మంతయు చెడి బలహీనము నుద్రేకము భయంకరమగు కలలచే గాత్రులందు నిద్రలేమి, అమితాతిస్వల్పక్షుధ—ఒక్కొకప్పుడు విపరీతమైన యాకలి, వేరొకప్పు డన్నముజూచిన వాంతి (ఓకిరింత), ఒక్కొకప్పుడు మలబద్ధము వేరొకప్పుడు భేదులు, కలలో తరుచుగా నొప్పి కించిద్బాధ కలిగినను పిరికితనము గలిగి జీవితమె దుర్భరముగా దోచుచుండును. ఉద్రేకించినవాని తత్వములకు యెఱుపు కాంతి నిషిద్ధముగాన వానికి నీలికాంతిని ఎఱ్ఱసీసాలో నీటిని యిచ్చుచుంటిమి. వెంటనే వానికి మిక్కలి మేలుకలిగెను. 5 కాంతి స్నానములతో వానికారోగ్యమును బలమును గలిగి జీవితకాలమంతయు నానందముగను వైహికమానసికానందముతోడను. చలాకిగను గడిపెను" Blue and Red Light P. 280

---

## పాఠకులకొక మనవి

☞ వర్ణచికిత్సావిధానమును కనుగొనినవారు డాక్టరు యి. డి. బ్యాబిట్ గారు. వీరి గ్రంథములన్నియు మిక్కిలి ప్రౌఢములైనవి. ఈచికిత్సావిధానమున మిక్కిలి నైపుణ్యమును సంపాదింపవలయుననిన వీరిగ్రంథముల నవశ్యముగ బఠింపవలయును. ఇవి యిప్పుడు దొరకవు. అచ్చులోలేవు. ఎట్టులైనను అత్యద్భుతములును, నపూర్వములునగు వీరి గ్రంథములన్నిటిని క్రమక్రమముగా దెనిగించి ప్రౌఢప్రభాకరమనుపేర ప్రకృతిలో బ్రకటింపదలచి 15 కిరణములు పూర్తి గావించితిమి. 16వ కిరణము రెండవభాగమున నారంభింపబడును. కొన్నిసంవత్సరములకుగాని యీగ్రంథము పూర్తికాజాలదు. ఇప్పటినుండియు ప్రకృతికి చందాదారులైయున్నచో

ప్రతిమాసము ను నమూల్యములగు నీవిషయములను దెలిసి కొనుచుండగలరు. ఈగ్రంథమును చదువకపూర్వము "సూర్య కిరణచికిత్స"ను పఠించుట యవసరమగును. ప్రకృతిపత్రికలోని వ్యాసములన్నియు కొన్ని శీర్షికలుగ విభజింపబడుటకును కొన్ని గ్రంథములుగ బైండు చేయించుటకును వీలుగ నుండునట్టుల వ్యాసములను బ్రకటించుచున్నాము. ఇప్పుడు చందాదారు లగు వారెల్లరకు నందలి గ్రంథభాగములు 100 పేజిలు 0-12.0 వెలయగును. చందాదారులుకాని వారలకు 100 పేజిలు రు 1-8.0 యగును. చందాదారులై వెనుకటి గ్రంథములు కొనువారలకు 100 పుటలు 1-0.0 యగును. కావున ఎప్పుడో గ్రంథములు పూర్తియైన పిదప కొనుటకంటె యిప్పుడే చందా దారులైచో వారలకు అర్ధవెలలకే గ్రంథభాగములు లభించుట యేగాక ప్రతినెల గ్రంథవిషయమును దెలిసికొనుటకు వీలుగ లుగును. పాఠకులారా? వెంటనే చందాదారులగుడు. ఎట్టియు పయుక్తమగు వ్యాసమునైనను వెనుకటి సంచికలో ప్రకటింప బడినదనినంత మాత్రమున వార్తాపత్రికలవలె నివిరుపాత్రి తవి యని నిరుపయోగములని భావించి, "పాతసంచిక వలదు క్రొత్తసంచికలోని వ్యాసములు చదువవలె "ననుచుందురు. గ్రంథము చదువ నిచ్ఛగించుదురుగాని పాతసంచికలోని వ్యాస మునుచదువ నొల్లకున్నారు, గావున ప్రకృతిలో ప్రకటింప బడు వ్యాసమును కొన్నిగ్రంథములుగ విభజింపదలచి యారీ తిని "సశేషము"గ బ్రకటించుచున్నాము. దీనివలనగలుగు ప్ర యోజనమును పాఠకులు గమనింతురు గాక.

—మేనేజరు, ప్రకృతి.

# ప్రౌఢప్రభాకరము.

## 16 వ కిరణము

### —*నీలము, తెలుపు వర్ణముల యొక్క రోగనివారకశక్తి*—

ఈ రెండువర్ణములను కలుపుటచే కేవలము నీలికాంతి గాని ఊదావర్ణముగాని వాడినప్పటికన్న చైతన్యమును, సుజీవమును గలుగును. ఇందు నీలి మొదలగు వర్ణముల చల్లదనమే గాక అన్ని వర్ణముల యొక్కయు సమ్మేళనమగు సూర్యకాంతి యందలి యుజ్జీవకస్వభావము సయితము యీ 2 రంగులను గలిపి వాడుటచేఁ గలుఁగును. ఓషధి యుత్పత్తియందును మానవరోగ నివారణమందును శ్వేతశ్యామ (తెలుపు, నీలము) వర్ణముల సమ్మేళనముజేసి ప్రయోగించి వాని ప్రభావమును లోకమునకు వెల్లడించిన జనరల్ ప్లెజంటన్ యణువులరసాయనిక సమ్మేళనము యొక్క తత్వము నెరుగనివాడగుటచే యీప్రభావమునకుగల కారణమును గుర్తింపలేకబోయెను.

నీలము స్వాభావికముగా చల్లనివర్ణమని గ్రహింపవలెను. నీలికాంతిలో నొక థర్మామీటరు (ఉష్ణమాపకయంత్రము)ను పసుపుకాంతిలో నొకటియు, యెఱ్ఱనికాంతిలో నొకటియు నుంచినచో నీలికాంతియందు 56° ను, పసుపుకాంతియందు 62° ను, యెఱుపుకాంతియందు 79° డిగ్రీలవరకును బాదరసము పాకును. నీలవర్ణకిరణముతో తెల్లనికిరణము గలసినంతమాత్రమున యీప్రభావ మెచ్చటికిపుండివచ్చినది 4 వ కిరణము

నందు నీలవర్ణమునకు యెఱుపుతోటి అర్థాత్ వేడితోటి రాసాయని కానురాగము మనమెఱుగుదుము. కాన నీలముతో జోడించిన తెల్లనియద్దమునుండి వచ్చుకాంతియందలి వేడిమిని వారించును. కొద్ది నీలికాంతితో నధికమగు తెల్లనికాంతిని గలిపివాడినచో తెల్లనికాంతికన్న యెక్కువవేడి నొసంగును. సమముగా నీలము తెలుపుకాంతులను గలిపి ప్రయోగించినచో తెల్లని సూర్యకాంతికన్న చల్లదనమొసంగును. జనరల్ ప్లైజన్టన్గారియొక్క "Blue and Sunlight" శ్యామశ్వేతవర్ణముల"ను గ్రంథములోనుండి యీక్రిందియుదాహరణములు వేర్కొనఁబడినవి. కాని కేవలము 2 వర్ణములనే యేరుకొనుటచే ప్లజన్టన్గారి గ్రంథము అసమగ్రమైనది. చికిత్సకంతకును నుపయోగింపవలసినచో యీ 2 వర్ణములే తక్కిన యే 2 వర్ణములకన్న సమర్థతరములైనవి.

ఇందు చల్లదనమును చొరబారుశక్తిగల నీలివర్ణమును, వెచ్చదనమును నుజ్జీవము నొసంగగల తెల్లనికాంతియు నుండుటవలన రెంటిని యొకేవరుణమున నుపయోగించుట క్రింది విధముగా నుపయోగించును. వెచ్చగానున్న తల మొదలగు ప్రదేశములు నీలికాంతి క్రిందను మిగిలిన చల్లనిప్రదేశములు శుద్ధకాంతి క్రిందనుగాని; నాడులన్నియు నుద్రేకించియుండి, కలిగిన జ్వరాదులందు కేవలము నీలికాంతిని; వాతము అంతర్గతముగనుండు కాలిక వ్యాధులకు కేవలము సూర్యకాంతి నుపయోగింపవచ్చును జనరల్ ప్లైజన్టన్గారు తెలుపుతో గలసిన నీలివర్ణముగాని యూదావర్ణముగాని ప్రయోగించి యోషధీ ప్రపంచమునకును, మానవదైహికరుజలను బోగొట్టు

టలోను మంచిపనినే జేసిరి. దానివలన వర్ణచికిత్సయం దనుమా నము గలవారికి నమ్మకమేర్పడెను. ప్లెజన్టన్ గారి తెలుపు, నీలము (శ్వేతశ్యామ వర్ణ ములను) గ్రంథములనుండి యీ క్రిందిరోగ నివారణవృత్తాంతములు పేర్కొనబడినవి:—

(1) Sciatica తుంటినొప్పి.

"22 సంవత్సరముల వయస్సుగల బలసాహసోత్సాహ ములుగల నాకొమారుడు తుంటియందు గలిగిన మేహవాత పునొప్పిచే యెడమతుంటి నడువనీయక మిక్కిలిబాధపడుచు ముందు వైద్యమును, గాల్వనిసమును సయిత ముపయోగించి యు ప్రయోజనము గాంచలేకపోయెను. నడువ సామర్థ్యము లేక బాధపడుచు కుంటివానివలె నుండెను. నాసలహాపై వెన్ను పామునకు, మలుగులకు సూర్యకాంతి నీలికాంతులను ప్రయోగించుటచే వెంటనే గుణముగలుగుచు 3 వారము లలో నొప్పి నయమై యింతవరకు 13 సంవత్సరములైనను తిరిగి బాధ గాన్పించలేదు" (Blue and Sun Lights Page 14)

(2) Two Cures of Rheumatism

(2) మేహవాత నివారణ వృత్తాంతములు 2.

నా స్నేహితులిద్దరు మేజర్ జనరల్సుగానుండిరి. వారిద్ద రిని జూచుటకై నేనొకనాడు వారి కచ్చేరీకి బోతిని. అందొక కిటకీలో సగమువరకు నీలిఅద్ద మిముడ్చబడియుండెను. కొంత మాట్లాడినతర్వాత నందొక జనరల్ నన్ను కిటికీయందలి నీలి యద్దమును జూచితివాయని ప్రశ్నించెను. చూచితినంటిని తరు వాతనిట్లు జెప్పనారంభించెను:—"నేనును, యీజనరల్ గారును

మోచేతివద్దనుంచి చేతిగ్రేళ్ల చివరవరకు మేహావాతపు నొప్పులచే మిక్కిలి బాధపడుచుంటిమి. వారియు కలమైనను చేత బట్టుకొనలేకుంటిమి. విన్నవిన్న మందులనన్నిటిని వాడి చూచితిమి. నిరుపయోగములయ్యెను. తరువాత ప్లెజన్టన్ గారి నీలియద్దమును వాడిజూతమని తోడి జనరల్ గారితో జెప్పితిని. ఆయన యొప్పుకొనెను. నీలిఅద్దమును తెప్పించి కిటికీలో నిమిడ్చితిమి. 10 గంటలగుటతోడనే సూర్యకాంతి నీలికాంతివచ్చు కిటికీకెదురుగా యెండలో చొక్కాలు పైకిదీసి బాహువుల నెండబెట్టుచుంటిమి. 3రోజులతర్వాత చేతులయందలి మేహావాతపునొప్పులుబోయి యింతవరకును మరల రాలేదు. దినమునకు 30 నిమిషములుమాత్రము కాంతిస్నానము జేయించుచుంటిమి." యీ సంభాషణతర్వాత 2 సంవత్సరములకు అందొక జనరల్ తమకా మేహావాతపునొప్పులు తిరిగి కాన్పింపలేదనియు 2 వ వారుత్తరదేశమునం దున్నారనియు జెప్పెను."

(Page 15 Blue and Sun Lights)

సున్నితమైన శక్తులయందు స్థిరతగలదని యీక్రింది విషయములనుబట్టి గ్రహింపవచ్చును.

(3) Nervous Prostration నాడీక్షయము.

న్యూయార్కులోని డాక్టర్ ఫిషర్ గారి రోగి యొకామె యిట్లువ్రాసినది:—"3 సంవత్సరములనుండి కాయిలాతో బాధబడుచు నందు సంవత్సరార్థమునుండి గదిలోనుండి బయటకు రాలేకయుంటిని. నానాడీమండలమంతయు మిక్కిలిగా చెడియుండెను బలవర్థకౌషధములన్నియు నిష్ప్రయోజనములయినవి. నల్లమందువాడిననే నిద్రగల్గుచుండెను. ఆకలి లేదు

ముఖమునందును, చేతులయందును, కాళ్లయందు పెదవుల యం దును రక్తమువిరిగి తెల్లబారిపోయినది 19-1-1874 తేదీన నీలి కిరణ చికిత్సయందు నన్నుంచిరి. 36×16 అంగుళములచదరము గల 2 పెద్ద నీలి అద్దములు దక్షిణవైపు కిటికీలో పైభాగము న నుంచిరి. లోపలకి తెల్లని, నీలి, వెల్తురులు రెండును వచ్చు చుండెను. నేనందెల్లప్పుడును గూర్చుండుచుంటిని. డాక్టర్ ఫిషర్ గారు ఆతపస్నానముగాని లేదా తేపను 20, 30, నిమిషములు ఉదయము మధ్యాహ్నము నీలికాంతి సూటిగా వెన్నుపైబడునట్లుగాని చేయగోరెను, కాని నాతత్వ మదియు ను భరింపదయ్యె దుస్తులను ధరించి యటులనే కూర్చున్నను నానాట సుగుణము గలుగుచుండుటచే జాలుననుకొంటిని. 2, 3. వారములలో బాగుగా గుణముకాన్పించెను. ముఖము చేతులు, పెదవులు క్రిమముగా నెఱ్ఱగానగుట కారంభించెను. రాత్రిలు సుఖనిద్ర వలన సుఖతరములుగను, నాకలి స్వాభా వికముగను నయ్యెను. నా బలోత్సాహములు తిరిగి వచ్చుచుం డెను. నా నాడీమండలమంతయు నుద్రేకముతగ్గి బలుపు జెందెను. 6 వారములలో మేడమెట్లనెక్క నారంభించితిని. దాన నాశక్తి యెట్లభివృద్ధియగుచున్నదో గోచరించెను. ఏప్రిల్ నెల మధ్యభాగమునందు నేను బాగుగా నడువగలిగితిని. నీలియద్దమును కిటికీలోనుంచినది మొదలు బలవర్ధకాది యౌష ధములన్నిటినిమాని నీలికాంతినేనమ్మి యీపరిశోధన జేసితిని. పై విషయములో యామెకు దేహమంతయుగానున్న సత్యధిక భాగము నీలికాంతి తగులుట సకళముగానున్నది అంతయు తెల్లని సూర్యకాంతియె తగిలియున్నచో నంతటి బలహీనమైన

తత్వముగల యామె కపకారమునే జేసియుండెడిది. సరియైన నీలికాంతియైనచో వివత్రమునుగానైనను నామె భరింపగలి గెడిదే.

(4) Neuralgia, Rheumatism, Nervous Exhaustion

నాడులలోనొప్పి, మేహవాతము, నాడీక్షయము.

"1871 సంవత్సరము అగస్టు చివరభాగములో యీ పట్టణమునందలి యొకానొక వైద్యుని జూచితిని. ఆతడు పరిచయస్థుడు. ఆపత్తులోనుండి ధైర్యము చెడియుండెను, నేను ప్రశ్నింపగా తనభార్యకు చాల జబ్బుగానున్నదనియు, యీ పట్టణములోనివారేగాక న్యూయార్కు నగరమునందలి సుకుశలులగు ఘనవైద్యులును చికిత్సించి విఫలులైరనియు, రోగము విషమావస్థలో నున్నదనియు జెప్పెను. ఆమెకు వెన్నుపాము క్రిందిభాగమున, తలలోను, మెడలోను, కాళ్ళ మిక్కిలి నొప్పులుగానుండెను. అందువల్ల నామెకు నిద్దుర లేదు. ఆకలి లేదు. ఆహారముసంగనిచ్చు మలము లెక్కువగా నగుచుండెను, కండలు తగ్గిపోవుచుండెను. ఆమెకు నీలి, తెల్లనికాంతులను నొకటివెంట నొకటి కిటికీలోనుంచి యుపయోగించుచుండిరి. ఇదిజరిగిన 6 దినములకు పై డాక్టరుగారు నేనువ్రాసిన నీలికాంతినిగురించిన గ్రంథములను బంపవలసినదనియు, వానిని దన స్నేహితులకు జూపెదననియు వ్రాయుచు తనభార్యను నీలికాంతి యందుంచుటవలన తలమీద వెండ్రుకలు మొదుగ నారంభించుటయేగాక లేనిచోట మొలవనారంభించి దట్టముగ రా నారంభించెననియు వ్రాసెను.

నిశ్చయముగా నిది యనుకొననిమార్పె. అట్టి చికిత్స వలన చర్మ ముద్దీపనఃబొందినది. తరువాత 2 దినములకు నేను డాక్టరుగారిని జూడబోతిని డాక్టరుగారు నీలికాంతితో జేసిన పరిశోధవలగూర్చి ముచ్చటించుచుండెను. ఇంతలో నా యనభార్య లోనికివచ్చి 'జనరల్ గారూ! మీ గానీలికాంతిని వాడుటకు సహాయిచ్చినందులకు వందనములు.' అని చెప్పె ను. 'అది మీాకేమైన మేలుచేయుచున్నదా'యని నేనడిగితిని. 'కావలసినంత మేలుచేయుచున్నది. పాదము నీలికాంతిలో బెట్టినంతనే యందలి బాధలన్నియు బోవును

'నావెండ్రుకలు పొడవుగా సాగుటయేగాక లేనిచోట నెల్ల చిక్కగా మొలచుచున్నవని మానౌకరి చెప్పుచున్నది. వెన్నులోనొప్పి చాలభాగమువరకు తగ్గినది. నాదేహస్థితియు కొంచెము బాగుగనేయున్నది.' అని యామెచెప్పెను. 3 వార ముల తరువాత నేను వారిని జూడబోతిని. తన భార్యబాధ లన్నియు పోయినవనియు, నామెకు నాకలి నిద్ర కలిగెనని యు, దేహమునందలి రక్తమాంసము లభివృద్ధియయ్యెననియు తెలుపు నీలి కాంతివలన తనభార్యకు జాలమేలు కలిగెననియు జెప్పెను. తత్క్షణమే యామె లోనికివచ్చి తన భర్తవాక్యము లను స్థిరపరచెను అప్పుడు డాక్టరుగారు:—నాభార్యకుపయో గించిన నీలి సూర్యకాంతుల ప్రభావముజూడగా మందు వైద్యమునం దుద్దీపక బలవర్ధకౌషధములలో నాకు దెలిసినంత వరకు యింతటి గుణతమమైనది లేదని భావించుచున్నాను. టైఫాయిడు (విషమజ్వరము) నీరసము, నాడీక్షయము మొద లగువానియందు యిది గుణమిచ్చితీరును" అని చెప్పెను.

డాక్టరు బెక్‌విత్ (Dr. S. W. Beckwith, Electrical Institute, 1220, Walnut St. Philadelphia) గారు వ్రాసిన యత్యుత్సాహకరమగు జాబు నిచ్చుట చేర్చుటకుచోటులేదు

## (5) Infantile and animal growtli

## శిశువులు, ఓషధులు పెరుగుటనుగురించి.

ఈక్రిందిజాబు జనరల్ ప్లెజన్టన్ గారికి, Mound City Ill. నివాసియు U. S. Nairy సంబంధీకులునగు J. R. Goldsborough అనువారు 31-5-72 తేదీన జాబువ్రాయుచు నందు నీలము, తెలుపు, సూర్యకాంతులయందు ఓషధులు బాగుగా పెరుగుటనుగురించి వ్రాయుచు ఒకేదినమున విచ్చిన 2 గుడ్లలో 1 తెలుపు, నీలికాంతియందును 1 తెల్లని వెలుతురులోను నుంచుటచే గలిగినమార్పు తానిట్లు వ్రాయుచున్నారు:—"2 కోడిపిల్లలకును యొకేకాలమందొకవిధమైన యొకేపరిమితిగల యాహార మిచ్చుచుంటిని. అందు మామూలు సూర్యకాంతియందుంచినదానికన్న నీలము తెలుపు సూర్యకాంతులయందుంచిన కోడిపిల్ల పెరుగుటయందును బలోత్సాహములయందును దినదినమును మిగిలిపోవుచుండెను. ఈసందర్భమున యిదేస్వభావముగల యింకొకవిషయమును వివరించెదను. 1872 సంవత్సరము 29 జనవరి తారీఖున నొక పెద్దమనిషిభార్య నెలతక్కువ శిశువును గనెను. అది యప్పుడు 140 తులముల బరువుండెను. అది బలోత్సాహములయందు మిక్కిలి హీనముగానుండెను. ఆపురిటిగదికిగల కిటికీలకు నీలి పరదాలు కట్టియుండెను. కిటికీలకుగల కొన్నిసందులలోనుండి

సూర్యకాంతి తగులుచుండెను. తల్లికి క్షీరస్రోతస్సులు బాగుగా వికసించి పాలమితముగా నూరెను. అదేకాలములో శిశువునకాకలిఁగూడ నెక్కువయ్యెను. కాని యంత యత్యధికముగా బాలూరినను శిశువు ఆకలి యప్పుడప్పుడు తీరకుండుటయు కద్దు. 29-5-72 తేదికి ఆశిశువు బలారోగ్య పరిమాణముల యందు వృద్ధినిబొంది 880 తులములు బరువుండెను"

—(Blue and Sun Lights Page 7)

మందమైన తెరకన్న పలుచనితెరనుండి వచ్చుకాంతి మంచిది. తెర చిక్కగనుండి మందమైనచో చీకటి వచ్చునే గాని రంగురాదు. దొరకినచో రంగుఅద్దములు చాలమంచివి

## (6) Partial Paralysis in a Child.

## శిశువునకుగల ద్వైశికమగు చచ్చువాతము.

18 మాసములుగల శిశువు పుట్టినప్పటినుండి కాలు గదలించి యెరుగదు. కాళ్ళు చచ్చుబడియుండెను. పారాడుట, నడచుటలేదు. కాళ్ళు నిరుపయోగములగునేమో యని భీతిగలిగెను. దాని ముత్తవ్వ మేడపైన కిటికీలో సగము నీలి యద్దము సగము తెల్లని యద్దము నమర్చి పిల్లల నచ్చట నాడుకొనుటకు వదలెను. తెలుపు నీలి యద్దములద్వారా వచ్చిన కాంతియందు వారనేకగంట లాడుకొనుచుండిరి. బహు స్వల్ప దినములలోనే కాళ్ళకు బలముగలిగి కుర్చీకి బ్రాకి పాకాడ నడువగలిగెను. తరువాత నన్ని శిశువులవలెనే నదియు మిక్కిలి వికాసముగా నుండెను. బలహీనముగను నీరసముగను నుండు శిశువులుగల తల్లిదండ్రులు శిశువులుండు గదుల కిటికీలకు

సగము నీలియద్దము సగము తెల్లనియద్దము నుంచినచో వారి మేదస్సు చల్లబడి జీర్ణశక్తి వృద్ధియై మానసికనాడి యుద్రేకములుతగ్గి యారోగ్యము గలుగునని గుర్తింప వలయును.

## (7) Spinal Meningitis & Baldness.

## వెన్నుపాములో తాపము, బట్టతల.

జనరల్ ప్లైజన్టన్గారు ఈక్రింది సమాచారమును జెప్పుచున్నారు:— "ఒక యిల్లాలు తన కొమార్తెను వెంట బెట్టుకొని న్యూయార్కునుండి ఫిలడల్ఫియాకు కృతజ్ఞతను దెల్పుటకై వచ్చెను. 4 సంవత్సరములక్రిందట నామెయీ కొమార్తెకు తీవ్రమగు కశేరుకాతాప ముండెను. ఆమెకు నీ తీవ్రమగు వేదన యెడతెగకుండ నుండెను. ఈ 4 సంవత్సరములనుండియు మెఱిగియున్నంతవరకు మందు లన్నియు వాడినారు. ప్రయోజనము లేకపోయెను. ఆమె నాడీమండలము మిక్కిలి చెడిపోయెను. ఏమాత్రపు ధ్వని వినబడినను, యేమాత్రపు గాలి గొట్టినను యామె వెన్నున తీవ్రమగు మంట గలుగుచుండెను. రక్తమాంసము శుష్కించెను. ఆకలి, నిద్ర సన్నగిలెను. జీవితమే బరువయ్యెను. జనరల్ ప్లైజన్టన్ గారి కాంతిసమ్మేళనమును నామె తలిదండ్రులు విని చేసి చూచుటకు నిశ్చయించుకొనిరి. ఒక కిటికీలో ఒకటి తరువాత నొకటిగా నీలి తెల్లని అద్దము లిమిడ్చిరి. ఆపిల్ల యా కిటికీలో నుండి వచ్చు వెలుగునందు ప్రతిదినమును గూర్చుండ నారంభించెను. ఆమెకు జికిత్సించు వైద్యు లావిషయమునువిని యిది డంబమని యపహసింప నారంభించిరి. వైద్యులేదేని క్రొత్త

సంగతి వినినప్పుడు ఇట్లే యపహసింపుచుందురుగదా! వారి కది స్వభావమె లెండు! వారు వైద్యులను వదలివేసి యీనీల కాంతియద్దము నే నమ్మి యుండిరి. ఆగదిలోనికి బోవుటతోడనే నామెకు బాధ తాత్కాలికముగా నుపశమించి గదిలోనుండి వచ్చినతోడనే బాధతగ్గి ప్రత్యక్షమగుచుండెను. అదియును నానాట తగ్గిపోయెను. ఆమె తత్వము వెంటనే బాగుపడ నారంభించెను. ఆమె యాకలి, నిద్ర లభివృద్ధియై స్వాభావిక స్థితికివచ్చెను. దానితో నామె బలారోగ్యములు వృద్ధియై రక్తమాంసములు బాగుగాఁగలిగెను. వెండ్రుకలు రాలిపోయి యామెతల కోడిగుడ్డువలె నున్నగానుండెను. వారివైద్యుడు భూతయద్దముతో బరీక్షజేసి వెండ్రుకలు మొదలంట రాలి పోయినవనియు నిక నెన్నటికిని మొలవవనియు జెప్పెను. పదు చుతనము పొందనున్న బాలిక కావార్త యమభటుని పిలుపు కన్నను కఠినతరముగాదోచెను. టోపీదగిలించుకొని తిరుగుట కన్న వెచ్చనిభూమాతృగర్భమునందలి క్రిమికీటకాదులచే వినాశ నమునొందుటయేని సుఖమని యామెకుదోచెను. నీలికాంతి చికి త్సవలన యామెతలపై వెండ్రుకలు మొలచితీరినవని, టోపీ దీసి వైచినది. ఏయువతియేని యసూయపొందదగిన నీలాభ్రము వంటి పెన్నెరులతో నామె జనరల్ ప్లెజన్టన్ గారియొద్దకు వచ్చెను. తన ప్రాణమును ప్రాణమునకన్నను ప్రియమైన కేశములను రక్షించి తనకొసంగిన ప్లెజన్టన్ గారికి నామె యనేకవందనసహస్రము లర్పించెను. తెలుపుతోగూడిన నీలి కాంతియొక్క ప్రభావమును జీవఓషధుల కద్దానివలన గలుగు నత్యద్భుతమగు నుద్దీపకస్వభావమును దెల్పుట

కెన్నియేని యుదాహరణముల నీయవచ్చునుగాని చోటులేమి వానినిమాని వానియొక్క స్వభావమును బ్రశంసించుచున్నాము." Correspondence of the Chicago Tribune by Dutton 12-1-1877 న్యూయార్కు ట్రిబ్యూనులోనయిత మీవార్త ప్రచురింపఁబడినది. వ్రేళ్ళకొనలతో తలను నేర్పుగా మర్దనజేసినచో నందలిచర్మ ముద్దీపనబొంది దట్టమైన వెండ్రుకలు వచ్చునని నేను కనిపెట్టితిని. దేహమును నిషీకరించి పక్షవాతము, పిచ్చినిగలిగించు మందులను తలకువాడుటవలన, యీసూక్ష్మశక్తుల నుపయోగించుటవలన నెంతటిమేలు కలుగునో దీనినిబట్టి గ్రహింపవచ్చును.

(8) Concussion & Inflammation దెబ్బ, మంట.

23-1-1877 తారీఖున చికాగో ట్రిబ్యూనులో జ॥ ప్లైజటగారు బండిదిగుటలో తగిలిన దెబ్బనుగురించి యిట్లు వ్రాయుచున్నారు:— "నాకుడిభుజము కుడిప్రక్క వీపు దెబ్బతినినది. అదృష్టవశాత్తు తల పగులలేదు. ఆదెబ్బతో నూపిరి క్షణకాలమాగి తిరిగివచ్చెను. ఎవరో దయామయులగువారు నన్నులేవదీసి యొకచోటికి జేర్చిరి. ఒకగంటైన తరువాత సమీపములోనున్న మాయింటివైద్యుని బిలిచి నాదేహమును బరీక్షింపగోరితిని శ్వాసాశయపు టెముకలును, నితరయెముకలును నేమియు విరుగలేదనియు, గొన్నిచోట్లమాత్రము చితికినవనియు జెప్పెను. ఆబాధమాత్రము చాలకాలమనుభవింపవలసియే యుండుననియు జెప్పెను. ఆమాటలో జీవితకాలమంతయు గుదురునను నాశయేలేక మిక్కిలిబాధ ననుభవింపవలసియే యుండుననుభావ మిమిడియుండునని నాకు

దెలియును. ఆత డేదో మందు నిర్ణయించెను. దానివలన నిసు మంతయేని ప్రయోజనము గాన్పింపలేదు. బాధలేడ తెగం తీవ్రముగానుండెను. దగ్గుటలో వెన్నులో నొప్పిగల్గుచుం డెను. కుడిశ్వాసాశయము వెనుకభాగమున చాలనొప్పిగా నుండెను. అది శ్వాసాశయపు టెముక దెబ్బతగిలినదని తలం చితిని. శ్వాసాశయములందలి మంటకలిగి దానికి సంబన్ధించిన పక్కటెముకయును బాధగానుండెను. ఇదిచూచి డాక్టరుగారు చాల భీతినొందిరి. ఇంకొకటి జెప్పెను. దానివలనను ప్రయోజనము గలుగలేదు. నేను స్నాన ముజేయు గదిలో కిటికిలో సగము నీలియద్దము సగము తెల్ల అద్దము వేసియుండెను. అందుండి స్వచ్ఛమైన వెలుగు లోనికి వచ్చుచుండెను. ఆవి నా వివస్త్రముగానున్న వీపుపైఁబడ గనే బాధ తగ్గ నారంభించెను. అరగంటలో బాధ పూర్ణముగా తగ్గెను. సాయంకాలమునకు బాధ తిరిగి వచ్చెను. నీలికాంతి స్నానము చేయుటకుపూర్వమునకన్న చాల తగ్గివచ్చెను తిరిగి నీలికాంతి స్నానముజేసితిని. క్రిందటి రాత్రికన్న నీ రాత్రి సుఖ ముగా నుండెను. మరునాడు పూర్వదినమువలెనె సూర్యుడు ప్రకాశమానముగా నుండెను. మబ్బులు లేవు. చల్లని గాలి. నీలికాంతి స్నానముజేయదలచి డాక్టరుగారుకూడా కాంతి స్నానమహాత్మ్యము జూతురుగాకయని వారిని పిలువనంపితిని. పెన్‌సిల్ వ్యానియా సర్వకళాశాలయందు శరీర విశ్లేషశాస్త్ర ము, శస్త్ర శాస్త్రములందు పండితులుగానున్న డాక్టరు డి. హేస్ ఎగ్న్యు గారిని బిలచితిని. నేను కాంతిస్నానము జేయు చుండగా ఆయన వచ్చెను. నే నున్నచోటు జూపిరి వారిని

జూచుటతోడనే:— "అయ్యా నేనిప్పుడు తెలుపు నీలికాంతి స్నానము జేయుచున్నా"నని" యంటిని. చూచితిమ. యపహాస్యమగు చిరునవ్వొకటి నవ్విరి. దానిపై "అయ్యా నాకదియే మేలుజేయుచున్నది. అందు తెల్ల యద్దముపై చేయి యుంచు డంటిని. అప్పుడు దానిపై చేయియుంచి చాల చల్లగనున్నదని జెప్పిరి. నీలి యద్దముపై చేయి యుంచుడంటిని. దానిపై చేయియుంచి "అబ్బా యెట్లు? ఇది వెచ్చగానున్నదే! నేనీ సంగతి నిదివర కెఱుఁగ" ననిరి. 'అవును యీ సంగతి డాక్టర్లకు తెలియదు. అది 15 సంవత్సరములనుండి వారికి దెలిగిం చుటయె నాకోరిక. నేనది కనిపెట్టితి'నని' యంటిని. 'సరే గది వెచ్చగా నున్నది. ఇం దెచ్చటనేని నెగడియున్నదా' యని వారడిగిరి. 'లేద' ని నేనంటిని. గోడల కన్నిటికిని బయట గాలి తగులుచున్నది. అంతర్గృహమేని గా'దంటిని. మరి యిది యెట్లు గలిగెనని వారడిగిరి. 'అదియును నేను గనిపెట్టినది. నీలి, తెల్ల యద్దము లుపయోగించుటచే గలిగిన వేడి యది యని నేనంటిని. "డాక్టరు ఎగ్స్ వంటి పండితులకు సయితము శుద్ధకాంతియందు సూర్యకాంతితో జేరిన నీలవర్ణ మత్యధిక యుష్ణకరమైనదను నీస్వల్పవిషయము తెలియదనుట వలన యీశాస్త్రము వారిదాక పోలేదనియు, యీ సున్నిత శక్తుల వ్రిభావము వారికిఁ దెలియకున్నదనియు, దోచుచున్నది ఇది వరకే నేనువృద్ధిజేసిన దృశ్యశాస్త్రమును వారెఱుఁగకుండుట వలన తామేగనిపెట్టితిమని స్లైజంటనుగారు చెప్పియుండిరి.

(9) Rheumatism etc. మేహవాతము.

డాక్టరు రాబర్టు రోహాలెండ్ గారు నాకు విలియం పోి యశల్ గారిని యొప్పజెప్పి చికిత్స చేయగోరెను ఆమెకు 8 సంవత్సరములనుండి మూత్రవ్యాధి. దానివలన మేహవాతము. మోకాళ్లు వాచినవి, కీళ్లు బిగుసుకపోయినవి, కాళ్లు వంకర తిరిగినవి, యెడమచేయి భుజము మొద్దుబారినవి. స్నేహితులు పట్టుకొనినగాని యాగదిలో నేని కదులలేకుండెను. ఎఱిగియున్న చికిత్సలనన్నియు జేసిరి. ప్రయోజనము గలుగలేదు. నీలి తెలుపు అద్దములు కలిపి వాడుటచే నెమ్మదిగను థారాళముగను గుణమిచ్చ నారంభించెను. ఆమె యింటి కిటికీలన్నియు సగము తెలుపు సగము నీలి అద్దములతో నమర్చిరి. తెల్లని అద్దములమధ్య కూర్చుండబెట్టి వివిధవర్ణముల కాంతులు యెక్కువగావచ్చునట్లు చేసినప్పటికన్న యీ తెలుపు నీలి కాంతులు దగిలినప్పుడెక్కువసౌఖ్యమును బాధోపశాంతిని బొందెను. ఆకుపసుపునీలమురంగుగల తెరతో కాంతి యొక్క పరిమితిని, ప్రదేశమును, సరిజేయుచుండెను. (అనగా కాంతి తగులవలసినచోట తెర అడ్డము లేకుండను, కాంతితగ్గి తగులవలసినచోట గంగుతెర అడ్డముండునట్లు పెట్టుట) ఆమె మోకాళ్ళకేగాక వెన్నుపామునకును, మెడ నరములకుకూడ కాంతిని ప్రసరింపజేసుకొనుచుండెను. చలికాలములో వివస్త్రముగా (దిగంబరముగ) జేసినను ఆమె కిసుమంతయేని శైత్యము తగులక మేలేజేసెను. నీలి కాంతి దేహమందు పడినప్పుడెల్ల శీతముదోచి దావాపు వెంటనే హితవగు వెచ్చదనము గలుగుచుండెను. తెలుపు నీలము దేహమునకు దగిలినచోటనెల్ల నీలవర్ణమునందలి చల్లదనమును

తెల్లని కాంతియందలి వెచ్చదనమును దగిలి సమ్మేళనమును బొంది యీగలువాలినట్లు దోచుచున్నదని జెప్పెను. దీనివల్ల విద్యుత్, రసాయనికశక్తులు యీద్వివిధవర్ణములవలన గలుగుచున్నదని గుర్తింపదగును. ఇట్లు 8, 9 మాసములు చికిత్స జేయగా మోకాళ్లు సహజపరిమాణమును బొందెను. చేయి, భుజము పూర్తిగా కుదిరెను. వ్రేళ్లు వంకిరలు తగ్గెను. కీళ్ళయందలి రోగముబోయి బాగుగా దిరుగనారంభించెను. ఇప్పుడు బాగుగా నడువగలదు. ఆమెకింతవరకు యెక్కువబలము గలుగకున్నను వెనుకటితో పోల్చిచూచినచో నామె మిక్కిలి మార్పుపొందినట్లు కనుపించుచున్నది. 'ఆదిత్యపేటిక' యందు నెఱ్ఱనికాంతితో జికిత్సచేసినచో నామెకిట్టి కాలికవ్యాధి నింతకంటె నెన్నిరెట్లో త్వరగా నయమయ్యెడిది. ఈ యాదిత్యపేటికకుతోడు, యంగమర్దన సైతము జేసినచో ప్రతిమేహవాతమును విధిగా కుదురును. ఈకాలికవ్యాధియందు కేవలము నీలము నుపయోగించినచో నవకాశము కలుగును. కాని తెల్లయద్దముతో సమ్మేళనము నొందుటచే రోగము కుదురుటకు కారణమైనది. ఇట్టి అంతర్గతమగు వాతవ్యాధులు యుద్దీపనచేతగాని కుదురవు. అంతర్గతమగురోగము లుద్దీపనవలన ప్రత్యక్షమై వెనుకటిబాధలు తిరిగి కలిగి స్థితి చెడిపోవుచున్నదని భీతి కలుగును. ఇదియును యెక్కువకాలముండక 1 పూట, 1 దినమో మాత్రముండి నయమగుటకు తోడుపడును. అవసరమగునేని బాధ కలిగినచోట, నీలికాంతిగాని, నీలి యూదా కాంతిగాని ఒకసారి యెక్కువతూరులుగాని తాత్కాలికముగా ప్రయోగింపదగినది. ఆదిత్యపేటికయందు తలకు వెలుగుతగుల

కుండునట్లు నల్లని నీలికాంతిగలిసిన యద్దము సమర్థము. కేవలము నీలియద్దమునందు చల్లదనమునకు దోడు Mazzarine (మాజరీన్) నీలమునం దెక్కువ యుద్దీపక స్వభావమున్నది గాన నది యనేక విషయములలో సహకారిగా నుండును. వెన్నుక్రింది భాగమున కెప్పుడును నాకుపచ్చవర్ణము మంచిదిగాన మలుగుల కెప్పుడును నాకుపసరుకాంతి ప్రయోగింపఁదగినది. నాడీ తాపాదులకు నీలము-ఊదావర్ణములు గాని, నీలికాంతిగాని ప్రయోగింప వలయును.

## —* వివిధవిషయములు *—

జనరల్ ప్లెజన్టన్ గారి శ్వేతశ్యామవర్ణములనుగ్రంథము నుండి ఈక్రింది విషయమును వ్రాసి ముగించుచున్నాము:—"(1) మేజర్ జనరల్ ఛాస్. డబ్ల్యూ. శ్యాన్‌ఫర్డ్ గారి కుమార్తెకు రోగముకుదిరి మేలుకలిగినది. (2) ఫిలడల్ఫియా వాసి హెన్రీ హెచ్. హాలోవేగారికి 2 మాసముల నుండియున్న మహావాతము 3,4 శ్వేతశ్యామ (తెలుపు-నీలము) వర్ణకాంతులచే గుదిరెను. వారి పిల్లికి తీవ్రమగు రోగము కుదిరెను. (3) 2 గొఱ్ఱెపిల్లలు పుట్టినపుడు ఒకటి $3\frac{1}{2}$ రతులును, యొకటి 4 రతులు తూగెను. వానిని నీలి-తెలుపు అద్దము వేసిన దొడ్డిలో నుంచిరి. అవి 3 మాసములు తరువాత దూచగా మొదటిది 55, 2వది 51 రతులును దూగెను. వానిని ఒకేరకపు వెన్న దీసిన పాలతో పెంచిరి. (4) ఈగలు మొదలుగాగల బాధాకరములగుజీవులు నీలికాంతిలో నశించును. (5) శాకముల యభివృద్ధిని గురించి యింకొక భాగమున వ్రాసెదము. (6) ఒక

కంచర గాడిదెకు చెప్పుడు, మేహవాతము. దానితల మెడ నీలి-తెలుపు కాంతి యందుంచుటచే గుదిరెను. (7) పట్టుపురుగు లూదా కాంతియందు బాగుగా గుడ్లు పిల్లలను జేయును. (8) బలహీనముగానున్న ఆవుదూడ యత్యధికముగా నభివృద్ధి నందెను.

## 17వ కిరణము

**—* నీలము ఊదావర్ణము లపకారము జేయు కాలము *—**

పక్షవాతము, మలబద్ధము, కాలికమగు మేహవాతపు నొప్పులు, ఆమవాతము (దేహమంతయు వాతపునొప్పులు), కాలికమగు క్షయ, వాత, పాండుర, అంతర్గత వ్యాధులయందును, మనోవ్యాధి, మానసిక స్తబ్ధత, మానసిక నిమ్నత, మొదలగువాని యందును, రోగుల కడవరకే నీలమధికముగా నుండును; గాన శీతవర్ణములగు నీలము, నీలిమందువర్ణము, ఊదానీలవర్ణములు కలిసిన ఆకుపసుపువర్ణము చలువజేయునవి గాన వానిని వాడుట అపాయకరమైనది. కాన నిషేధింపఁబడినవి. ఫిలడల్ఫియా నివాసియగు డాక్టరు ప్యాన్కోస్టు రంగు కాంతులచే రోగములను గుదుర్పుటయందు మిక్కిలి సమర్థుడు. నీలికాంతిని గురించి యిట్లు వ్రాసెను:—"నాడుల యొక్క యుద్రేకమును కలిగించుటయందు యెఱుపువర్ణమెంత సమర్థమైనదో నీలికాంతి నాడుల యుద్రేకమును తగ్గించుటయందంతసమర్థమైనది. చిన్న మోతాదులుగా నిచ్చినచో కాంతిని కలిగించునదై, నిద్రను గలుగజేయును. కాని నిద్రకలుగుట తోడనే యీకాంతిస్నాన మాపివేయ వలసియుండును. నా

డులు మిక్కిలి యుద్రేకించియుండి వాని యుద్రేకమును వెంటనే తగ్గింపవలసి యున్నప్పుడు మాత్రమే కేవలము నీలి కాంతిని ప్రయోగింపదగినది. అనుక్షణమును రోగిని గనిపెట్టి యుండనిచో కేవలము నీలికాంతివలన రోగికి అపాయము గలుగవచ్చును. శక్తియుడిగి పోవచ్చును. కాన కాలమును, పరిమితిని, దగ్గించు చుండవలెను. సామాన్యముగా నీలిఅద్దము తెల్లనియద్దముగల కిటికీలోనుంచివచ్చు వెలుగులో 2 గంటలు కాంతిస్నానము జేయవచ్చును." కాని అమెరికావంటి యుష్ణ దేశమున మధ్యాహ్నపువేళ యెండలో సామాన్యముగా నం దరును 2 గంటల కాంతిస్నానమును భరింపజాలరు. ఇటలీ, గ్రీస్, ఇండియా, స్పెయిన్, ఫ్రాన్సు, ఆస్ట్రియా దేశము లందు ఇంగ్లండు, రష్యా, ప్రష్యా దేశములందువలె దీర్ఘ కాలము కాంతిస్నానమును సుఖముగా జేయజాలరు. నేను న్యూయార్కు సముద్రములో వెళ్లుచున్న స్టీమరు పైటాపుమీద వేసవికాలమునందు 7 గంటలు సూర్యకాంతి స్నానముజేసితిని. ఎడతెగక వచ్చుచున్న చల్లని సముద్రపుగాలివలన వేడికి తట్టు కొనగలిగితిని. చేతులును ముఖమునుమాత్రము యెండకు కొంచెము కాలినది. నీలిఅద్దము, గ్లిసరైన్ వాడుటచేత మంట తగ్గిపోయెను. ఈ కాంతిస్నానమునకు కలిగిన నూతనోజ్జీవము వలన స్నానముచే గలిగిన నీరసము క్రమముగా తగ్గిపోయెను.

## 18 వ కి ర ణ ము

### —* నీలవర్ణ మారోపించిన వస్తువులచే గుదుగుట *—

సూర్యకిరణము సెకండుకు 186000 మైళ్లదూరము నడ చును. వర్ణములనుబట్టి వివిధగతులుగ నడుచును. కాన సూర్య

కాంతియం దత్యద్భుతమగు శక్తికలదనియు, ఆయాకాంతి యారోపించిన వస్తువులకెల్ల నందలిశక్తిజేరుననియు సులభము గా గ్రహింప దగినది. ప్రపంచమునందలి ఖనిజ ఓషధి జీవ జాతులన్నియు నీసూర్యకాంతివలననే జన్మించి చిత్రవిచిత్రము లుగ వృద్ధినొంది వివిధవర్ణములను పరిమాణములను బొంది ప్రభాకరుని ఐంద్రజాలికశక్తిని, సర్వసృష్టినిర్మాణ శక్తిని, ప్రక టించుచున్నది. రేచిన్‌బాక్ సున్నితస్వభావముగలమానవులతో అనేకపరిశోధనలజేసి సూర్యకాంతి ప్రభావమునువివరించెను. ఒక దీర్ఘమైన రాగితీగెనుఒకకొన ఎండలోను రెండవకొన నొక చీకటి గదిలోనుంచి మిక్కిలి సున్నిత స్వభావముగల మనుష్యులను చీకటిగదిలోనికి పంపి వారికి డెలియకయే యందలి రాగితీగె కొనను వారి చేతులతో పట్టుకొనునట్లు చేయగా వారి చేతులకు మంచుగడ్డ చల్లదనమువంటి చల్లదనముదోచి, యాచలిచే వారి చేతులు బిగిసికొనునట్లు దోచెను. కాన సూర్యకాంతియందలి మిక్కిలి సూక్ష్మతత్వములు మిక్కిలిచల్లనివని వారియుద్దేశ్యము; గాని సూర్యకాంతియందు నిజమునకు శీతోష్ణముల యొక్క శక్తులు 2ను గలవు. అందలి శీతశక్తియు వారు జెప్పినంతటి శీత శక్తిగలదనుమాటనిజము; అది యెట్లనఁగ వేడిస్వభావముగల రాగి కడ్డీ తనయెదుటి శీతమును గ్రహించుటచే గలిగినది.

రేచిన్‌బాక్ 5 నిమిషములు యెండలోనుంచిన నీరు మెయిక్స్ అను నామె తెలియక దాగివి వెంటనే యది మం త్రింపబడినదనియు నానీరు పోయినంతదూరమును నాలుక

గొంతు, జీర్ణాశయము వరకును మిరియాల పొడివలె కారముగానుండి ప్రతిచోటను యీడ్పుగలిగించు చున్నట్లుండెననియుఁ జెప్పెను. ఆమెది మిక్కిలి సున్నితమగు తత్వమగుటవలన నట్లుగాన్పించెను. 9 పొరలుగల కాంతలోపము చే నారోపించిన నీటి కెంతటిశక్తి గలుగునో 20 నిమిషములు యెండలోనుంచిన నీటికెంతటిశక్తి గలుగును. రేబిక్ బార్ గారిట్లు వ్రాయుచున్నారు:—"రెకల్" అనునామె నా చెయ్యిపట్టుకొని వదలెను. తరువాత నేనెండలోనికి బోతిని. నాదేహమంతయు యెండ తగులు నట్లుండి లోనికివచ్చి నా చేయి యామెచేతి కిచ్చితిని. నాశక్తియందంత త్వరగా మార్పుగలిగి నందుల కామె యాశ్చర్యపడెను. కారణమామెకు దెలియదు. కాంతశక్తివలన మానవుని దేహము నందెంతటి మార్పుగలుగునో సూర్యకాంతివలన నాదేహము నందంతటి మార్పు గలుగుచున్నదని యామెయెరుగదు. మిక్కిలి తీక్షమగు నెండలోనుండి వచ్చినవారిని మేయిక్సు యను నామె ముట్టుకొని భరింపజాలకుండెను. అద్దము యినుము మొదలగు వస్తువులేవి యెండలోనుంచినను నవి యామెకు కాంతశక్తివలెనే దోచుచుండెను. శక్తిని గోల్పోయిన కాంతమును ఎండలోనుంచినచో శక్తియుతమైనదగును. సూర్య కాంతియందలి కాంతశక్తిని గురించి బాడ్గోసిజార్ టెట్ సి. యను వారును యిటులనేవ్రాసిరి.

సూర్యకాంతిని సీసాలతో మందువలె నిలువజేయవచ్చును. స్వచ్ఛమైన తెల్లని సీసాలో నీరుపోసి 2 దినములెండించి 2 దినములుత్రాగితిని. అది నన్ను దహించునట్లుతోచెను.

అది కేవలోదకమువలె నాకుదోచలేదు. తరువాత మోతాదు తగ్గించి త్రాగితిని. గుణమును ఆమోతాదున కనుగుణ్యముగ తగ్గియే గాన్పించెను. Reverton Neb March 18th 1894.

కాంతశక్తి గలవాని యొక్క వ్రేళ్లు సమీపముగా నుంచి కాంతశక్తిని బ్రయోగించినదక్క సామాన్యమగు నీటిని ద్రాగజాలని సున్నితమగు నారోగ్య స్వభావము గలవారుందురు. వారు త్రాగునీటికి కాంతశక్తిని ప్రయోగింపకున్నచో నానీటిని త్రాగజాలరు. అసహ్యించుకొందురు. ఆతపమునందుంచిన నీరట్టివారికి సర్వవిధముల నుపయోగి కారిగా నుండును. అట్టినీరు త్రాగుటవలన నందరికిని ప్రాణశక్తి యభివృద్ధినిఁ బొందును. సూర్యకాంతియందు 2 దినములు స్వచ్ఛమగు సీసాలో బోసియుంచిన నీరు సూర్యకాంతియందలి శక్తిని గ్రహించి శక్తివంతమగు నౌషధమగును. అది త్రాగినచో ప్రతివారికిని ధాతుశక్తి వృద్ధియగును. వర్ణారోపితము జేసిన వివిధద్రవ్యములచే దైవికమగు (దివ్యమగు) నౌషధ పరంపరను నిర్మింపవచ్చును. సూర్యకాంతియందుగల సున్నితమగు వర్ణములయందు సూర్యునియందలి శక్తులన్నియు నిమిడియున్నవి. నేనును నా యనుయాయులును జేసిన వివిధ పరిశోధనలచే వివిధవర్ణముల గాజుగుప్పెల ద్వారా రోగముల నివారించుట సాధ్యమని లోకమునకు వెల్లడించితిమి. జలము వర్ణారోపితము జేయుట సులభమగుటచేత దానిని వివిధవర్ణముల సీసాలలో నుంచి యెండలోనుంచుటచే నది వివిధములగు మందులుగా మారును. షుగర్ ఆఫ్ మిల్కు అనబడు పాలచూర్ణమును, పంచదారయు, తుమ్మజిగురును సైతము వర్ణారోపితము జేయవచ్చును.

అవి శీతోష్ణశక్తులలో వేనికిని జెందనివి. శ్యామయన నీలము. రక్తమన యెఱుపు. పీతమన పసుపు. ధూమ్రమన ఎఱుపెక్కువగను నీలము తక్కువగను గలసిన వర్ణము. హరితమన ఆకు పసపు. రక్తశ్యామమన ఊదావర్ణము. వీనికి "ఉదక" యని కల్పిన వర్ణోదకమనియు, చూర్ణమని గలిపిన వర్ణారోపితము చేసిన జిగురనియు, క్షీరయని గలిపిన వర్ణారోపితము చేసిన పాలచూర్ణమనియు; మధురయని గలిపిన వర్ణారోపితము జేసిన శర్కరయనియు యేర్పడును. అప్పుడు శ్యామోదకము (నీలివర్ణోదకము) పీతోదకము (పసుపు వర్ణోదకము) రక్తోదకము (ఎఱుపువర్ణోదక) మనియు నిట్లనే ధూమ్రోదక, హరితోదక, రక్తశ్యామోదకములనునవి యేర్పడును. ఇట్లనే శ్యామచూర్ణము వర్ణారోపితము జేసిన తుమ్మజిగురు (arabic gum), రక్తచూర్ణము (వర్ణారోపితము జేసిన జిగురు) యిత్యాదులును; ఇట్లనే శ్యామక్షీర, రక్తక్షీర, ధూమ్రక్షీర, పీతక్షీర, హరితక్షీర యిత్యాదులును; యిట్లనే శ్యామమధుర, రక్తమధుర, పీతమధుర యిత్యాదులు నేర్పడుచున్నవి. ఇవి మనచికిత్సాలయములందు వాడుకొనదగిన పేర్లు. వీని నేర్పుకొనుట గాని తెలిసికొనుటగాని కష్టమైన పనిగాదు. ఇదిగాక వర్ణారోపితము జేసిన వాయువును లోనికిబీల్చుటయును మనచికిత్సలోనిదే దీనిని వర్ణములకు వాయువను పదమును జేర్చినచో వర్ణారోపిత వాయువను నర్థము గలుగును. అప్పుడు శ్యామవాయువు రక్తవాయువులను నౌషధనామము లేర్పడును. శ్వాసాశయములకు ప్రధానమైనది వాయువు. శ్వాసాశయములే రక్తశుద్ధికిని ధాతుశక్తికిని కారణము లగుచున్నవి. కాన వర్ణవాయుశ్వాసనము

మిక్కిలి యవసరము. నీలికాంతియందు పూతినాశక (కుళ్లని వ్వని) స్వభావముండియు పూతినాశ కౌషధములందలి విష స్వభావము లేనందున నిది శ్వాసాశయ క్షయయందును శ్వాసాశయ వ్రణాదులందును శ్యామవాయుశ్వసనము (బీల్పుట) క్షయ వ్రణాదులయందు నూతనశకమును కల్పించినదని నమ్ముచున్నాము. దానిప్రయోగమునందు నాకు కొలది యనుభవమేగలదు గాని కొంచెము వేర్కొనదగిన విషయమును జెప్పెదను. ఒకయువతి యొడుగు మిక్కిలి రాచుకొని (గొంతురాసి) లేక (గొంతు బొంగురు) పోయి శ్వాసాశయమునందు నొప్పిగలిగెను. ఆమె యుపాధ్యాయిని. పైబాధ వలన పాఠశాలనుండి యింటికి రావలసివచ్చెను. నేనొక నీలి కుప్పె యామెకిచ్చి మూతి మూసి యెండలో 3, 4, సెకండ్లుంచి యందలి గాలి లోనికిబీల్చవలసినదని జెప్పితిని. ఇట్లు కనీసము 20 తూరులు చేయుట కామె యాజ్ఞాపింపబడెను. చికిత్స గారడివలె బనిచేసెను. మరునాడామె సుఖముగా బాఠశాల కేగెను. మామూలు నీలిసీసా సయితము వాడవచ్చును. కాని ఉబ్బెత్తురంగు కుప్పె వెడల్పుగను పలుచగను నుండుటచే గాలి త్వరలో వర్ణారోపితమగును. జర్మనీదేశస్థులగు కోక్ గారు కోకైన్ అను మోటుమందును గనిపెట్టినపుడు వందలాది జనులాయన యొద్దకు బరువెత్తిరి. దానివలన గొందరికి మేలుకలిగినమాట నిజమె. అయినను సంతకెన్ని యోరెట్లు చికిత్సాలయములలో జరిగిన మరణోత్సవముల కది కారణమయ్యెను. రక్తనుపడకుండ నున్నచో ఉబ్బసము, రొమ్ముపడిశము, మొదలగు కాలికవ్యాధులయందు రక్తవాయువు,

ధూమ్రవాయువు, ప్రయోజన కారిగానుండును. నీలము రక్తస్రావావరోధము జేయునదిగాన రక్తస్రావాదులయందెల్ల శ్యామవర్ణముపయోగింపఁదగినది. ఎఱుపు రక్తస్రావమునందు నిషేధింపఁబడినది. ఈశక్తులను గూర్చి పరిశోధన జేసినవారిని యీగ్రింథకర్త యభినందించు చున్నాడు.

ఇటలీయందు నానాదేశ వైద్యసమ్మేళనము జరిగెను. అందు సూర్యకాంతి పూతినాశకములలో నెల్లఘనమైనదని ప్రకటించిరి. సూర్యకాంతి యందలి పూతినాశకమగు నీలిధాతువు యొక్కప్రభావమిదియని వారికి దెలియక పోవచ్చును. అందొక ఫ్రెంచి డాక్టరుగారు కుళ్లెత్తిన పందిమాంసపు ముక్కను గాల్చి, రెండవదానిని యెండలో నెండవైచెను. ఎండలోనుంచిన దానియందొక శిలీంధ్రమేని లేకపోగా కాల్చిన దానియందింకను గొన్ని జీవించియుండెను.

సూర్యకాంతి ప్రసరింపని చీకటిగదులయందు భరింపరాని దుర్వాసనయుండుననుట సందరెఱింగినదే. పాస్చుర్ గారు సూర్యకాంతి జొరని గదులయందు సూక్ష్మజీవులు జేరునని వెల్లడించిరి

వర్ణారోపిత పదార్థములయందుగల రోగనివారక ప్రభాముకు చికిత్సాసాధనలను గురించి వ్రాసినపుడు వ్రాసెదను గాని వానిని గురించి గొందఱి యభిప్రాయముల మాత్ర మిచ్చుట జేర్కొనెదను.

(1) న్యూజిలెండులో ఆక్లండనుచోట ఆదిత్యపేటిక, విద్యుత్పేటికలతో సహా గొప్ప చికిత్సాలయమును స్థాపించిన Rev. Shirley, W. Baker. L. L. D గారిట్లు వ్రాయు

చున్నారు:—"వందలాది పౌనుల నాకిచ్చినను నారంగు కుప్పెల నితరుల కీయఁజాలను. అవినాకు నవజీవము, నవశక్తి నొసం గుటయేగాక ననేకులకు మేలుచేసినవి"

(2) విస్ కాన్ సిన్ వాసి Mr. P. L. M of Portage గారు 79 సంవత్సరముల వృద్ధుడు. అతిమూత్రిముచే కొంతకాలము బాధపడిన రోగి. పీతోదక, శ్యామోదకములను సలహా వలన దారిగుచు గుణమును బొంది యిట్లువ్రాసెను:- "ప్రారంభించినదాది యింతవరకును చెడులక్షణ మొకటియేని గావ్పింపలేదు. అదినాకు మేలేజేసినది. ఆ మేలు నిలుచుననియే నమ్మెదను" తరువాత జాబువ్రాయుచు నందు "నారోగ్యము బాగున్నది. వందనములు" అనివ్రాసెను.

(3) జర్మనీలోని ఆడోల్ఫ్ వాన్ గర్హార్డ్టు (Adolf Von Garhardt.) శ్యామక్షీర రక్తశ్యామక్షీరలను తయారు జేసెను. జేనయను పట్టణమువద్ద నొకశిశువునకుతిమురువాతము. వైద్యులందరును నది బ్రదుకదనియే తెలియజెప్పిరి. పై జెప్పిన క్షీరయను చూర్ణమును కత్తిమీాద పట్టినంత శిశువునోటిలో వేయగా 15 నిమిషములలో శిశువునకు తిమ్మిరులు తగ్గెను. ఆరోగ్యముగా నుండెను. పై యౌషధములందెల్ల నుపాయ రాహిత్యమును, తప్పక సుగుణమిచ్చుటయు, నది తాత్కాలికము గాక శాశ్వతముగా నిలచియుండుటయు నీతిని నయితము వృద్ధి చేయుటయు, మొదలగు సులక్షణములుగలవు. కాన నీమందులనే వాడవలసినదిగా నందరిని హెచ్చరించెదము.

---

# 19. వకిరణము.

## శుద్ధసూర్య కిరణమునందలి రోగనివారకశక్తి.

దైవదత్తమై శుద్ధమగు సూర్యరశ్మియే సర్వజీవజాతియుత్పత్తి వికాసములకును ప్రత్యక్షకారణమై యున్నది. ఇందు శీతోష్ణ శక్తులన్నియు నిమిడియున్నవి. దేహము రోగగ్రస్తమై సూర్యకిరణమునందలి యవసరవర్ణమును గ్రహించుకొను శక్తిని గోల్పోయినపుడు మాత్రమే వివిధవర్ణముల యద్దములద్వారా దేహమున కవసరమైన వర్ణమును విడదీసిప్రసరింపజేసి కొనుచుండవచ్చును. సూర్యకిరణమునందు ద్వివిధ శక్తులున్నను నుష్ణదేశములందుదేహమును వేడిని గలిగించు స్వభావముగలదై యుండును. అంతర్గతములగు రోగముల నదియుద్దీపనజేయును. సుకుమారులగు వారిపై నీకాంతి ప్రసరించినచో వేడియును నీరసమును గలుగును. అసూర్యంపశ్యలగువారి పాలిపోయిన నిస్తేజస్కపు ముఖములకన్న తగినంత కాలము సూర్యకాంతియందు దిరుగుచు చర్మమునం దందలి కర్బనిదము స్వీకరించుకొని శుద్ధతనుబొంది వికాసవంతముగా నుండువారి ముఖములు కొంచెము నల్లగానున్నను ఆరోగ్యతరములై యున్నవి. సూర్యకిరణమునందలి కర్బనిదము చర్మమునందుజొచ్చి చర్మమునకు యెఱుపునలుపురంగుల గలిగించును. అందువలన చర్మగతమగు నాడు లుద్దీపనబొంది రక్తము చర్మమునకంట వ్యాపించి శుద్ధినిబొందుచున్నది. దానివల్ల చర్మతలమునకు చైతన్యమును, తేజస్సు దార్ఢ్యము ముతుకదనము గలుగుచున్నవి. కొంచెపు యెండకు వేడిచే

యుటయు కొంచెపు చలికి శైత్యముచేయుటయు నిట్టివారికి గలుగదు. ఇట్టివారి కంతర్గతమై యుండు రోగాదులు స్వేదముగా చర్మతలమునకు వచ్చివేయును. దేహమునకు సమగ్రమగు సూర్యకాంతియందలి తీక్షణశక్తు లవసరమైనపుడు దక్క సామాన్యముగ తెల్లని యద్దములద్వారా సూర్యకాంతిని ప్రసరింపజేసినచో నందలి యత్యధికోష్ణము నతిప్రకాశము తగ్గి, సౌమ్యతనుబొంది కొన్నిస్థూలధాతువు లడ్డగింపబడి మృదుత్వమును బొందుచున్నవి. కేవల సూర్యకాంతిచే కుదిరిన కొన్ని రోగముల వృత్తాంతము లిటపేర్కొన బడుచున్నవి:—

## శైత్యమునాపుట (Prevention of colds etc)

ఒకామెకుయేకొద్ది చల్లగాలి తగిలినను శైత్యముజేయుచుండెను. నాసలహాపై కొన్నిదోజులు శ్వాసాశయముల మీదను యితరాపయవముల మీదను నున్న చర్మమునకు సూర్యకాంతిని ప్రసరింపజేయగా నామెకు పడిసెమే పట్టుటమానివేసెను. దేహమును దార్ఢ్యవంతమై వయస్సు వెనుకకు నడుచుచున్నట్లుండెను. తిరిగి యావ్యాధులు కాన్పింపలేదు.

## 2 Tumours, Mother's marks Etc.

## కాయలు, కణుతులు, పుట్టుమచ్చలు మొదలయినవి.

38 సంవత్సరముల నుండిసూర్యకిరణము యొక్క శక్తిని పరిశోధించు చుండిన ఆగస్టస్ బారన్స్ అను వారు న్యూయార్కులోని హెరాల్డ్ ఆఫ్ హెల్త్ అనుపత్రికలో నిట్లువ్రాసిరి:

"దేహమునందు బుట్టిన ప్రారంభదశలోని వ్రణములు గాని, నలుపు, యెఱుపు, ఊదా, గోధుమ వర్ణపు కాయలు గాని, కణుతులుగాని, పుట్టుమచ్చలుగాని, జిన్నవై యున్నను ముఖమంతయు కప్పునట్లు పెద్దవై యున్నను కేవలము సూర్య కాంతి భూతశుద్ధములతో ఒక్క రక్తబిందువైనను చిందకయే, ఒక కత్తిపోటైనను తగులకయే నొకగుర్తైనను లేకుండునట్లు బహుకొలది కాలములో బోగొట్టెదను. మామూలు కత్తితో గోసిన శస్త్రములకన్న నిందుబాధ చాలతగ్గి యుండును. శస్త్రమునందు పడు మచ్చలిందు బడవు. ముఖము తేటగా నుండును. కణుతులు మొదలగునవి మరలరావు. సూర్యకిరణ మునందు ఖనిజ రాసాయనిక విషములేమియు లేకపోవుటచే నిందపాయ మిసుమంతయేని లేదు.

శస్త్రవైద్యము సూర్యకిరణ చికిత్స వీనియందలి భేదములు.

1 ఇందంగవిచ్ఛేదముగాని రక్తస్రావముగాని చేయన క్కరలేదు. సూర్యకిరణముతో కాలిన ధమనియో సిరయో రక్తము నాపుటకు సాధ్యమైయుండును. (2) వ్రణమునకు దక్క తరువాత కట్టు కట్టవలసిన బనిలేదు (3) సూర్యకిరణమునందు విషములేదు. గాన విషీకరణ (విష) భయములేదు. (4) మచ్చ లుండవు. కాలుటచే గలిగిన యెఱ్ఱని మచ్చయైనను 1-6 మాస ముల లోపలనే యంతరించును. (5) 2 విధముల ననుభవించిన వారు శస్త్రమునందుకన్న సూర్యకిరణ చికిత్సయందు సగము కన్నను బాధతక్కువని జెప్పుచున్నారు. (6) ఇతరపనులను కట్టి పెట్ట బనిలేదు (7) శస్త్రము జేయు నప్పటివలె స్మృతిదప్పదు. (8) స్మృతిదప్పించుటకు మత్తుమందు లవసరములేదు. (9) చికి

త్వరితముగ ముగియును. సుగుణము శాశ్వతముగ నిలచును. బహు తేలికగా జేయవచ్చును. వైద్యుని యిష్టము ననుసరించి యెంత లోతుగా కాల్చవలయు నన్న నంతవరకే గాల్చ గలఁడు. అపుడమను కొన్నంతనే యాపవచ్చును.

సూర్యకాంతి గలచోట నెల్ల నౌషధ మున్నది. నూరుట, కలుపుటతో నిమిత్తము లేక సర్వజనుల కుపయోగ మగునట్టు సదా తయారుగా నుండును." మంటలతో గూడి యున్నపుడు నీలమును, కణుతు లపక్వముగా నున్నచో పసుపు నారింజవర్ణము గాని యుపయోగ కారిగా నుండును. శుద్ధ మగు గాజుకుప్పె లొక్కొక్కప్పుడు జేయుపనికన్న నుబ్బెత్తు నీలము, పసుపు—నారింజవర్ణపు గాజుకుప్పెలు గుణతరము గాఁ బనిఁ జేయును.

(3) Complication of diseases రోగముల విషమావస్థ

ఫ్రెంచిదేశపు సుప్రసిద్ధ వైద్యులగు బేరణ్ డూపే రెణ్ గారు యీ యత్యద్భుతమగు నారోగ్య వృత్తాంతమును వ్రాయుచున్నారు. ప్యారీసులోనున్న యొకామె వివిధ రోగ ముల సమ్మేళనముచే బాధబడు చుండెను. ఆమె కనేకులు వైద్యముచేసి నిష్ఫలులైరి. ఆమె తుదకు డూపేరణ్ గారి సలహా కోరెను. మందు వైద్యము నందాయనకు వైద్య ముప యోగింపలేక పోవుటవలనను ఫలాని యౌషధమని నిర్ణయింప జాలకసుఖరోగినిచీకటిగదిలోనుండితప్పించివెలుతురుగలవెలు కవీధికి చేర్చి యచ్చట సూర్యకాంతి యామెకు తరుచు తగులు నట్లుంచవలయుననియు విధించెను. దానివలన వెంటనే సుగు ణము గలుగ నారంభించి పూర్తిగా నివారణ మయ్యెను.

సూతియను వారి తల్లిదండ్రులకును ఇట్లే యత్యద్భుతముగా కుదిరెననివ్రాసెను. Dr. Forbes Winslow's "Influence of Light P. 171.

---

# 20 వ కిరణము

## సూర్యకాంతి లేమి వలన గలుగు దుర్భర స్థితులు.

సర్ జేమ్స్ వైలీగారిట్లు వ్రాయుచున్నారు:— 'St. Petersburgh లో వెలుగు తగులునట్టి యిండ్లవరుసలో కన్న వెలుగు తగులనట్టి యిండ్లవరుసలో 3 రెట్లు రోగులు ప్రతిసంవత్సరమును బాధపడు చున్నారు.'

1 Dr. Forbes Winslow గారు 'Light and its influence on Life and Health' అనుగ్రంథములోనిట్లు వ్రాసిరి:— "సూర్యకాంతి యెచ్చోట మిక్కిలి తక్కువగా దగులునో యచ్చోట నివసింపక తప్పనివారు దైహిక మానసిక రుగ్మతలచే మిక్కిలి బాధపడుదురు. సూర్యకాంతిని బూర్తిగా వదలిన వారికి పాండురోగము రక్తక్షయము మొదలగు వ్యాధులు రక్తము సరిగా లోపల ప్రవహింపకుండుటచే గలుగుచున్నవి. ఇట్టి స్థితిలో నున్న వారి ముఖములు శవముల ముఖముల బోలిపాలి యుండును. నేత్రముల పొరలు రక్తహీనముగానుండును. చర్మము ముడుతలుబడి తెల్లగా నుచము రుకారుచున్నట్లుండి మైనమువలె నుండును. బక్కచిక్కి యుండుట, కండరముల యందు బలహీనత, నంజువానివలె యుబ్బియుండుట, యెముకలు మెత్తబడుట, నాడీ యుద్రేకము, హృదయోద్వేగము,

ఆకలిలేమి, రక్తవమనప్రవణత, క్షయ, అంగవికృతి, మరుగుజ్జుద నము, తెలివితక్కువ, అకాలవార్ధక్యము గలుగును. ఇట్టి దుర దృష్టవంతులకుగలుగు సంతానము వికారముగానుండి బలహీనులై గండమాలాది వ్యాధులచే బాధపడుదురు."

Dr. Ellsworth of Hartford గారిట్లు వాకుచ్చు చున్నారు:—"ఒక సీమకుందేలును పట్టి చీకటిగదిలో నుంచినచో కొలది వారములలోనే క్షయవ్యాధి బుట్టి చచ్చిపోవును. దాని శ్వాసాశయమునందలి సూక్ష్మజీవులు క్షయదగిలిన మానవశ్వాసాశయము నందు వలెనే యుండి క్షయరోగికిగల లక్షణములన్నియు నుండును."

(4) అనేకులు తలగుడ్డలు గొడుగులు చీకటిగదులు అంతఃపుర నివాసములచే తమ యారోగ్యము జెడగొట్టుకొని పాలిపోవుచున్నారు. మిక్కిలి యెండగానున్నపుడు దప్ప గొడుగులు వాడరాదు. నావికులు వారిబిడ్డలును యెండ లోను గాలిలోను దిరిగిపనిజేయు వారగుటవలన వారారోగ్య ముగను దార్ఢ్యముగనుందురు. 'Chicago Tribune' Editorialలో నుండి యీక్రింది భాగము సంగ్రహీతము.

"ఈ (అమెరికా) దేశమున సూర్యునకును, ప్రజలకును యుద్ధము జరుగుచున్నది. సూర్యుండెట్లైని గృహములలోనికి బోవ దీవ్రముగా బ్రయత్నించుచున్నాడు. ఈ దేశపు బ్రజలెట్లైని వానిని దరికైన రానీయకుండ జేయుదమని శక్తియుక్తులను ధారబోయుచున్నారు. కిటికీలన్నియు మూసి, తలుపులన్నియు తాళములుపెట్టి కిటికీ తెరలను సయితము క్రిందికి దింపనిదే సాధారణముగా నమెరికాదేశపు స్త్రీలు తమపని

తీరినదని భావింపరు. ఇది యుదయపువేళ. దక్షిణము, తూర్పు వైపులనుండి వెలుగులోనికి రాకుండ జేయును. ఇక మధ్యాహ్నపువేళ తిరిగి యిల్లంతయు జూచి పడమటివైపునుండి వెలుగు లోనికి రాకుండ జాగ్రత్తచేయును.సూర్యు డస్తాద్రిని జేరి చీకటి దోతెంచువరకును యామె కిటికీలు మూసి, మందమైన తెరలువేసి యెట్లేని వెలుగులోనికి రాకుండ మాత్రము జేయును. ప్రతిదినమును ప్రతిఋతువును సూర్యకాంతిని నిషేధింపవలసినదే. వేసగిలో సూర్యకాంతి వేడిజేయును. గాన లోనికి రానీయదు. శీతకాలములో తలుపులు తెరచిన మంచు లోపలికి వచ్చి తివాచీలు చెడిపోవును. ఇంకొకకాలములో యింకొకయిబ్బంది. ఎట్లేని సూర్యకాంతిమాత్రము లోపలికి రాజనదు. ఇంతవెలుగులేని చోట పెరిగిన శిశువుల కెన్నిరోగములు! యెన్ని బాధలు! గుంటపూలు పూయుచుందురు. వారిని పల్లెకొంపలకు పంపిన వారొకింత తేరుకొందురు. అక్కడ నున్నదేమి? పల్లెనాడులోని శిశువులకందఱికిని నానందసంధాయియగు సూర్యకిరణమే.''

(5) మానవులకు సౌఖ్యసంధాయి యగు దేవబింబమగు సూర్యకిరణము దురదృష్ట వశమున మానవులకు తీరని శత్రువుగా పరిగణింపబడుచున్నది. రైలుకంట్రాక్టరులు మోటారు యజమానులు సూర్యకాంతి హితవుగానున్నప్పుడేని వెలుగును లోనికి రానీయరు. దానివలన శక్తి సౌందర్యము వృద్ధియగునని వారెఱుంగరు.

(6) పూర్వీకుల ప్రతిభవనమునకును బైభాగమున సూర్యకాంతి ననుభవించుట కేర్పాట్లుగలవు. రోమక సామ్రా

జ్యమున 600 సంవత్సరముల వరకు వైద్యుఁడన నేమో యెఱుఁగక వారు భాష్పస్నానములు, అంగమర్దన, సూర్యకాంతి, వ్యాయామములతోడనే తమ రుజలనన్నిటిని జయించి లోకములో నేజాతికినిఁ దేరిజూడరాని బాహుపరాక్రమ సంపదలచే మిన్నందిరి. ఇట్లంటినని యోగ్యులను సంఘమునకు వరదులును నగు వైద్యులను నేను నిందించుటలేదు. మానవదేహమను పవిత్రాలయమును మందులు, కోతలు, రక్తమోచన, కట్లు, పట్టీలచే బలహీన పఱచిరి. ధ్వంసము చేయక ప్రకృతియందలి సున్నితశక్తులను బ్రయోగించి జాతిని బాగుజేయు వైద్యవరులు మాకు వందనార్హులేయగుదురు.

Florence Nightingale గారిట్లు వ్రాయుచున్నారు. "గదిలోనికి సూర్యకాంతి ప్రసరించినచో నాగది యందలి వాయు వెంత పరిశుద్ధముగా నుండునో నెవరునెరుంగరు. (రోగియున్న గది కిటికీలు మూయరాదు) మూసి లోపల రోగి నుంచిన గదియందలి వాయువెంత యపరిశుభ్రముగా నుండునో జూచితిరా? సూర్యకాంతిచే శుద్ధి నొందక బోవుటచే చెడువాసన గొట్టుచుండును. సూర్యకిరణముయొక్క ప్రాముఖ్యతను గమనింపవలయును. గది శుభ్రముగా నుంచవలయును. ఆదిత్యుఁడు లేని చోట నాలోచనయే లేదు. ఆరోగ్యశాస్త్రమంతయు దీనినే జెప్పును. కొండ గుహలయందును, సూర్యకాంతి తగులని యిరుకుసందులలో మాత్రమె దుర్గంధము, అనారోగ్యము నుండును. జాతిమైణ్యమచ్చుటనే గాన్పించును. మనో దేహము లచ్చుటనే దిగనాశిల్లు చుండును. పాలి

పోయిన మానవుని దిగనాసిల్లుచున్న మొక్కను యెండలో నుంచుము. ఎక్కువ గాకున్నను చాలభాగము బాగుపడును. Notes on Nursing.

(8) మానవుల యొక్క జాతిక్షీణతయు నాశమును సూర్యకాంతి లేమి వలననే గలుగుచున్నదని ఫోర్ కార్ట్ గారు వ్రాయుచున్నారు. శుద్ధ సూర్యకాంతి శుద్ధ వాయువును తక్కువగా బ్రసరించుటవలన గనులు త్రవ్వువారు మిక్కిలి యనారోగ్యముగా నుందురు. బెల్జియంలో చైమేయను ప్రదేశము. 3000 జనసంఖ్య. కొందరు గనులు త్రవ్వెదరు. కొందరు వ్యవసాయకులు. యుద్ధమప్పుడు వ్యవసాయకులు దారుఢ్యవంతులు తమవంతు సిపాయలనంపిరి. గనులు త్రవ్వువారిలో నెంతకాలముజూచినను, దార్ఢ్యవంతులై యారోగ్యముగలవారు దొరకుటయే అరుదాయెను. యుద్ధమునకు వారనర్హులుగానె యుండిరి. Forbes Winslow's 'Influence of Light'

(9) లండన్ పాల్ మాల్ గెజెట్టులో డాక్టరు ఆన్ డూ్రవింటర్ గారిట్లు వ్రాయుచున్నారు:—"సెయింటు మారిసుజాతీయ పాఠశాలః గట్టించినపుడు దాని గాలియు వెలుగును ధారాళముగ గల పైభాగమున నాడుకొనుటకు సయితమేర్పాటుజేసినందుల కానందించితిమి. శిశువులకు గాలి, వెలుతురు జాలయవసరము. అది లేని శిశువులు పీనుగుకళ పడియుందురు. నగరములయందలి వెలుగు లేనిచోట నివసించు శిశువుల కెన్నియేని వ్యాధులు గలుగును. ఫోటోస్టూడియోవలె మనగృహముల పైయంతస్థులను, నందును శిశువులుండు

గదులకును వెలుఁగు వచ్చువట్లు నిర్మించుకొనుట తగును సూర్యకిరణ ప్రభావము తల్లులకు దెలియుచో గండమాలాదులుగల శిశువులను సూర్యకాంతి ధారాళముగా వచ్చు చోట సాధ్యమైనంత సరళమగు వేడిలో శ్వాసాశయముల ప్రతినిధియగు చర్మముపై వస్త్రములను దీసివైచి యాడుకొనునట్లు జేయుదురు. అప్పుడు వారికిఁగల రోగములు తగ్గిపోవును. వారికి సూర్యకాంతియు, ప్రాణవాయువును గావలసినంత జేరుకొనును."

(10) "సూర్యకాంతికి దూరమైనవారి దేహములయందలి తాంతవము, శ్వేతధాతువు, రక్తమునందలి యెఱ్ఱనికణములు తగ్గి వసయనబడు పదార్థము విశేషమై పెఱిగి రక్తము పాండురవర్ణమును ధరించుచున్నది. రక్తధాతువులు తగ్గిపోవుచున్నవి. సూర్యకాంతి, గాలి యననేమో యెఱుఁగక జీవించువారి ముఖములు రోగభూయిష్టములై యుబ్బి, తెల్లగా, పాండురముగ, క్షీణించియుండును. రక్తహీనమై పిశాచములవలె గాన్పింతురు. ఇట్టి యారోగ్యకర పదార్థమును విసర్జించుటచే, రక్తనిర్మాణమునందు మార్పును గలిగించి, దేహమునందలి ధాతుశక్తితగ్గి, నాడీమండలము బలహీనమై, హృదయము, మెదడు, కండరములందును మార్పులు గలిఁగి చెడిపోవుట సంభవించుచున్నది. Dr. Forbes Winslows.

---

# 21 వ కిరణము

## సూర్యకాంతి యెప్పు డపకారమైనది?

(1) తీక్ష్ణమై మిక్కిలి కాంతిగానున్న సూర్యకాంతి వేడి యెక్కిన మెదటిమీదను, మంటలుగను వేడి యెక్కియున్న కన్నులకును, సుకుమారులకును చెఱుపును అప్పుడప్పు డపాయమును జేయును. సారాయి, నల్లమందు మొదలగు మానసికో ద్రేకపదార్థముల సేవించువారికిని, మిక్కిలి చుఱుకైన మెద డుగలవారికిని, యుడుకెత్తిన యెఱ్ఱనిరక్తాభిసరణాధిక్యము గలవారికిని వడదెబ్బ తగులును. దానిని నీలము, ఊదావర్ణ ములచే కుదుర్చుకొనవలెను. (2) వడదెబ్బయందు తలనొప్పి, తలతిరుగుట, దృష్టిమాంద్యము, వికారము, వదియే మదిరి, మూర్ఛ, లేదా సంధి, యీడ్పు, తుదకు పిచ్చి, మెదడు పలు చబడుట, మరణమును గలుగవచ్చును. (3) మెదడు వేడిగా నున్నవారు వడతగులకుండుటకై యీక్రింద విధులవలంబింప దగినది:—(1) కొలదిగా రంగుగలిగి, లోపల నీలిపొరగలిగి వాయువు ధారాళముగా దగులు టోపీ ధరించుట. (2) వేడి జేయు మాంసాదులుకాని ఫలములను విరివిగాదినుట. (3) కణతలను, మాడునను గల వెండ్రుకలను తఱచు తడుపుచుం డుట. వెనుకభాగము తడపరాదు. (4) స్త్రీలు సవరములను ధరింపరాదు. (5) వడదెబ్బ తగులబోవునప్పుడు కణతలురెండు నొక్కి, తల వెనుకభాగమున బాగుగారుద్దుట. దానివలన మెదడులోనికి దొచ్చుకొనివచ్చు రక్తము వెనుకాడును. నుదుటను కణతలను చల్లనినీరు కొట్టుటమంచిది. (6) వడ రాకతప్పనట్లు తోచుచో తలకును, నుదుటికిని తడిగుడ్డచుట్టుట. వడదెబ్బ

తగిలినపుడెల్ల ముందరిభాగమునకు వచ్చిన రక్తమునంతయు మెదటినుంచి మరలించినచో వడదెబ్బతగ్గును. న్యూయార్కులో నేనుకుదిర్చిన యొకవిషయమును జ్ఞాపకమునకు వచ్చినపుడు యిదేగాక మూర్ఛ మొదలగునవియును సకాలములో చేబట్టినచో వెంటనే గుదుర్పవచ్చును. నేనొకరోగి యింటికిబోతిని. నేనులోనికి బోవునప్పటికిం జావసిద్ధముగా నున్నాడని యతని భార్యజెప్పెను. అప్పటికే వేడిచే 3 గంటలనుండి మూర్ఛతో నుండెను. అతనిస్నేహితు లతనిని గాలితగులని కటికిచీకటిగది లో గాలితగులనిచోట బరుండబెట్టిరి. అతనిచొక్కాలు మెడపట్టీలు తీయవలయుననియేని వారికి దోచలేదు. అందువలన స్థితి మరింతచెడెను. వెంటనే యతని వస్త్రము లూడదీయుచు మంచుగడ్డ (Ice-water)దెమ్మంటిని. ఈలోపుగ వీపు, పాదములు, కాళ్లు బాగుగారుద్దుచు మంచుగడ్డ వచ్చినతోడనే నుదుట, మాడున, కణతలమీద, ముఖమున యాగడ్డనుంచితిని. తల వెనుకభాగమున మాత్రము మంచుగడ్డ గూడదుగాన పెట్టలేదు. ఇట్లు జేయుటచే యుద్రేకమునకెల్ల కేంద్రస్థానమగు మెదడుముడుచుకొని చల్లబడి రక్తవాహికలరికట్టబడి రక్తము మెదటికి చొచ్చుకొని రాకుండనాగును. దానితో నాతఁడు కొద్దిగా కదలి బ్రతికియున్న లక్షణములు దోచెను. ఇదేకాలమున భరింపఁగలిఁగినంత వేడినీటిని మెడలమీదను దిగువను చల్లగా బోయుచుంటిని. శిరఃపృష్ఠమునకు మాత్రము తగుల నీయలేదు. దానితో నతనికి ప్రాణమువచ్చి, యీడ్పుకొన్పించి, వాంతిచేసుకొని లేచికూర్చుండి కుదిరినదనెను. 1, 2 దినము లేపనియుజేయవద్దంటిని. ఆతఁడు వినుట కంగీకరింపక పని

చేసికొనుచుండెను. పక్షవాతము, మూర్ఛ, మేధోపీడన, తల దిమ్ము, మొదలగువానియందెల్ల నీవేడినీటి చికిత్స మిక్కిలి యద్భుతమైన పనిజేయును.

## 22 వ కిరణము

### —* నిద్రకలిగించు పదార్థములు *—

నిద్రయొక్క స్వభావము సామాన్యముగా నర్థముగాక పోవుటవలన నిద్రగలిగించు విధానములందు పొరపాటుపడు దురవస్థ గలుగుచున్నది. ముందుభాగమునను న్న మెదటిలోని యణువులయొక్క యత్యంతమగు సంచలనముచే మానసికవ్యాపారమును అర్థాత్ మెలకువయును గలుగుచున్నది. ఈ అణువులిచ్చుట నుండి దేహముయొక్క యితరభాగముల కేగినపుడు మెదడు మనస్సు నెమ్మదిగానుండి నిద్రగలుగును. ప్రాణవాయువుతో శుద్ధిబొందిన శుద్ధరక్తము మెదటికి ధారాళముగాను నిరాటంకముగను బ్రవహించినపుడు బుద్ధి తీక్షణముగానుండి మెలకువగలుగును. యేలనన రక్తమునందుగల యణువులు చురుకైన వగుటవలనను యవి నాడులనంటి ప్రవహించును కనుకను మెదడునందలి యణువుల కుద్దీపనగలుగును. అంతటిదార్ఢ్యవంతమగు రక్తము యితర ప్రదేశములయందు సయితము తీవ్రమగుపని గల్పించుకొని మెదటినుండి రక్తము నంతటిని లాగుకొనునుగాన విదారికాలమునందు మంచి నిద్రను గలిగించును. రక్తము బలహీనముగానుండి శుద్ధముగాలేనప్పుడును తీవ్రమగు మానసికోద్రేక మున్నప్పుడును మెదటియొక్క ముందు పైభాగములు మూసికొనిబోయి మానసికాణువులు నడచుపట్టి నాళములు మూసికొనిబోయి జాగ్రదవస్థ

తగ్గి యసమగ్రమగు నిద్రకలుగుచున్నది. గాఢనిద్రయందువలె యీస్థితియందు దేహభాగముల నెక్కువ బాగుజేయఁజాలకున్నను నేదో యొక విధముగా బాగుజేయగలిగి యుండును. ఇట్టినిద్దుర నల్లమందు మొదలగు మత్తుద్రవ్యములచేతను గలుగును. కాని లండన్ లాన్సెట్ వ్రాసిననీవృత్తాంతముచే ఆలోపతిఆంగ్లేయ వైద్యులు నయితము నల్లమందువాడుకవలన గలుగునపకారములను గుఱించి పశ్చాత్తాప పడుచున్నట్లు దోచుచున్నది:—“మత్తుద్రవ్యములచేతను బాధోపశమనకారులనబట్టి వానిచేతను గలిగించు నిద్ర విషీకరణమువంటిది. మరణమపుడు గలుగు మానసిక స్తబ్ధత యంతతీవ్రదశలో గాకున్నను గొలదిగానైనను నాస్వభావముగల మానసికమాంద్యను గలిగి తీరును. ప్రాణాపాయకరమగు నీమత్తుమందులచే గలిగించు నిద్ర, సత్యమగు నిద్రకపహాస్యమాత్ర ప్రతిబింబమైయున్నది. చెడుమందులనువాడిన దక్క వీలులేనివారును వానివలన నిద్ర గలుగునని భ్రమపెట్టి విషౌషధముల ధారాళముగా వాడువారును వీనియొక్క వినాశకరమగు తత్వమునుఁ గ్రహింపజాలకున్నారు. దీనిని మాన్పింపవలసిన బాధ్యత మందువైద్యులపైనున్నది. వారివిధిని వారు నిర్వర్తింపనిచో యేప్రాయశ్చిత్తమును వారిపాపమును బోగొట్టజాలదు.”

2 పైదానివలన పసుపు మెఱుపు ధాతువులుగలిగి యుద్రేక స్వభావములుగల నల్లమందు నిద్రనుగలిగించుటకు కారణము గుర్తింపవచ్చును. అది మొదట మేదస్సుతో రసాయనికానురాగము గలదగుటచే మానసికోద్రేకమును గలిగించి చురుకుదనమును రసోద్రేకమును గలిగించును. అంత

రక్తముచ్చుటికి జేరినతరువాత నిద్రివత్తు వచ్చును. అది వేరిగులలోని వేడిని మెదటిలోనికి లాగునుగనుక దీనివలన నతిసారము భేదులు కట్టుచున్నవి.

3 నీలము, ఊదా, నీలిపందువర్ణములు నాడులను జల్లబరచి నిద్రను గలిగించును. ఐనను మలబద్ధకముగల రోగులకు వేరిగులలో నుండదగిన రక్తము తలకెక్కి నిద్రను బాడుచేయును. వేరిగులపై పచ్చునికాంతిని బ్రిసరింప జేసినను లేక పసుపువర్ణారోపితము చేసిన పదార్థముల నుపయోగించినను తలలోనికెక్కి నిద్రను జెడగొట్టినరక్తము వేరిగులలోనికి వచ్చి నాడులయందు దుదేరికముతగ్గి నిద్రబట్టును. మలబద్ధకముగా నున్నరోగులు పగటివేళ పసుపుపచ్చని సీసాలోని నీరుతాగి పరుండబోవునప్పుడు నీలివర్ణోదకము తాగుట మంచిది. జ్వరము తగిలిగాని మెదడు వేడియెక్కిగాని యున్నపుడు నిద్రపట్టనిచో నీలియూదారంగులచే మెదడు చల్లబడి నిద్రపట్టును. మెడమీదగాని వెన్నుపాము దిగువభాగమునగాని వెచ్చనిచెయ్యి బెట్టినచో నిద్రపట్టును. వేడినీట పాదస్నానము జేసినను నిద్రపట్టును. కణతల, నుదుటిమీదను తడిగుడ్డ యుంచినచో నిద్రపట్టును.

## 23 వ కిరణము

### —* వర్ణచికిత్సయందుపయోగించు పనిముట్లు *—

ఇంతవరకును మానవ ప్రపంచము నుద్ధరింప నుదయమగుచున్న సూర్యచికిత్సయందు వెలుగుయొక్కయు వర్ణములయొక్కయు నద్భుతమగు రోగనివారక ప్రభావమును గుర్తించియుంటిమి. ఆచికిత్స కుపయోగించు వివిధసాధన సామగ్రిని

సయితము గుర్తించినచో వివిధవర్ణములతో జికిత్సజేయుటకు సమగ్రి శాస్త్రమేర్పడును. వర్ణములను ప్రయోగింపదగిన పదార్థముల గురించి దెలసికొనుట ముఖ్యము. నీలిరంగుల అద్దము నెవరుజేసినదైనను యెట్టిదైనను వొకటే గుణమిచ్చును. అద్దముపై రంగుబూయుచో అద్దమునుండివచ్చు కాంతి ఈవెలుగు సరిగా చొరనికారణమున దాదాపు చీకటిగ నుండును. అద్దము జేయుటలో నేరంగుతో పోతబోసిన ఆరంగు కాంతిబాగుగా జొచ్చి శుద్ధమగు రంగుకాంతి యేర్పడును. ఇట్టి చేట్టమే కట్టవలెనని నియమములేదు. ఎట్టిచేట్టమైనను బనికివచ్చును. కిటికీలోనుంచుటకు వీలుగానున్న జాలును. వివిధవర్ణముల యొక్క రాసాయనిక స్వభావములనిటు పేర్కొను చున్నాను.

చిక్కని నీలివర్ణము:—యేమాత్రము యెఱుపుగలియనిచో మిక్కిలి శీతస్వభావముగలది. నాడులను మెదడును చల్లబఱచుటలోను యుద్రేకముల నణచుటలోను నిది అనన్యసామాన్యమైనది. పూర్తిగా నీలవర్ణము దొరుకదు. అయినను దాదాపు సరిపోవు వర్ణము సంపాదింపవచ్చును.

చిక్కని నల్లని ఆకుపసుపు:— ఇందు ఊదా, నీలము ఆకుపసుపు, పసుపు, యెఱుపు నారింజ వర్ణమును యెక్కువగ నుశానిచ్చును. చల్లదనములో మిక్కిలి సమర్థమైనది.

కాంతిగల తేటయైన ఆకుపసుపు:— యిందుండి యూదా నీలిరంగులును కొలదిగా నారింజవర్ణమును తగుమాత్రము పసుపు వర్ణమును ఆకుపసపు పూర్తిగను ప్రసరించును.

ఊదాయద్దము:—ఇందుపసపురంగుతరుగు.యెరుపుకొద్ది.ఆకుపసపు నల్లబడిపోవును. ఇతరవర్ణములు నీలిరంగులలో నణగును.

ఎఱుపు:—మిక్కిలి యందముగా నుండును. వేడిరంగుల నన్నిటిని కలుపుకొని నీలివైపునకు వ్యాపించును.

ఎఱుపుగలసిన నారింజరంగు:—సౌమ్యమగు వర్ణము లన్నియు నిందెగురగొట్టబడును. ఆకుపసుపు సైతము గొంచెము తగ్గును. నీలియూదా బెట్టినపుడు మాత్రము గొంచె మెఱుపు నిల్చును. పసపు నారింజ వర్ణములు బెట్టినపుడు చాలా భాగముతగ్గును. ఎఱుపు బెట్టినపుడు మిక్కిలి కాంతిగానుండి అద్దమునకు ఎఱుపు గలసిన నారింజవర్ణమును బాగుగా నిచ్చును.

శుద్ధమైన పసుపువర్ణము:—ఇందు ఊదానీలిమందువర్ణములు లేవు. చిక్కని నారింజ పసపుగలసిన ఆకుపసుపు తగ్గి కాన్పించును. తేలికనీలము చిక్కని ఊదారంగులోనికి వ్యాపించును.

నలుపుగలసిన పసుపు:—వేడినిజేయును. యిందుకొద్దిగా ఎఱుపు, తగుమాత్రము నారింజ వర్ణము, కొద్దిగా ఆకుపసపు, నీలిమందు కిరణములుండును. లోహమునందువలె బలవర్ధకస్వభావముగలదు.

## కాంతియొక్క రాసాయనిక శక్తి

హెచ్. యస్ హేఇఙస్ గారొక యాదిత్యపేటికను సంపాదించి 1889 సంవత్సరములో జికిత్స నారంభించెను. ఆయనకు నాడుల సంబంధమైన యీాష్పుగలదు. మహాసముద్రమున కావల నీవలనుండు జికిత్సాలయము లందన్నిటి యందు జికిత్సబొంది ఫలముగానక యీ యాదిత్యపేటికతో జికిత్స నారంభించెను. అందుకూర్చున్నపు డందుంచుకొనిన ధర్మామి

టరులో 80 డిగ్రీలవేడి యైనను లేకున్నను చెమటబోయ నారంభించెను. వేడిగాలి పెట్టెలో గూర్చున్నపుడు 150 డిగ్రీల వేడియున్నప్పటికన్న నుల్లాసముగను నానందముగను నుండి పూర్తిగనిండు జెమ్మటబోసెను. ఏచికిత్సకును లొంగని నరముల యీడ్పు దీనితో తగ్గెను. ఏచికిత్సయు సూర్యకాంతి యొక్క ప్రభావమునకు సాటిరాదని యాతడు గ్రహించెను. సూర్యకిరణముతో సంబంధములేని చికిత్సలలో కావలసినవేడిలో సగమైనను అవసరములేక యిందు చెమ్మటగలుగుట సూర్యకిరణ ప్రభావమును వెల్లడించుచున్నది. ఇంకను ననేకరోగనివారక వృత్తాంతములు నిందుజదువ గలరు.

## సూర్యకిరణములు — సూక్ష్మజీవులు

M. S. Army సర్జన్ జనరల్‌గారికి జేంస్ టిడెజన్ దార్ఫ్‌గారు వ్రాసిన యీక్రిందిజాబు న్యూయార్కు మెడికల్ రికార్డులో 10-11 1894 తేదీన ప్రచురింపబడినది:—"ప్రియమైన అయ్యా:—సూర్యకిరణములందు పూతినాశక, యంటువ్యాధి నిరోధకశక్తులుగలవని నేను గనిపెట్టితిని. 100,120 డిగ్రీల వేడియందు కుళ్లు నాపి సూక్ష్మజీవులను జంపుశక్తి గలదు. జంతువులకును మానవులకునుగల ప్రాతక్రొత్త వ్రణములమీద నీకాంతిని ప్రసరింపజేసితిని. బహుకొలది కాలములో యాతపస్నానమువలన కుళ్లుచున్న వ్రణమునందలి కుళ్ళంతయు బోయి యెఱ్ఱపుండుబడి త్వరలో మానుటకు సిద్ధముగానుండును. ఒకనికే 2 వ్రణములు పుట్టెను. అందొకటి మందులు పట్లతోడ ఒక మాసమునకు పూర్తిగా గుదిరెను. 2వది సూర్యకిరణ ప్రసారమువలన ఒకగంటలో కుళ్లు తగ్గికొలది దినములలోనే పూర్తిగా కుదిరెను.

వీనికితోడు అనేకవిషయములను జూచినవాడనగుటచే వ్రణ-
ములు, పుండ్లు మొదలగునవి ప్రాతవి క్రొత్తవిగూడ యీ
చికిత్సచే పూర్తిగా గుదురునని నమ్ముచున్నాను. వ్రణములే
గాక నింక యితరవ్యాధులకుసయిత మిది జయప్రదముగా
బనిజేయుచున్నది. ప్రకృతియందిదియు నొక చికిత్సారత్నము
గాగలదు."

సర్జన్‌జనరల్ గారు సయితము గాజుకుప్పెలను ప్రోత్స-
హించియుండిరి. అనేకులు నావర్ణచికిత్సాగ్రంథమునుండి భావ
ములనేగాక పదములను వాక్యములను సయితము దొంగిలిం
చుకొని తమగ్రంథములలో నెక్కించుకొని కృతజ్ఞులై నా
గ్రంథనామమైన స్మరింపని యధములకన్న డెజన్‌డార్ఫ్
గారుత్తములు. వారికి కృతజ్ఞుడను. పైవిషయమును వారే కని
పెట్టినను విషయముమాత్రము మిక్కిలి యొప్పియున్నది.



# 25 కిరణము.

## ఆదిత్యపేటిక




1వ. పటము.

వివరణము :—

1 మెదటికి తలకును చల్లదనమునిచ్చుటకును సూర్యకిరణముజొరని నీలియద్దము. ఇది మొద్దయిన తెల్లని (3వ నెంబరుగల) బిలోరీఅద్దముపైభాగము ననుండును. 2 రంగు అద్దము. నాడులను చల్లబరచుట గాని యుద్దీపనజేయుట కుగాని రక్తమునందలి వేడిని తగ్గించుటకుగాని హెచ్చించుటకుగాని అవసర మననుసరించి యిముడ్చదగినది. 6 రంగద్దమును యేప్రదేశమందుంచదలచిన నాప్రదేశమున నిలుపుటకు చీల. 4 సూర్యకాంతిని రోగి గూర్చున్నచో టికి మరల్పగల మెరుగుబెట్టిన నున్నని ప్రతిఫలింపజేయు రేకు. 55. పనిముట్టు యొక్క ముందరిచట్టము. 7 తలుపులోపల రోగిప్రవేశించి కూర్చుండును. ముందర అద్దమునుండి పనిముట్టు పైభాగమును మూయునట్లు నొకపరదా కప్పవలయును. ఆపరదా రోగిమెడకు చుట్టుమూయుగా తలపైకియుండును

బైట గాలినిశ్వసించుచుండవలెను. అపరదామందు చట్టమునకమర్చిన కొక్కెములను దగిలించవలయును. 8 సూర్యకాంతిని లోనికి ప్రతిఫలింపజేయు 4 వ అంకెగల చెకువంటి రేకు. 9 సంఖ్యగల కొయ్యాయందుగల కొక్కెమునకు పట్టుదారముతోగట్టి పైకిని క్రిందికిని జరుపనున్న రేకు. ఇది వైద్యుని యాదిత్య పేటిక. కుటుంబపు ఆదిత్య పేటికయందు అడుగుచట్టముండదు.

ఈ సూాదిత్యపేటికయు విద్యుత్ సంబంధముగలదియు యునైటెడ్ స్టేట్సులోను ఫ్రాన్సులోను 1889 సంవత్సరములో రిజిస్టరుచేయబడినది. ఇది మొదట యునైటెడ్ స్టేట్స్ లో 1884 సంవత్సరములో ప్రారంభింపబడినది.

ఆదిత్యపేటిక సూర్యసంబంధమైన స్వేదోపకరణము. ఉష్ణవాయు స్వేదోపకరణమునకును దీనికినిగల భేదములు: ఆదిత్యపేటికయందు ధాతుశక్తియు దార్ఢ్యమును వృద్ధియగును. 2 వ దానియందు నీరసదేహములకు బలహీనతగలుగును. దీనియందు పూతినాశక (కుళ్లునుబోగొట్టు) శక్తిగలదనుట చాల ముఖ్యవిషయము. వేడిగాలి, నీటియావిరి నాడులకు మిక్కిలి దుర్బలముగలిగించును. సూర్యకిరణములు చొరబారి నాడులను మనస్సును బలపరచును. ఆదిత్యపేటిక శారీరస్వభావశాస్త్రమునను సరించి నిర్మింపబడినది. వెచ్చగానుండు శిరస్సు చల్లనినీడక్రింద పెట్టెకు వెలుపలగానుండును. రోగగ్రస్థమైన భాగములలో వేడిమంటలుగల భాగమునకు నీలికాంతి దగులునట్లును రోగము కరుడుగట్టి వాతముగానున్న భాగములకు యెఱుపు, పసుపు, యెఱుపుతోగూడిన ఊదావర్ణము; మొదలగు వర్ణములు తగులునట్లును ఏర్పరచుట కనుకూలముగా నిర్మింపబడినది.

నాడీవ్యాధుల గుదుర్చుటలో సుప్రసిద్ధులును ఫిలడల్ఫియావాసులునగు డాక్టర్ వేల్ మిచెల్ గారిట్లు వ్రాయుచున్నారు:—"అనేకవర్తకస్థానములందు గతించిన 40 సంవత్సరములకన్న నిప్పుడు నాడీవ్యాధులచే గతించువారిసంఖ్య 20 రెట్లయినట్లు లెక్కలవలన దెలియుచున్నది. ఇది మొత్తముసంఖ్యలలో 4 వ వంతుగానుండును. యువతీయువకులయందే యిట్టిమరణములు విశేషము". సూర్యకిరణచికిత్స మిక్కిలి సున్నితమైన శక్తిగలదగుటవలనను, యది నాడులకు బలముగలిగించి రక్తమునకు ప్రాణశక్తి నిచ్చునదగుటవలనను, నది ప్రపంచమునకు వరప్రదానమువంటిది. కాంత శక్తిగలవాని చేతితో చేసిన మర్దనాదులును యిదేపనిజేయును. వేడిగాలి ఆవిరికట్టు మొదలగునవన్నియు రోగపదార్థమును వెలువరించును. ఆదిత్యపేటికవలన రోగపదార్థమింకను ధారాళముగ వెడలిపోవుటయే గాక ఇందలి అంతటను ప్రాణశక్తినిగలిగించు వైహాయసములు (Ethers) నాడులకు జీవనముగలిగించును. నాగరిక ప్రపంచమునందంతటను ప్రళయముగా బెరిగిపోవుచున్న పిచ్చిరోగుల సంఖ్య నాడులుచెడుటవలన గలిగినదే. మానవదేహమునందు కండరముల కుద్దీపనగలిగించి నడిపించునవియు రక్తనాళములను మెదటిని నడిపించునవియునగు నాడులను జక్కసేయుటకు మిక్కిలి సున్నితమగు తత్వముల నుపయోగింపవలసిన యవసరము గుర్తింపదగినది. చించినాటిలో హాంట్ అనునామెకు జాఠరసంబంధమైన యత్యగ్నిచే దినమునకు 500 తూరులేని చన్నీటిని ద్రాగుచుండెను గాని కడుపులో మంటమాత్రము తగ్గలేదు. అనేకయౌషధముల నిచ్చిరి.

గుణము కుదుర లేదు. రోగమునకు మూలకారణమగు నాడు లవరకును జేరవగినంత సున్నితతత్వము జలమునందు లేకుండు టచే నదియామెకు ప్రయోజనకారి గాలేదు. ఆమెకు నీలి ఊదా కాంతులచే తయారుచేసిన వర్ణోదకము నిచ్చుటచే కొలది దినములలోనే రోగనివారణ మయ్యెను. ఇతరచికిత్సలు నిష్ప్రయోజన మైనపుడు యీసున్నిత శక్తులచే గుదిరిన వ్యాధుల వృత్తాంతములం గొన్నిటినిచట వ్రాయుచున్నాము

## (1) SICK HEADACHE AND ACNE

## పార్శ్వపు నొప్పి- ముఖమున ఎఱ్ఱనిపొక్కులు

"డాక్టర్ యి. డి. బాబిట్ గారికి:— ప్రియమైన అయ్యా! మీ యాదిత్య పేటిక యొక్క ప్రభావమును వచింప మిక్కిలి యానంద భరితుడ నగుచున్నాను. ఇంతవరకును మనో దేహములకు రెంటికిని నూతనోజ్జీవమును గలిగించుటలో నిం తటి ప్రతిభావంతమైన జికిత్సను గనిపెట్టినవారు లేరు. ఇది ప్రతి యింటనుండదగినదని యానందముతో హెచ్చరించు చున్నాను. నేను నాభార్యయు తీవ్రమగు ఒంటి తలనొప్పిచే బాధపడు చుంటిమి. అది సూర్యకాంతిచే నంతరించెను" -జ్యాక్ ఎఫ్. గోర్. ఓంచినాటి పైసుగుణము గలుగుటకు 3 తీవ్రమగు నాతపస్నానములు మాత్రమే జేసిరి. అనేక సంవత్సరములనుండి గోర్‌గారి ముఖముపైగల పొక్కులు సయితే మాతరించెను.

## (2) HEAVY FEVER AND CATARRH ETC

## తలభారము-శైత్యము మొ॥.

శ్వాసాశయమునకు సంబంధించిన శైత్యము యుబ్బసము క్షయ మొదలగు వ్యాధులకు నాతపస్నానము లత్యద్భు

తముగా బనిజేసెను. చించినాటిలోని డబ్ల్యు. జేబ్లాల్ అను వారు 23-9-1884 తేదీన నిట్లు వ్రాసిరి:— "నేను 10 సంవత్సరముల నుండి శైత్యముచే తీవ్రముగా బాధపడుచుంటిని. గొంతుపై యెఱ్ఱకాంతిబడునట్లు ఆదిత్య పేటికయందుగూర్చుండి యొకయాతపస్నానము జేసిన తోడనే నా వ్యాధి కుదిరినది. ఆవ్యాధిలక్షణములు ఆగష్టు 1 తారీకునుండి యింతవరకును గాన్పింపలేదు."

## (3) RHEUMATISM మేహవాతము.

ఫ్రాన్సునుండి డాక్టర్ పాసలుగారు 25-11-1889 న ఫ్రెంచిభాషలో నిట్లు వ్రాసిరి. "నాచిరకాలమునుండి యున్న కండర సంబంధమైన మేహవాతపు నొప్పులు మీరు నిర్మించిన ఆదిత్యపేటిక గాజుకుప్పెలవలన కుదిరినది. వాని ప్రభావ మద్భుతమని విన్నవింపగలను". మేహవాతము, సంజు, శ్వాసాశయ క్షయ, నాడీ సంబంధ, వ్యాధులు రక్త సంబంధమగు వ్యాధులు ఆదిత్య పేటికాస్నానములచే నద్భుతముగా కుదురుచున్నవి. చికిత్సాప్రపంచమున నూతనశక మారంభమైనది.

## PULMONARY CONSUMPTION

## శ్వాసాశయము, క్షయ, మూర్ఛ (Epilepsy)

కాలిఫోర్నియానుండి,డాక్టరు. రోహ్వారుగారిట్లు24-12-1888 తేదిన ఆదిత్యపేటికనుగురించి వ్రాయుచున్నారు :-" ఆదిత్యపేటికతో నాకెక్కువయనుభవము లేకున్నను దానియొక్క రోగ

నివారక శక్తిని స్తుతింప జాలకున్నాను. ఒకామెకు క్షయ మిక్కిలి ముదిరి యుండెను. ఆమెబహుస్వల్పకాలమే జీవింపదగి యుండెను. 100 గజములైనను ఆయాసములేక నడువజాలకుండెను. మిక్కిలిగా దగ్గుచుండెను. పని యిసుమంతయేని జేయజాలదు. ఆదిత్య పేటికతో 7 కాంతిస్నానములు మాత్రమే జేసెను. అందు 4 స్నానములైనతర్వాత నాయాసము లేకుండ 2 మైళ్లు నడువ గలిగెను. ఇప్పుడామె తనయింటి పనులన్నింటిని జేసుకొనగలదు. ఇంకొకామెకు మూర్ఛ తేపకు 4-5 సార్లు వచ్చుచుండెను. 2 కాంతిస్నానముల మాత్రమే జేసెను. 25 దినములనుండి యీమధ్యఒకతూరియైనను మూర్ఛ తిరిగిరాలేదు."

ఇందు డాక్టరు రోహ్వార్గారు కాంతిశక్తిగల వారగుటచే రోగులదేహములను మర్దించి చికిత్సకు దొడ్పడిరి. సూర్యకాంతియందు రోగవిమోచక పూతినాశకప్రభావ మత్యద్భుతముగా నుండుటచే నిట్టి యద్భుత నివారణల కెల్ల నిదియే ప్రధాన కారణముగా గుర్తింప దగినది. తర్వాత నేమైనదో వర్తమానము దెలియలేదుగాని చికిత్సమాత్రము దీర్ఘకాలము చేసిన బాగుండెడిది.

## PARALYSIS FROM RHEUMATISM.

### మేహవాతము దానివలన పక్షవాతము.

వాషింగుటన్నుండి ఇ. జె. స్మిత్ అనునామె యిట్లు వ్రాయుచున్నది:— "ఒకామెకు మేహవాతమువలన చేతులు కాళ్లు చచ్చుబడెను. అవి యటునిటు గదలవు." తర్వాత తిరిగి ఇట్లు వ్రాసెను:— "వెనుక జాబువ్రాసిన తర్వాత 5 దినములు మబ్బులులేక సూర్యుడునిర్మలముగా ప్రకాశించెను. ఇంకను

5 కాంతిస్నానములు చేయించగలిగితిని. వానివలన చాలసుగుణములు గలిగెను. ప్రక్కపైపరున్నపుడు కాళ్లు జాలభాగము వంగెను. కూర్చున్నప్పుడు మోకాళ్లు గడ్డమున కానెను. విద్యుత్ కిరణములు తగిలినప్పుడు అవికొంచము యెగలాగినట్లుండెను. ఇప్పుడు 4 అంగుళములు సాగినట్లున్నవి. ఎక్కువ మంచి మార్పుగలిగెను. ఇప్పుడు బాగుగా స్పర్శ జ్ఞానము కలిగెను. మొద్దుబారిపోయిన కాలివ్రేళ్లిప్పుడు మృదువుగానుండి చేతివ్రేళ్లవలె నటునిటు కదలగలవు."

పై రోగి, చనిపోయిన పెరువియన్ మంత్రిగారిభార్య వేసవియందు కుటుంబముతోగూడ కలిసి షికారునకు వెళ్లుచుండెను. స్మిత్ నెప్పటివలెనే రోగముల నద్భుతముగ గుదుర్చుచుండెను. ఆమెవద్ద 900 వెలగల విద్యుత్ స్వేదోప కరణముండెను. దానికన్నునుయీచౌకయైన యాదిత్యపేటిక యెక్కువ బనిచేయుచుండెను. ఈవైద్యముతో నామెకు దీరికలేక సీమవకేగి విశ్రాంతి దీసికొనెను. అక్కడనుం డిట్లు జాబువ్రాసెను.

"వాషింగ్టన్. ప్రియమైన డాక్టరు బాబిట్ గారికి— మీరు 22-8-1890 నబోధించిన సిద్ధాంతములను దైవమునువలె పూజించుచున్నాను. నిత్యమును దానియందలి సత్యము రుజువగుచునే యున్నది. చాలయానందభరితురాల నగుచున్నాను."

## 6 GENERAL DEBILITY—GOITRE

### బలహీనత - మెడపైకంతి

టి. జె కోవన్. డి. యం. అనునామె యిట్లువ్రాయుచున్నది:— ఆదిత్యపేటిక గాజుకుప్పెలతో జేసిన జికిత్సలు మిక్కిలి జయప్రదముగా నుండుటచే నాకుగలుగు యానందమునకు మితిలేదు. నేనైదుగురు రోగులకు చికిత్సచేసితిని.

ప్రతి స్నానానంతరము సుగుణము గలుగుచునే యుండెను. వారీచికిత్సను జాలమెచ్చుకొనిరి. ఒకామె 8 సంవత్సరముల నుంచి రోగముతో నుండెను. అది కుదురదని వైద్యులందరును జెప్పిరి. ఆమెను నేనున్నచోటికి మోసుకొనివచ్చిరి. ఆమెకు 11 తూరులు కాంతిస్నానముం జేయించితిని. ఇప్పుడామె మంచముమీదనుండి లేచి యొకమైలు నడిచిరాగలదు. ఇంకొకామెకు మెడమీద పెద్దకంతి. ఆమెకు 3 కాంతిస్నానములు జేయించుట తోడనే కంతి యదృశ్యమయ్యెను. ఆమె చాల సంతసించెను."

## Dropsy, Rheumatism, Umbilical Hernia and Scrofula Combined in a person.

### నంజు, మేహవాతము, ఊదరబొడ్డు, గండమాల.

ఇవన్నియు నొక్కనికేగలవు. ఆదిత్యపేటికతో జికిత్స జేసినచో నంజు, యుబ్బు, జలోదరము మొదలగు వ్యాధులు కుదురును. ఈచికిత్సలకు దుర్జలములను స్వాభావికముగా వెలువరించి మూత్రపిండములు పిత్తకోశములకు జైతన్యము గలిగించు శక్తిగలదు. నేను చించినాటీలో నున్న 3 సంవత్సరముల కాలములో నాలోచించి యీపనిముట్టుమంగనిపెట్టితిని. సిలియా డబ్ల్యు. హంట్ అను నామెను నావద్దకు తీసుకొని వచ్చునప్పటికి మిక్కిలి భయాస్పదమైన స్థితిలో నుండెను. కట్టుపోటీ మీదనదప్పి కదలజాలకుండెను. మోకాలులలో యెముకలు అల్లుకొనిపోయి యనేక గ్రంధులతో బిగిసికొని పోయెను. ఊదరబొడ్డు యొకపటకాతో పైకి యెగగట్టి యుండెను. జీర్ణాశయదాహము, విపరీతమగు నంజు, వీనితో మిక్కిలి సంశయా

స్పదముగా నుండెను. కొలదివారములలో పట్కాతో నివృ
త్తములేకుండ బోయెను. ఆమెకు చాలమార్పుకలిగెను. సుప్ర
సిద్ధోపన్యాసకులగు డబ్ల్యు. సి. బోమన్‌గా రామెస్థితినిగూర్చి
యిట్లు వ్రాయుచున్నారు:— "సిలియా. డబ్ల్యు. హంటో
అనునామె 8 సంవత్సరములనుండి మందువైద్యులచేతులలో
నానాటికి వఱింత వ్యాధి వృద్ధియైయుండి యచట మిక్కిలి
సంశయదశలోను దాదాపు మరణాసన్నస్థితిలోనుండి చించి
నాటికివచ్చెను. ఆమెకు విపరీతమగు నంజును, ననేకమగు గ్రం
థులు, సంధివాతముచే మోకాలు బిగిసికొని పోయెను.
మందువైద్యముచే నానాటికి మరింతయెక్కువాయెను. ఆమె
డాక్టరు బాబిట్‌గారి చికిత్సలో 3 మాసములుండి దాదా పా
రోగ్యమును బొందెను. వంగి బిగిసికొని బోయిన మోకాలు
2 వ చికిత్సతోడనే సూటిగావచ్చెను. ఆమె చికిత్సారంభమున
271 రతుల బరువుండెను. కొలది వారములలోనె 50 రతుల
బరువుతగ్గెను. ఆమె మిక్కిలి యానందముతో 19 వ శతాబ్ద
మందు మానవ ప్రపంచమునకు భగవంతుడొసంగిన వరము
ఆదిత్యపేటిక యని వచించెను."

## 8 Rheumatism, anchylosed Joints etc.

### మహావాతము (సంధివాతము)

అల్లుకొనిబోయిన సంధుల యెముకలు:— 28-7-1884
లేదీన యం. ఇ. హాలండుగారు లెట్స్‌కానుండి యిట్లువ్రాసిరి.
"నేనుజేసిన చికిత్సలు జయప్రదముగా సాగుచున్నవని మీకు
వ్రాయనూహించితిని. కింగ్ అనునామె 4 వారముల క్రిం
దట నావద్దకు దాదాపు నడువలేక వచ్చెను. సంధివాతముచే

జేతులు ముడ్చుకొనిపోయెను చేతులో కఱ్ఱలేనిదే 1 నిము సమైనను నిలుచుండజాలదు. 4 వ కాంతిస్నానము తరువాత నామె లేచి భోజనమునకు బోగలిగెను. చేతిలో కఱ్ఱమరచి పోయెను. చేతులు ముడుతలు తీరుటచే రద్దుకొనగ లిగెను".

9 అనేక రోగనివారక వృత్తాంతము లిచటవదలివేయ వలయును. సవాయిజాతి వ్యాధులన్నియు యీయాదిత్యపేటిక (సూర్యకిరణచికిత్స) చే గుదురును. బలమైన పూతినాశిక స్వభావమును రోగపదార్థమును స్వేదముగావెలువరించు శక్తియును సూర్యకాంతియం దుండుటవలన దేహమునందలి సవాయిని వెలువరింప సామర్థ్య మిందుగలదు. సూర్యకాంతి యందు దిగంబరముగా జీవించు యాఫ్రికాజాతివారికి సవాయి తగులదనియు, అంటించినను త్వరలోనే విముక్తి జేసికొందురనియు, ఇది సూర్యకాంతియందు జీవించుటచే గలిగిన శక్తియనియు డాక్టరు లివింగ్‌స్టన్‌గారు చూపుచున్నారు.

10 కుష్ఠుసయితము మిక్కిలి తీవ్రరూపమును బొందనిచో యీయాదిత్యపేటికచే గుదురును. కుష్ఠుసంబంధమైన సూక్ష్మజీవులు సయిత మీకాంతిచే చచ్చి వెలువరింపబడును.

11 నానాటికి వృద్ధినందుచున్న భయానకమైన రాచపుండు యీకాంతి స్నానముచే గుదురును. 10, 12 తూర్లు యీకాంతిస్నానము జేయుచో దేహమునందున్న వ్రణసంబంధమైన సూక్ష్మజీవులన్నియు నాశనమును బొంది వెలువరింపబడును.

12 పిచ్చిజంతువులు కరచుటచే గలిగినపిచ్చి.—భయంకరమైన యీవ్యాధి యాదిత్యపేటికా స్నానముతో గుదురును.

ఫ్రాన్సులో డాక్టరు బుషర్‌గారు వేడిగాలి స్నానములు కట్లతో దాదాపు 100 టిని పైరోగములను కుదిర్చిరి.

ఈడుప్ప గలిగినతర్వాత సైత మూదేశమునందు బాష్ప స్నానము చేయించి పైపిచ్చిని గుదుర్పగా ప్రీతిభావంతమగు సూర్యకాంతిస్నానమువలన యెంతగా పైరోగము యొక్క మూలమగు సూక్ష్మజీవులు నశించునో యూహింపదగినది. పిచ్చిజంతువు గరచుటతోడనే కరచినచోట విషమును లాగివేయవలెను. అది సాధ్యముగానిచో తడిమన్ను కట్టినచో విషమును లాగుకొనును. మోటుధాతువులను రాసాయనికానురాగము చే స్వీకరించును.

## 26 కిరణము

The Electro - Thermolume (విద్యుత్ పేటిక)

సూర్యకాంతికి బదులు విద్యుత్కాంతితో సమర్పబడియుండుటచే పగలు రాత్రి యనుభేదము లేక సర్వకాలములందును దీని నుపయోగింప వీలుగానుండును. ఇదియునుసూర్యకాంతివలెనే తెల్లగానుండి వెచ్చదనము గలిగియుండును. సూర్యకాంతివలెనే దీనియందును పండ్ల (ఫలముల)ను బక్వముసేయు శక్తియు తీవ్రమగు సూక్ష్మజీవుల నాశనముసేయు శక్తియు గలవు. మామూలావిరిదీపములకన్న నిది యనేకరెట్లు మేలయినదయినను యావిరిదీపము (గ్యాసులైటు) సయితము గొంతగుణము నిచ్చును. ఫోటోదీయువారికి సూర్యకాంతివలెనే నిదియును ఫొటోపేపరుమీద నలుపును గలిగించును. దీనివల్లను వివిధములగు వ్యాధులు గుదిరినట్లు నివేదికములుగలవు.



బెర్లిన్ విశ్వవిద్యాలయములో పట్టముఁబొందిన డాక్టరు మీకరు అనువారు కనిపెట్టిరి. అది 1889 సంవత్సరములో యునైటెడ్ స్టేట్సులోను ఫ్రాంసులోను పేటెంటు చేయబడినది. ఎఫ్ ఈ. విలియమ్సు, బి. యం; యం డి. అనునామె న్యూయార్కులో నొకచక్కని చికిత్సాలయము స్థాపించెను. అందిట్టి విద్యుత్ పేటికలును చెమట బోసినతరువాత రోగులపై మంచుగురిసినట్లు సువాసన జేర్చిన నీలివర్ణోదకమును జల్లు పంపులును తరువాత దేహమునకు మర్దనజేయు నేర్పాట్లును గలవు. పనిముట్లను యెవరైనను జూచిపోవుటకు నేర్పాట్లు గలవు. న్యూజిలెండ్‌లో రివెరెండు షిర్లె డబ్ల్యు. బేకర్. యల్. యల్. డి. అనువారు సయుత మిట్టియుపకరణములతో నొక చికిత్సాలయము స్థాపించిరి. ఓహాయోలో తామస్ మూర్గన్ అనువారి వద్ద నొకవిద్యుత్ పేటికకలదు. వీరినామములన్నియు చరిత్ర ప్రసిద్ధము గావలెనని యిచట చేర్చుచున్నాను. దీనిని

బాబిట్ గారు 110 డాలర్లకమ్ముచుండిరి. అనగా దాదాపు 330 రూపాయలగును.

## 27 వ కిరణము

### The Chromo - Disc కేంద్రీకరోపకరణము.



ఈపనిముట్టు యెంతయెత్తులో నుంచదలచిన నంతయెత్తున నుంచుటకును, సూర్యుడేవైపుననున్న నావైపునకు పనిముట్టుయొక్క వెడల్పువైపు త్రిప్పుటకును నేర్పాట్లు గలవు. ఇది యిత్తడితో జేయబడి సూర్యకిరణములను కేంద్రీకరించునట్లు, ప్రతిఫలింప జేయునట్లు లోపల కళాయిచేయబడును. దీనికి మూతి వెడల్పుగానుండి వెనుకవైపున సన్నగానుండును. ఇదిగాని యింకేపనిముట్టుగాని దేహమున కంతటికిని గాంతిస్నానమొసంగునాదిత్యపేటికకుతుల్యమైనవి కావు కానిదీనివలన యొక ప్రత్యేకోప యోగమున్నది. దీనితో దైశికచికిత్సల

జేయవచ్చును. ఇందు రంగద్దములను గొట్టము యొక్క సన్నని వైపున నుంచుటచే పగిలిపోవును. అందువలన గొట్టము యొక్క వెడల్పువైపుననే రంగద్దముల నుంచవలయును. ఏరంగద్దమును వాడకుండునప్పుడు దీనికి సంపూర్ణ కేంద్రీకరోపకరణమని పేరు. ఇందు సూర్యునియందలి వర్ణములన్నియు ప్రసరించుటచే నిది యుష్ణముగానుండి చర్మమునకు యెఱ్ఱదనమును చైతన్యమును నొసంగును. దీనికే నీలము పసపు రక్తధూమ్రము శ్యామధూమ్రము రక్తము నను 6 గకముల అద్దములమర్చినచో క్రమముగా కేంద్రీకృతనీలము కేంద్రీకృత పీతాది వర్ణములు వచ్చును.

<u>కేంద్రీకృతనీలము:</u>— ఇది వేడిమంటలుగల ప్రదేశముల కేంద్రీకరించుటకును వ్రణములు రక్తస్రావము హృదయోద్వేగము మొదలగువానికిని ఆయాప్రదేశముల బ్రసరింప జేయవలయును. జీర్ణాశయ దాహమునకు జీర్ణాశయము మీదను, మూత్రాశయ దాహమునకును చులుకునకును మూత్రపిండముల పైనను, స్వరపేటికా దాహమునకు గొంతుపైనను, కామాతిరేకమునకు వెన్నుక్రింది భాగమునకును ప్రసరింప జేయవలెను.

<u>కేంద్రీకృతపీతము:</u>— ఇది నాడులకు చైతన్యమును గలిగించునదగుటవలన పక్షవాతమునకు మజ్జానాడి మీదను కాళ్ళచచ్చునకు వెన్నుక్రింది భాగమునను, పైత్యకోశమునకు చైతన్యము గలిగించుటకు కుడివైపున పిత్తకోశముమీదను, మలబద్ధకమునకు యెడమవైపున జీర్ణాశయము మీదను ప్రసరింపదగినది.

కేంద్రీకృతధూమ్రము:— అజీర్ణమునకు జీర్ణాశయము పై బ్రసరింపజేసినచో నదితగ్గును. రక్తముతో గలసిన ధూమ్రవర్ణము వాతికాజీర్ణములకును, నీలముతో గలసిన ధూమ్రము జీర్ణాశయమునందలి మందమునకును వేడికిని మిక్కిలి యుపయోగించును. వెన్నుపామున కావల నీవల బ్రసరింపజేసినచో మూత్రపిండములకును గొంతుకుదిగువ బ్రసరింపజేసినచో యుబ్బసమును గుదురును.

కేంద్రీకృతరక్తవర్ణము:— గట్టిపడిన చెడుకణుతులను హరించును. రక్తధూమ్రము కాలికములగు సంధివాతములకుప యోగించును. కేవలరక్తవర్ణము సున్నితతత్వముగల బలహీనుల కిదిమిక్కిలి యుద్రేకమునుగలిగించును.

(1) ( Dyspepsia ) అజీర్ణము:— చించినాటిలో రాబర్ట్ ఇక్లార్క్ అను నాయన జీవితమంతయు నజీర్ణముచే బాధపడుచు జీవితము ధ్వంసమయిపోయి బ్రదుకునాశ లేకుండబోయెను. ఆదిత్యపేటికాస్నానములవలనను కేంద్రీకరోపకరణములవలనను గాజుకుప్పెలవలనను నతనికి పరిపూర్ణారోగ్యము గలుగుటయేగాక దేహముబలసి కండలుబట్టెను. ప్రతిదినముదయమున కొన్నినిమిషములు కేంద్రీకరోపకరణమున నుపయోగించుటచే నాతడప్పుడు కోడిపుంజువలె యుషారగానుండుటకై కాంతని దేహముపై ప్రసరింపజేసుకొనుచుండెను. అతడొకజాబులో నిట్లువ్రాసెను:— ఆదిత్యపేటికాస్నానమత్యద్భుతప్రాణదాతయనినమ్ముచున్నాను జీర్ణశక్తినివృద్ధిజేయును. శైత్యమును నిరోధించును, బలవర్ధకము.

(2) మూలవ్యాధి, వంజు:— (Hemorrhoids Piles and Dropsy) చార్లెస్ బట్ గారికి చికిత్సజేసిన డాక్టరు డి హిగ్ బి గారిట్లువ్రాయుచున్నారు ఆతనికి మరణమునుగ లిగించు నంతటి మూలరక్తస్రావమువలన రక్తక్షయమేర్పడి గర్భమందునీరుజేరి యుదరములావెక్కెను. ఆతనికి వర్ణచికిత్స జేసితిని వెన్నుపైనను కాళ్ళపైనను కేంద్రీకృత రక్తవర్ణము 30-40 నిమిషములును, జీర్ణాశయము ప్రేగులకుడివైపున పసుపువర్ణమును, హృదయకోశము తలమీద దినమునకు 20 నిమిషములు నీలకాంతిని కేంద్రీకరించుచుంటిమి రాత్రులయందు 2 పెద్దచెంచాల శ్యామోదకమిచ్చుచుంటిమి. 2 వారములలో నుదరములావుతగ్గెను. ఆకలియు రాత్రులయందు నిద్రయువృద్ధి యయ్యెను. ఉదయకాలములో పెద్దచెంచాల పీతోదకమిచ్చుచుంటిమి. దానివలన ప్రేగులు కదలబారి దినమునకు 3-6 తూర్లు మలమోచనమగుచుండెను. 2,3 దినములు వాంతులాయెను. ఇప్పు డాతడు తనపనినితాను జూచుకొనుచున్నాడు.

(3) కుంటి:— (Lameness) సున్నితశక్తులయొక్క సామర్థ్యమును త్వరతయు నీక్రింది డాక్టరు హిగ్. బి. గారి జాబువలన గ్రహింపవచ్చును. క్లైన్ అనునాయన రంపపుమిల్లో 10-12 సంవత్సరముల పూర్వము పనిజేయుచుండగా పాదము నలిగెను. అప్పటినుండి గట్టిగా పనిజేసినను నడచినను బాధగలిగి యనేకదినములు నడువలేకుండ బోవుచుండెను. 5 సంవత్సరములక్రింద కేంద్రీకృత రక్తవర్ణమును బాధగా

నున్నప్పుడు కాలికిఁ బ్రసరింపఁగా కాలిబాధపోయి, యింతవర కు తిరిగి యాబాధగఁలుగలేదు.

## 28 ప్రకరణము
### (The Chromo-Lens గాజుబుడ్డి)



4 వ పటము

వర్ణచికిత్సాసాధనము చిన్నది ముఖ్యమైనది గాజుబుడ్డి. ఇదితాబేటికాయవలెనుండి 7 అంగుళముల మధ్య కొలతగలిగి 42 ఔన్సుల నీరుపట్టును. దీనికంఠమువరకు నీటితోగాని స్వచ్ఛమగుద్రవముతోగాని నింపినగానిదీనికిస్వచ్ఛరుగుదాద్రవకమగు (Transparent Lens) మధ్యోన్నత బింబ

స్వభావమురాదు. ఇవి వివిధవర్ణములుగానుండి నీరుపోసి యుండలోనుంచునపు డాయావర్ణముల ననుసరించి సూర్య కాంతినుండి వివిధౌషధశక్తుల నందుజేర్చుకొనును ఈశుద్ధమగు సూర్యకాంతియం దణగియున్న వివిధవర్ణములు వివిధపదార్థము లేననియు నవినీటిలోనికి జేరినప్పుడు వివిధశక్తుల నొసంగుచు న్ననియు గ్రహింపదగినది. వివిధవర్ణములవలన వహింపబడు వస్తువులతత్వములనుగురించి సూక్ష్మభాగములో వర్ణరసాయన భాగము (Chromo chemistry చూడునది).

పసుపురంగు వలన వహింపబడునవి:— లోహము భాస్వరము గంధకము స్వర్జకము కర్బనిదము మొదలగు ఉత్తేజకధాతువులు తమయందలి జీర్ణకోశమునకును గలి గించు విషస్వభావమును కాఠిన్యమును గోల్పోయి సున్ని తమై వ్యాదువై నీటియందు ప్రవేశించుచున్నవి. కేవల మందులన్ననో యవి స్థూలముగానుండి నాడీకేంద్రముల వరకు జేరజాలవు. కఠినమైనవగుటవలన చాల యపాయ కరములు. ఎఱ్ఱకిరణము వహించునవి లోహము తుత్తునాగము స్ట్రోనియము బేరియము ఋబిడియము మొదలగునవి మూర్ధ న్యమునుబొంది నీటజేరును. నీలికిరణములనుండి గంధకము రాగిము క్లోరిన్ మాంగనీస్ మొదలగునవియునీటజేరును. సూర్యకిరణములందు విషమిసుమంతయేనిలేదు. వానియొక్క

యోషధీరూపమునందున్నది. గాజుబుడ్డితో కేంద్రీకరింపదల చినప్పుడు గాజుబుడ్లెకంఠమువరకు నీటితోనింపి బిరడాబిగి ప్పి పిడి పైకుండునట్లును కాంతిపట్టదలచినచోటునకు 4-6 అం గుళములదూరమున నుంచవలయును. పసుపువర్ణమునందు వ్ర

స్థి జేయుస్వభావ ముండుటవలన పసుపుకుప్పెయందు బోయునీ రు కొంచెమునకు్కవగా బోయుసున్న చో నలిపగిలిపోవచ్చును. గాన కొంచెముతక్కువనీటితోనే నింపవలయును. గాలి వేడి గా నున్నపుడు పసుపుసీసాలోని నీరు 3-4 దినములకు మార్చు చుండవలయును. గాలిచల్లగానున్నపు డింకను యెక్కువకాల ముంచవచ్చును. నీలి కాంతి పూతినాశకమైన దగుటవలన యిం దులోని నీరు సంవత్సరముండినను కుళ్ళి చెడిపోదు నాఅనుభ వమునుబట్టి ఊదావర్ణోదకముసయితము చెడిపోదు. నీటిని వ ర్ణారోపితము జేసి మందుగా జేయదలచినప్పుడు రంగుగాజుకు ప్పెలలోబోసి 1 గంటకుతక్కువలేకుండ యెండలో నుంచవల యును. వీలుగానున్న యెక్కువగంటలుంచవలసినది. నేను వా ని నెల్లప్పుడును యెండదగులుచోట కిటికీలోనే యుంచుచుం టిని. రోగగ్రస్తములైన భాగములపై యీకుప్పెలను గొలది కాలము కేంద్రీకరించినచో నవివసపొరవరకును దగులును. లోనికిబుచ్చుకొనిన నీరు మత్వచమువరకును దగులును. అప్పు డు దేహమునకు లోపలనుండియు బయటనుండియును చికిత్స జరుగుచుండును. 2 విధముల గుణమిచ్చుటనుగురించి డాక్ట రు హిగ్ బి గారు చార్లెస్ బట్ గారి విషయములో వివరిం చియున్నారు. పైభాగమునజేసిన చికిత్సవలనను రోగములు గుదురుననుటనుగురించికొన్నియుదాహరణము లీయవలసియు న్నాము. కొనెక్టికట్ లో ఒకపత్రికాధిపతి కుడివైపున పసు పువర్ణపుకుప్పెను బహిరింపజేయుటచే పైత్యకోశ ముద్రీపనం బొంది పైత్యముయెక్కువై వికారబెట్టి త్వరలోనే పూర్తిగా మలవిమోచనము యెయ్యెను.

మిషిగాన్‌లో నొకవైద్యుని భార్యకు మెవ్విధమునను మల విమోచనము గాకుండెను. ఆదేశములో వేఱొక భాగమున నొక వర్ణచికిత్సకు డుండెను. అతనికి కాంతశక్తి సయితము దెలియును. అతడొక పసుపుకాగితమున కాంతశక్తినిఁ బ్రియోగించి వైద్యుని వద్దకుబంపెను. వైద్యుడు తనభార్య ప్రేగులపై దానినుంచెను. దానితో నామెకు 5 సార్లు విరే చనములయ్యెను. మామూలు పచ్చకాగితమైనను ప్రేగుల యందు కదలికను గలిగించునుగాని కాంతశక్తి నంటుబ్రియో గించుటచేతను ఎండలో నుంచుటచేతను దానిశక్తి యినుమడించును. ఈక్రింది యుదాహరణమువలన లోపలికిని పైకిని బ్రియోగించిన శక్తియొక్క పరిభావము బోధపడును.

(1) చెవుడు (Deafness):—కనడాలోని మాంట్రియల్ లో వర్ణచికత్సానాదూహ్యౌషధ (Chromo-Homeopathist) వైద్యులగు డాక్టర్ ఫుల్లరు గారిట్లు వ్రాయుచున్నారు:— "2 సంవత్సరములనుండి చెవుడుతో బాధపడుచున్న యొకని చెవిలో గాజుకుప్పెద్వారా పసుపురంగును తేపకు 15 నిమిషములచొప్పున బ్రిసరింపజేయుటచే వానిచెవుడు కుదిరెను. ఇంకను గొన్ని చికిత్సల జేసితినిగాని యవి ఫలవంతములు గాలేదు." చెవ్రులలోనినాడులు మాంద్యముగానుండి పని జేయనప్పుడుమాత్రిమే పసుపువర్ణము వాడదగినది. లోపలి నాడు లుద్రేకించియున్నప్పుడు పసుపుకాంతిని వాడినచో గుణమీాయనిమాట నిజమే. అప్పుడు నీలవర్ణమును వాడవలసి యుండెను. బహుశా అట్టి సమయములోనే ఫ్లూటర్ పసుపు

కాంతిని వాడియుండును. లోపలినాడు లుద్రేకించి యున్న ప్పుడు మాత్రమే సాధారణముగ చెవుడు గలుగును. నీలివర్ణో దకము చెవులో బోయుటవలనగాని నీలికాంతిని లోనికి ప్రస రింపజేయుట వలనగాని నిది కుదిరియుండును.

(3) పులుపురికాయలు, పుట్టుమచ్చలు:–(Warts, Moles etc) ఆల్బామాలోని జె. కె. డరత్ గారిట్లు వ్రాయుచున్నారు. 3 సంవత్సరములనుండి వైద్యులు కుదర్పజాలని గుంపుగానున్న పులుపురికాయలును శుద్ధమగు గాజుకుప్పెను 5 నిమిషములు మాత్రము కేంద్రీకరించుటచే నొకపనివానికి గుదిరెను.

ఒకామె ముక్కుమీదనున్న పులుపురికాయ 15 సెకం డ్లు భూతద్దమును పట్టుటచే ఓహియోలోని సి. నిల్ డి. యం. గారు గుదిర్చిరి. అనేకమైన పుట్టుమచ్చలు పులుపురికాయలు మొదలగునవి భూతద్దముచే గుదిరెను. తెల్లనిగాజుకుప్పె కాగి తముపై కేంద్రీకరించినచో కాగితము తగులబడును. కాని భూతద్దమువలె నుపయోగించదు. తెల్లని గాజుకుప్పెలో రంగునీటినిగలిపి అవసరమువెంట వాడుకొనవచ్చును. ఎఱ్ఱగా నుండు పుట్టుమచ్చలు మొదలగునవి త్వరలో నశించిపోవు టకు నీలికాంతిగల గాజుకుప్పెతో కాంతిని కేంద్రీకరింప వలసి యుండును. లేదా తెల్లనిగాజుకుప్పెలో నీలిరంగు కలుపవచ్చును. అప్పుడు బాధ తక్కువగానుండి యుపయోగ కరముగా నుండును.

(4) కొయ్యగండలు (Corns):—నొప్పిలేని పైభాగము ను దీసివేసి యెఱ్ఱగాజుకుప్పె కేంద్రీకరించినచో చిరకాలము నుండియున్న కొయ్యగండలైనను మానును.

(5) ఒకవిధమైన గోరుచుట్టు (Felon):— వ్రేలిపై అరగంట మెట్టని కాంతినిబ్రయోగించుటచే తీవ్రమగు గోరుచుట్టు నయమైనది. కేంద్రీకృత మెఱుపుకాంతిమైనచో నింకను త్వరగా గుదిరియుండును.

(6) INDIGESTION, INSOMNIA, NEURALGIA, అజీర్ణము, నిద్రలేమి, నాడులయందు పోట్లు.

వర్జెనాలో నొక పెద్దమనిషి యీక్రింది యత్యద్భుతమగు వృత్తాంతములను బంపెను. ఆయనపేరు ప్రచురించుటకు నొప్పుకొనలేదు:— "30—1—1895"

నా యజీర్ణమును బోగొట్టుటలో నీలివర్ణోదక మద్భుతముగా బనిజేసినది. నాభార్యకు నీలికాంతిచే గలిగిన గుణము అత్యంతాద్భుతమైనది. నా బావమరది బండ్లమధ్యబడి నలిగి చనిపోయెను. అదేచింతతో నాభార్యదిగులుపడి అనేకరాత్రులు నిద్రలేకుకుండ నుండెను. ఆమెకు నాడిసంబంధమైన తలనొప్పి ప్రారంభించి యన్నమునం దిచ్ఛతప్పెను. ఆమెస్థితి దలంచిన భయముగానుండెను. ఏమాత్రపు వెలుగును నామె చూడజాలక ఒక్కకాంతికిరణము గాన్పించినను ఆమె బాధలుపడుచుండెను. నేను కన్నులకు గుడ్డకట్టి యెండలోగూర్చుండబెట్టి నుదుటికి నీలికాంతిని బ్రసరింపజేయుటచే 5, 10 నిమిషములలోనే గూర్చుచున్నది. గూర్చున్నట్లు నిద్రబోయెను. అకస్మాతుగా మార్పుగల్గుటచే భీతిల్లితిని గాని యది యెక్కువకాల ముండలేదు. దైవికముగా గలిగిన యీమార్పుచే యామెకుగల తలనొప్పి పోటు నాడులయం దుద్రేకముతగ్గి మాన.

సోల్లాసము కలిగెను. తలనొప్పి నిశ్శేషముగాకుదిరెను. నిద్ర మేల్కాంచినప్పు డామెనడుగగా "ఒక చల్లని ప్రవాహము నుదుటి గుండా నుడుకెత్తియున్న మెదటిలోనికి బ్రవహించి బాధనంతయు సమయజేసెనని యామె జెప్పెను. ఈ చికిత్సను గనిపెట్టినవారికి పదివేల నమస్కారములు."

ఈ సున్నితశక్తులు త్వరగాఁబనిచేయుట సత్యమేమైన ను, 5, 10 సెకనులలో గుణమిచ్చుట మాత్ర మత్యద్భుతమైనది. ఇట్టి రోగనివారక వృత్తాంతము మిక్కిలి యద్భుత మైనది.

## SUMMER COMPLAINT-PARALYSIS

## వేసఁగిబాధ - పక్షవాతము

టోలెడో వైద్యకళాశాలయందలి ప్రొఫెసరుగారగు హెచ్. ఎస్ స్కెన్టులరు యం. డి. గారిట్లు వ్రాయుచున్నారు:— చిన్నపిల్లలకు గలిగిన భేదులకు శ్యామమోదక మద్భుతము గాఁ బనిచేసినది. మేధోసంబంధమగు నభిష్యందముచే గలిఁగిన Hemoplegia caused by cerebral Hemorrhage పక్షవాతమునకుపీతవర్ణఁపు కుప్పెతోను యద్భుతముగాఁగుదిరినది. అనేకౌషధములు వ్యర్థమైన తరువాత సిదిపనిజేసినది.

## మాంససంతానిక, మేధోశోధ, టీకావిషీకరణము.

## (Diptheria Hydrocephalus & Anti - toxin.)

చించినాటి (ఒహియో) లో సుప్రసిద్ధవైద్యులగు ప్రెడరిక్ ఇహ్రమాన్ గారిట్లు వ్రాయుచున్నారు:— "నేను శ్యామమోదకమును వాడిచూచుచుంటిని. అది యత్యద్భుతము గాఁ బనిచేయుచున్నది. మాంససంతానిక (Diptheria) యం

దివి మిక్కిలి యుపయోగకరముగా నున్నది. సాహూపోౣష ధములతోడ నిది జతచేసి వాడినప్పుడు మిక్కిలి యుపయోగ కరముగా నున్నది. మేధ్రోశోధ (Hydrocephaloid) యం దును నిది మిక్కిలిగా నుపయోగించుచున్నది. నీలము వాపును, మంటనుఁ దగ్గించును."

(Insomnia) నిద్రి లేమి.

నీలము, ఊదావర్ణముల నాడీయుపశమనశక్తి. రివరెం డు జోసఫ్ వైట్ (మాల్టకొబన్టారియా) గారిట్లు వ్రాయు చున్నారు:—డాక్టరు బాబిట్ గారికి—అయ్యా! 1870 వేసఁ గిలో మీవద్ద తీసికొనిన నీలిచిప్ప నుపయోగించుటచేత ఉద్రేకించిన నా నాడీమండల ముపశాంతిని బొందినది. ఇత రౌషధముల నుపయోగించినను నిరుపయోగముతై, యపకా రముజేయు సందర్భములందు సయితమిద్దానిచే నిద్దురగలుగు చుండెను.

అతిసారము, కొఱుకుపుండు, నిద్రిలేమి, పిరికితనము,
(Diarrhoea, Canker, Insomnia & Nervousness.)

జె. పి. తారకాడైక్ డి. యం. గారిట్లు వ్రాయుచున్నారు:—

"శ్యామోదక మింద్రిజాలమువలె బనిచేయుచున్నది. మానవజాతికి గలుఁగు సామాన్యవ్యాధుల కింతకన్న మంచి యౌషధమున్నదనుకొనను. అది వ్రిణమును తగ్గించి, మంటల నుపశమింపఁజేసి, నాడులను సౌమ్యబరచి, నిద్రిలేమిని బోగొ ట్టును. అతిసారము గలిఁగిన యొక ముసలి సిపాయికి శ్యా మోదకముచే నతిసారమును గుదిర్చితిని. 30 సంవత్సర

ములనుండి యనుదినమునున్న యీ యతిసారము 2 వారములలో గుదిరినది."

మలబద్ధకము, అతిసారము, మంటలు

(Constipation, Diarrhoea and Inflamations)

ఎడిక్ బర్గునుండి లూథరుపైని, యం. డి. (సూర్యకిరణ చికిత్సకుడు) యిటుల వ్రాయుచున్నాడు:— "పీతవర్ణపు కుప్పెతో ననేక మలబద్ధకపు రోగులను గుదిర్చితిని. కడుపులో నొప్పి వికారము లేక, మలమోచనమై విరేచనౌషధములతో వలెగాక గుణము శాశ్వతముగా నున్నది. మందు వైద్యులు తమయౌషధములతో గుదుర్పఁజాలని గ్రహణి శ్యామోదకముచే ననేకులకుఁ గుదుర్చుచుంటిని. కన్నులు మంటలుగా నున్నప్పుడు శ్యామోదకము మంటలనుఁ దగ్గించును. దేహమునందు వేడిగానున్న భాగములకును మెలుగురాపునకును శ్యామోదకపు తడిపొత్తి మిక్కిలి గుణమిచ్చును."

తీవ్రమగు గ్రహణి—వర్ణ సారూప్యౌషధ విధానము.

A fearful Diarrhoea — Chromo— Homeopathy.

మాంట్రిలునుండి డాక్టరు జె. హెచ్. ఫూటన్, యం. డి.గారిట్లు వ్రాయుచున్నారు:—ఒకడు 30 ఏండ్లవాడు మిక్కిలిగా దినిన భేదిమందులచే తీవ్రమగు నతిసారముగలిగెను. నీలికుప్పెలోపోసి 8, 10 గంటలు యెండలోనుండిన నీరు లోనికిచ్చుటచే నది కుదిర్చితిని. (దీనికి నాభి 30 × హోమోపతిమాత్రలను జేర్చితిని.) చికిత్స యింద్రజాలమువలె బనిచేసెను. భేదులును, నొప్పియు వెంటనే దగ్గెను. అంతకుపూ

ర్వము 8 గంటలనుండి 10 నిమిషముల కొకతూరి భేదులగు చుండెను.

## స్త్రీల వ్యాధులు (Female diseases)

## అసృగ్ధర-కుసుమరోగము (Menorrhagia)

చిన్‌చినాటిలో హెచ్.అనునొకనామెకు 3 వారముల కొకతూరి రజోదర్శనమగుచు కాన్పించినప్పుడెల్ల 8 దినము లత్యంతముగా రజస్సు వెడలుచుండెను. అండాశయములపై (Ovaries) ముట్లగుటకు కొంతముందుగా దినమునకొకింత కాలము నీలికుప్పెను కేంద్రీకరించుటచే ముట్లు (Menses) క్రమముగా 4 వారములకగుట సాగి తేపకు 2-4 దినములు మాత్రమె మైల వెడలుచుండెను. ఆరోగ్యమును మిక్కిలి యభివృద్ధి యయ్యెను.

ఒకామెకు శ్వేతకుసుమ (Leucorrhoea) గలదు. శ్యామోదకముతో చేసిన భగవస్తి ( Vaginal douche ) చే శ్వేతకుసుమ తగ్గెనని యొక యుపాధ్యాయిని వ్రాసెను. భగవస్తి వీలువెంట ప్రతిదినమునుఁ జేసికొనుచుండెను. కాని శ్యామోదకమునకన్న ధూమ్రోదకము శ్వేతకుసుమమునకు మిక్కిలి యుపయోగకారి.

చిన్‌చినాటిలో నొక వర్ణచికిత్సకుని భార్యకు యోని యందు మంటలు గలిగెను. ఆమె మలుగులు మెత్తున నుండు నట్లు పరుండి 2, 3 క్వార్టుల శ్యామోదకముతో భగవస్తి జేసికొనెను. ఆసీసు నెమ్మదిగా లోనికిబోయి తలనొప్పియు నీరసమును వెంటనే తగ్గిపోవుచుండెను. శ్యామోదకము

తక్కువగానున్నప్పుడుఁ పైంటు శ్యామోదకమున 2 క్వార్టుల (4 పైయింటుల) నులివెచ్చని నీరుజేర్చి వాడుకొనవచ్చును.

తేపకు 15 నిమిషములు చొ॥ మెత్తని కుప్పెనుఅండాశయములపై కేంద్రీకరించుచో రజోనిరోధముగాని రజోన్యూనత (Amenorrhoea) గాని నయమగును. కాంతశక్తిగల చేయి యండాశయములపై గొలఁదికాలముంచినను రజోనిరోధ మంతరించును. యోనిప్రదేశము మొద్దువారియున్నప్పుడు రక్తోదకముగాని, ధూమోద్రకముగాని వాడినచో నందు చైతన్యము గలుగును.

కాలికాతిసారము. (Chronic Diarrhoea)

లేక్ఫ్రుడ్ నుండి బి, యఫ్, సింక్లైర్, డి. యం గారిజాబు:—

సింక్లైరుగా రనేక రోగనివారక వృత్తాంతముల వ్రాసెను. అందొకామెచికిత్సయు గలదు. ఆమెకుగల యతిసారము నాపుటకామె ప్రతి వేసఁగి యందును 250,300 రూపాయలు వైద్యుల కిచ్చుచుండెను. సింక్లైరు శ్యామోదకమును తయారుజేసి నీలికుప్పెలోబోసి యిచ్చెను. 1-2 దినములలో నామెకు మిక్కిలి యనుకూలముగా నుండుటచే యింకను (శ్యామోదకము) నా యత్యద్భుతౌషధ మెచ్చటనుండునని తన్ను ప్రశ్నించెనని సింక్లైరు వ్రాయుచున్నాఁడు.

సింధువ్యాధి (Sea-sickness):—ఓకిరింత శ్యామోదకముచే ననేకులకు గుదురును. సింధువ్యాధి కిది పెట్టినపేరు. సముద్రముపై బ్రయాణముజేయునపుడు వికారము, వాంతి, తలదిమ్ము మొదలగునవి గలుఁగును. దానికి సింధువ్యాధి

యని పేరు. యి డబ్లియు పార్కరను నొక ధనికుఁడు సము ద్రముపైఁ బ్రయాణముచేయుటలో నతనికిఁ గలిఁగిన సింధు వ్యాధి శ్యామోదకముచే గుదుర్చుకొనెను. అతడు శ్యామో దకమును సింధువ్యాధికి 'నౌషధరాజము'ని బిలుచుచున్నాఁడు. అయినను నన్నిరకముల వ్యాధులయందును నిది శోధింపనం దున నిది యొకింత యతిశయోక్తియే యగును. డాక్టరు హిగ్బీ గారిట్లు వ్రాయుచున్నారు. "ఒకామె 54 సంవత్సరముల వయస్సుగలది. ఆమెకు తఱచు సింధువ్యాధి గలుగుచుండెను. నీలికాగిత (Blue tissue paper) మనేక మడతలువేసి కడు పుపైనుంచి, శ్యామోదకమును దినమునకు 3, 4 తూరులు లోనికిఁ బుచ్చుకొనుచు 7, 8 వందలమైళ్లు సముద్రప్రయాణ ము జేసి యింటికిబోయెను." ఆమెకు సింధువ్యాధి రానేలేదు. నీలికాగితమును ఎండయందు నీలికాంతి నారోపితముచేసి మరీ వాడుకొనుచుండెను.

నాడీదాహము, మలబద్ధకము (Neuralgia and constipation)

ఫ్రాంసునుండి డాక్టరు జె. లామొంటరి గారిట్లు వ్రాయు చున్నారు:--"అయ్యా! మీరుపంపిన వర్ణకేంద్రీకరణోపకరణ ము (Chromo-disc)ను రంగు కుప్పెలును, భద్రముగా జేరినవి. చిరకాలమునుండి హృదయవేదన (Intermittent Neuralgia of the cardiac plexus) యప్పుడప్పుడు గలుఁగుచుండెను. మిక్కిలి శ్రమజేసినపుడుగాని యుత్సాహమైన వ్యాయామము జేసినపుడుగాని హృదయశూల గలుగుచుండెను. ప్రథమమున శుద్ధకాంతి తత్సాధనముచేఁ కేంద్రీకరించితిమి. దానితో బాధయొకింత తగ్గి యిట్లే చేయనుజేయను మిక్కిలి యద్భుత

ముగాఁ బనిచేసినది. తీవ్రమగు శీతముచే నధికమైనప్పు డిట్టి వ్యాధి సయితము త్వరలోకుదిరెను. నాకు మేహవాతము (Rheumatism) ను మలబద్ధకమును నుండెను. విధించినట్లు పీతోదకము ద్రావుటచే నాకు సక్రమమగు మలమోచన మేర్పడినది.

ఆహారము, పాలు, నీరు, వర్ణారోపితముఁజేయుట.

---

వారి భార్య యిట్లు వ్రాసెను:—

"చిరకాలమునుండి నాకు ఎండలో నుండుటయనిన సహజప్రీతిగలదు. మీరు విధించినట్లు నడుచుకొనఁ గోరిక గలిగెను. నాభర్తయు, కాంతిస్నానములఁ జేసెను. ఆయన రంగుసీసాలు వాడలేదు. నే నావర్ణముల రంగద్దముల వాడితిని. ఇంతేగాక నిలువఁజేసిన వర్ణకిరణములను ఆహారము, నీరు మొదలగువానిపైఁ బ్రసరింపజేయుటచే నవి మిక్కిలి యద్భుతమగుఁ బనిచేసెను. గోరువెచ్చనినీటిని, పసుపురంగు గల సూర్యకాంతిలో నుంచితిమి. ఆనీరు పైత్యకోశము కాలేయము పేగులం దుద్దీపనఁగలిగించును. సూక్ష్మశక్తియగుట వలన, దానిగుణమును, సామ్యమును, గుణతమమును, శాశ్వతమై యుండును. ఇదియేగఁదా యీనీరేమిజేయునని యెవతును దీనిని వాడనందుకు విచారించుచున్నాను. ఒక కొన్ని కిరణములందుఁ గొన్ని ప్రత్యేక శక్తు లున్నట్లు పరిశోధించి గ్రహించితిమి. ఒక పచ్చనిపాత్రలో రొట్టె, పాలు, నీరు మొ

చలగునవియుంచి మెఱుపుకాంతిని బ్రసరింపఁజేసితిని. ఇట్లు చాలసేపు యెండలోనుంచి వానిని రుచిచూడగా నవి కారము కారముగను, కమ్మగను నుండెను. నా నాలుక చిరకాలమునుండి సున్నితముగనే యున్నది లెండు! కనుక సూర్యకిరణ ప్రసారమువలన వాని యందలి స్వభావము మారినది. అది దినుటవలన నా జీర్ణశక్తి బాగుపడెను. మామూలుస్థితిలో బరువుగనుండెడి రొట్టె పీత" రక్తసూర్యకాంతియందు విరివియై, తేలికగానుండెను. మంచి యెండలో 3 గంట లుంచిన పాలు, మిక్కిలి జీర్ణకరములైయుండెను. తల్లిపాలు లేక యితరపాలతో జీవించు శిశువులకిది యెంతయుపయోగకరముగనున్నదో గుర్తింపతగినది. సూర్యకాంతియందు బ్రవహించు జలము ద్రావు నా కితరములగు పానీయము లనవసరము. మామూలుగా నుప్పగను, గురువుగను నుండు జలము నీలికిరణ ప్రసారముచే స్నానపానములకు మిక్కిలి యనుకూలముగ నగును. ప్రభాకరుఁడు మన వైద్యుఁడు. ఔషధము గూడ నతఁడే. నాకు మీగ్రంథము పరాసు భాషలోనికి పరివర్తనఁజేయుఁగోర్కెగలఁదు. అనుజ్ఞ నిత్తురా? (అది యిప్పుడు పరాసు (French) భాషలోనికి పరివర్తనజేయఁబడినది.) నేను ను నాథర్తగారగు డాక్టరు లెమెయిటరుగారును, "మిమ్ముల ను, మీసేవను నభినందించుచున్నాము. సంభావనఁజేయుచున్నాము. గురుతరమగు మీసేవఁ గుర్తింపఁగలిగిన వారెల్ల

మిమ్ముల నభినందింపక మానరనియే మాతలంపు" ఆమెయే నీలికుప్పెతో నొకరికి ప్రాణరక్షణజేసితినని వ్రాసెను.

ఒక రంగు వేరొకరంగుగా గన్పట్టుట.

(Perversion of color vision.)

లివర్‌పూలనుండి జె బ్లాక్ బరన్. డి. యం. గారొక విచిత్ర వృత్తాంతమునుఁ దెలియఁ జేయుచున్నారు. దక్షిణాఫ్రికాలోనున్న యొక పెద్దమనిషికి యేది చూచినను నీలముగాఁ గాన్పించుచుండెను. డాక్టరులకుఁ జూపిరి. వారికి నేత్రముయొక్క రాసాయనిక నిర్మాణ (Chemistry of vision) మగోచరముగా నుండుటవలన వాని దృష్టిని బాగుచేయఁ జాలరైరి. అతఁడు విసిగి దక్షిణాఫ్రికాలో పని సరిపుచ్చుకొని యింగ్లండుచేరెను. దృష్టియొక్కగాని యితర స్థితులయొక్కగాని యాత్యంతకస్థితి దానియొక్క ప్రతికూల ప్రయోగముచే గుదురునని యాతఁ డీగ్రంథమునందు జదివియుండుటవలన వానిని యెఱ్ఱయద్దముగుండా సూర్యకాంతని జూడ నియమించెను. తేపకు 10 నిమిషములు చొప్పున 8 దినము లిట్లు సూర్యకాంతిని జూచుటచే నాతని దృష్టివైపరీత్య మంతరించెను. నేత్రమునందు రక్త, శ్యామధాతువు లుండుననియు, రక్తధాతువులు మిక్కిలి తగ్గి, నీలిధాతువు లధికమగుటచే నిది గలిఁగెననియు, సజాతి సజాతిని యుజ్జీవింపఁజేయునుగాన, యెఱుపు వాడుటచే రాసాయని కాకర్షణ (Chemical affinity) వశమున నేత్రమునందలి నీలిధాతువులు తగ్గి రక్తధాతువు లుద్దీపనఁ బొందెననియుఁ గ్రహింపఁదగినది. అప్పుడు నీలము

నకుఁ దగినంత యెఱుపు ప్రతిపక్షవర్ణముగా నేర్పడిన దని గ్రహించునది.

## అంతఃపటలము స్తంభించుట.

## (Amaurosis or Paralysis of the Retina)

దృక్నాడి యొక్క అంతః పటలమను భాగము చచ్చుపడుట.

అన్ని విధములగు చచ్చు (Paralysis) లును పసుపు గాని తేనెరంగుతోగాని కుదురును. తేనెరంగు కాంతిని చూచుచుండుటచే నిది గుదురును. గుడ్డితనమే గలుగుచో గుడ్డుమాత్రము తెరచియుంచి యాకాంతి దానిపైఁ బ్రసరింపఁజేసినచో రంగు క్రమముగా (Retina) పటలమునకుఁ దగులును. ఇదిపసుపు కుప్పెద్వారా కేంద్రీకరించుకొనవలెను. దానివలన నొప్పిగలుఁగు నేని వెంటనే కన్ను తాత్కాలికము గామూసి తరువాత తిరిగి చూచునది. ఇట్లనేకతూరులు చేయ వలయును. గుడ్డితనమునం దీచికిత్సవలన మిక్కిలి మేలు గలుఁగు నని నమ్ముచున్నాము. ఇం దీచికిత్స చేరవలసిన భాగము నకు జేరును. దీనికి నీలము నిషిద్ధము.

కంటిలో పొర (Cataract):- ధూమ్రవర్ణపుకుప్పెతో కాంతిని పొరమీద ప్రసరింపఁ జేయవలయును. ఈ పొర లకును, అంతఃపటలమునకును దేహతత్వము బలపడుటకునై ఆదిత్యపేటికా స్నానము లవలంబింపఁ దగినవి.

కండ్లకలక (Ophthalmia):—ఇందు కం డ్లెఱ్ఱగానుండి కలకయుండును. దీనికి నీలి కాంత ప్రసరణయు, శ్యామోదక క్షాళనమును మంచిది. పరుండఁబోవునపుడు శ్యామోదకఁపు

తడిపొత్తి కన్నులపై వేసికొని పరున్నచో నద్భుతమగు సుగుణము గలుఁగును. పొగరంగు (Smoke color) గానున్న కంటి జోడు వేసుకొన్నచో నందు యత్కించత్ నీలవర్ణముండుటవలన తీక్షణమగు సూర్యకాంతి సౌమ్యతంబొంది కంటికిఁ దగులును. నీలిజోడు వేసుకొన్నచో నింకను గుణతరముగనుండును. (తెల్లగానుండి కలకగా నున్నచో తేనెరంగుగాని రక్తవర్ణముగాని యిల్లే వాడవలయును.)

చుండు, పుళ్లైమంట, కాల్పులు, బట్టతల:—శ్యామోదకమును రుద్దుటచే చుండు, కాల్పులు, అనేకులకుఁ గుదిరినవి. కాలినచోట శ్యామోదకంపు తడిపొత్తి కట్టినచో బాధ తగ్గించి యింద్రజాలమువలె పనిజేయును. ధూమ్రోదకము శ్యామ-ధూమోద్రకమును, శ్యామోదకముతో మార్చి వాడినచో చుండు, బట్టతల కుదురును. మొద్దుబారి మంట లున్నప్పుడు చర్మమునకు శ్యామోదకము వాడదగిన యౌషధము.

---

## 29 వ కిరణము - వర్ణముల ప్రభావము
### (స్థూ ల ము)

(1) శ్యామోదకము - నీలివర్ణారోపితము జేసిన నీరు.

ప్రపంచమునం దింతవరకు తెలిసినమందులలో నెల్ల నిది యత్యద్భుత ప్రభావయుతమైనది. దీనివలన నాడులు చల్లఁబడి నిద్ర గలుఁగును. గ్రహాణి మొదలగు వానిని కట్టించు మందులలో నెల్ల నింత సర్వశక్తి, సమన్వితమును, నిరపాయమును నగుమం దింకొకటిలేదు. ఇతరౌషధములు పనిజేయలేనిస్థితిలో

సయితము దీనిచే గ్రహణి, అతిసారము, వడదెబ్బ, ఉష్కరు, భేదులు, కలరా మొదలగునవి నయమగును. ఇది నిరపాయమగు పూతినాశకౌషధము. అనగా వ్రణాదులను కుళ్ళకుండ జేయునట్టిది. దీనిచే మంటలుగల వ్యాధులు తగ్గును. మంటలనిది యణచును. పరిణామదాహము, పరిణామశూల, కడుపులో మంటలు, అపానవాతము, జీర్ణాశయవ్రణము మొదలగువాని కిది పెట్టినదిపేరు. నోటిపూత, తీవ్రమగు గొంతునొప్పి-నోట-నీరు పుక్కిలించినచో, నిది యేమందును యీయనంత త్వరగా గుణమిచ్చును. శ్యామోదకము పుక్కిటబట్టి, పుక్కిలించి, ఉమిసి, 2 గుక్కలు లోనికి బుచ్చుకొనినచో పై 2 వ్యాధులు గుదురును. పైపూతకిది. యనన్యమైనది. కన్ను మంటలు, అగ్నిదగ్ధ వ్రణములు, పుండ్లు, అరచేతుల పగుళ్లు, చుండు, వెంట్రుకలు రాలుట- మొదలగువానిని నివారించి, చర్మమునకు మార్దవ్యము నొసంగి పట్టువలె మృదువుగా జేయును. బాష్పస్నానము తరువాత శ్యామోదకము పైన రుద్దినచో రోమకూపములు వెంటనే ముడుచుకొనును. శైత్యము గలుగనీయదు. భగమునందు గలుగు మంటలను శ్యామోదకపు యెనీమా మిక్కిలి త్వరగా పోగొట్టును. పటిక నీటితో చేయు యెనీమాకన్నను (Ergot)తో చేయు ఎనీమాకన్నను నిది సురక్షితమైనది. తలనెరసియున్న వారికిని, రాగి బొచ్చుగలవారికిని యిది తలపైరుద్దినచో వెంట్రుకలు నల్లబడి చిక్కబడును.

(2) <u>పీతోదకము - పసుపువర్ణ మారోపించిన నీరు.</u>

ఇదియు ముఖ్యమగు మందులలో నొకటి. నాడుల

 ప్రకృతి-
నుజ్జీవింపఁజేయుటలో నిది యనన్యమైనది. శక్తిని గలిగించు వానిలోను నుత్తమమైనది. శక్తియుతములగు మందు లన్నియు నిష్ప్రయోజకమైన కాలిక మలబద్ధకపు విషయములలో నిది గుణకారియయ్యెను. అది కార్యము, పేగులు, మూత్రపిండము లను నుజ్జీవింపజేయును. ఆసనము మూలకండరములు మొద్దు వారియున్నస్థితిలో శీతోదకపు యెనీమా మిక్కిలి గుణయుతమైనది.

(3) ధూమ్రోదకము - ఊదావర్ణకాంతి యారోపించిన నీరు.

అజీర్ణమున కిది దివ్యౌషధము. శైత్యము జేసియున్నపుడు లవణముజేర్చిన ధూమ్రోదకము ముక్కులోనికి పీల్చుటకు మిక్కిలి శక్తివంతమైనది. పుట్టపైన రుద్దుటకు శ్యామోదక ముతో చేర్చిగాని మార్చిగాని ధూమ్రోదకమును వాడుట మంచిది. శ్వేత కుసుమవ్యాధికి ధూమ్రోదకపు భగవస్తి గుణ కరమైనది. రక్త, ధూమ్రోదకమువలన గట్టిపడిన యోనికి మృదుత్వమువచ్చును.

(4) రక్తోదకము - ఎఱుపువర్ణ మారోపించిననీరు.

రక్తోదకమువలన రక్తమునందు వేడిమి గలుగును. రక్తక్షయము, పాండువ మొదలగు వానియందలి రక్తశైత్య మును బోగొట్టి, రక్తాభివృద్ధిజేయును. ఎఱుపు కుప్పెగాని రక్తకేంద్రీకరోపకరణము గాని మేహవాతపు నొప్పులుగల చోట కేంద్రీకరించినచో మేహవాతపు నొప్పులు పోవును. రజోనిరోధము, రజోనాశనముగాని గలిగినవారికి అండాశయ ములపై రక్తవర్ణమును పైయుపకరణములతోడనే కేంద్రీకరిం చినచో నవి గుదురును.

---

# ప్రౌఢప్రభాకరము.

## 30 వ కిరణము.

### ఘనపదార్థముల వర్ణారోపితము జేయుట.

ప్రయాణకాలమునందు వర్ణచికిత్స జేయుట కివి యుపయోగించును.

1 పాలచక్కెర (Sugar of milk) క్షీరమనిన పాలు గనుక వర్ణారోపితము జేసిన పాలచక్కెర, శ్యామక్షీర, ధూమ్రక్షీర, హారీతక్షీర, పీతక్షీర, రక్తక్షీరాది నామములనొప్పు.

2 శర్కర—సన్నని పంచదార మాత్రలు సంపాదించుకొని యవి రంగుసీసాలలో నుంచి వర్ణారోపితము చేయుదురు. శర్కర మధుర పదార్థము గాన నీలి కుప్పెనుంచి వర్ణారోపితము జేసిన పంచదార మాత్రలను శ్యామమధురయనియు, నిట్లే రక్తమధుర, పీతమధుర, హారీతమధుర, ధూమ్రమధు రేత్యాదినామము లేర్పడును.

N. B:—ఇంతకన్న మధురశ్యామ, మధురపీత, మధుర రక్త, మధురహారీ తేత్యాదినామములు ముచ్చటగానున్నచో నట్లనే వాడుకొనవచ్చును.

3 తుమ్మజిగురు—బాగుగా నెండించి చూర్ణముజేసి వర్ణారోపితము జేసినచో దానిని చూర్ణముగా నున్నదిగాన శ్యామచూర్ణ, పీతచూర్ణ, రక్తచూర్ణ, ధూమ్రచూర్ణ, హారీతచూ ర్ణేత్యాదినామము లేర్పడును. పైవలెనే చూర్ణశ్యామ చూర్ణధూమ్రేత్యాది నామములను బిలువవచ్చును. పై పదార్థములందు సహజమగు నుష్ణస్వభావముగాని, శీతస్వభావము

గాని విశేషము లేదుగాన నవి దాదాపు మాధ్యస్థ (Neutral substances )పదార్థములై యున్నవి. పాలశర్కర హోమి యోపతి వైద్యశాలల యందును, ఔషధ విక్రయస్థలలములందును పౌను ప్రస్తుతము రు 1-0-0 చొ॥ అమ్ముచు న్నారు. అది మాత్రలుగను, చూర్ణముగను లభించును. ఇందు ముదుక చూర్ణముగా నుండురకము సంపాదించి వర్ణారోపితము జేసినచో యుపయోగముగా నుండును. మోతాదు 2, 3 గురిగింజల పరిమాణము. ఒకామెకు జ్వరము వచ్చుచుండెను. నిద్రలేదు. కత్తిమొనపై నిలుచునంతటి శ్యామక్షీర నిచ్చుటచే నామెకు సుఖనిద్ర గలిగించితిని. మరునాడు మోతాదును రెట్టించుటచే నిద్రయింకను గాఢముగ బట్టెను. నల్లమందు, క్లోరల్ మొదలగునవి పుచ్చుకొనినను నిద్రగలుగును కాని నవి తరువాత నపకారము జేయును. ఇందట్టిదేమియులేక నిరపాయముగా నుండును.

దంతోత్పత్తి—మలబద్ధము(Dentition & constipation)

"శిశువులకు దంతోత్పత్తి కాలమునఁ గలుఁగు భేదులు, నాకుమార్తెకు గలిగెను. దానికి నీలివర్ణ మారోపించిన పాలశర్కర నిచ్చితిని. తీవ్రమగు భేదులు కట్టుకొనెను. ఆమెకే మలబద్ధకము గలుఁగఁగా తేనెవర్ణ మారోపించిన తుమ్మ జిగురుచూర్ణ మిచ్చితిని. ఆమెకు యిప్పుడు సక్రమముగా మల మోచన మగుచున్నది."— జా.ఇ.బ్లిప్.యం.డి.ఫౌలర్.మిచ్.

వర్ణారోపిత ఘనపదార్థములయొక్క రోగనివారక శక్తిని గురించి యిదివరకనేక ఆరోగ్య వృత్తాంతములు వివరింపఁ

బడినవి. ఇట్టిమందుచే మానవదేహమునం దిసుమంతయేని బాధలులేక నిరపాయముగా సౌమ్యముగా రోగనివారణ మగును. అందువలన ననేకులు విచార శూన్యులై వర్ణౌషధ మందలి శక్తిని గుర్తింపఁజాలక యామార్పు స్వాభావికముగా గలిఁగిన దేగాని వర్ణౌషధము(Colour charged substances) వలననైనది గాదని దలంచుచున్నారు. ఒకాయన భార్యకు మలబద్ధకము. అతఁడు పీతవర్ణపుకుప్పె తీసికొని భార్య కందలి నీరు త్రాగనిచ్చుచుండెను. తరువాత 'నీభార్య కాకుప్పెప్రయోజనపడలేదా?' యని యడిగితిని. అతఁడు'లే'దనెను 'ఆమెకు యింకను మలబద్ధకము పోలేదా?' యని నేనడుగగా 'ఎందువలననో గాని యిప్పుడు మలబద్ధకము మాత్రము లే'దని యాతఁడు చెప్పెను.

## శుక్లపాతము. (Spermatorrhea)

శుక్లము దేహమునందలి ప్రాణాధారమైన సర్వధాతు సారము. దానినిఁ బోగొట్టుకొనుచో పిచ్చి మొదలగు మర్భరవ్యాధులును, మరణమును సయితము గలుఁగును. అనేకులిద్దానిచే నశింతురు. రహస్యమగు దురలవాటులన్నియు మానితీరవలయును. మఱుగువూసలనుండి చీలి కొన్నినాడులు జననేంద్రియములందు వ్యాపించి యుండును. ఈనాడుల యందు వేడిగలిఁగి నప్పుడు శుక్లపాత వ్యాధి గలుఁగును. ఆనాడులఁ జల్లఁబఱచిన శుక్లపాత వ్యాధి యంతరించును. ఆదిత్య పీటికాస్నానముఁ జేయుచో వెన్నుపాము దిగువభాగమునకు ఆకుపసరుకాంతి తగులు నట్లు జేయవలయును. ఈవర్ణము

చలువఁజేసి బలహీనమైన భాగములు బాగుపడుటకు తగు మాత్రము పసుపువర్ణమును నందుండుటచే నాభాగము లుజ్జీవం బొందును. అంగమర్దనఁ జేయుచో నీప్రదేశమునుండి వెలుపలికిని కాళ్ళవైపునకుహస్తచాలనముఁ జేయవలయును. శ్యామోదకముచేగాని, హరీతోదకముచేగాని, తడిపిన పొత్తిని మలుగుల పై వేసినచో మిక్కిలి యద్భుతముగాఁ బనిజేయును. అంత చలిగానున్నచో దానిపై నేదైన యున్నిగుడ్డ వేసి కట్టినచో తగుమాత్రము వెచ్చదనము గలుగును. వెల్లకిలఁ బరుండరాదు. రాత్రిపరుండ బోవునపుడు వెనుకవైపున గుడ్డ ముడిగాని, కొయ్యముక్కగాని కట్టుకొని పరున్నచో వెల్లకిల పరుండ నెంచి నప్పుడెల్ల నవి వత్తుకొనుచుండును.

## భగవస్తి (Uterine Enemas.)

వివాహమైనట్టియు, కానట్టియు యువతులు శ్యామోదకపు భగవస్తి చేసికొనినచో శుచిగానుండుటయేగాక రోగనివారణమై, యారోగ్యాభివృద్ధియగును. కాన శ్యామోదకపు వస్తి వారికి చాలమంచిది. శ్యామోదకమందు పూతినాశక (Antiseptic)శక్తియునుఁగలదు. ఋతుకాలానంతరమున వెంటనే శ్యామోదకము వస్తి చేసికొనినచో వ్యాధులకుఁ గారణమగు మాలిన్యములు దొలఁగి పోఁగలవు. వస్తిచేయునీరు యొకింత వెచ్చగ నుండవలయును గాన కొంచెము వేడినీరు కలిపి, శ్యామోదక మొకింత వెచ్చఁబడున బ్లైండలోనుంచి వాడవలయును.

# 31 వ కిరణము.

## (తెల్లకుప్పెలలోని రంగు ద్రివములు.)

(ఈభాగమంత యవసరముగాదనియనువాదకుని భావము) ఈనీరు త్రాగుటకుగాదు. త్రాగనుకూడదు. దేహమునందలి వివిధభాగములపై కుప్పెను కేంద్రీకరించుట కుపయోగించును.

1 ఎఱ్ఱనిరంగుగల ద్రివము తయారు జేయుటకు Sodium Salicylate(సోడియం సలిసైలేట్) 10 గ్రెయినులు Tincture of Iron (లోహద్రావకము) 10 చుక్కలు కలిపి కుప్పెనిండుగ నీరుబోయవలయును. వాతవ్యాధుల కిది యుపయోగకరమైనది. ఇది రక్తమునకు వేడిమిని గలిగించు నాడుల కుజ్జీవనము గలిగించును. అండాశయములపై నిది కేంద్రీకరించినచో ఋతునాశవ్యాధి నయమగును. మూత్రపిండములు పనిచేయని స్థితిలో బొర్లపకుండి నడుము(Small of back each side)న కొంకింతపైన రెండువైపులను బ్రిసరింపజేసినచో నం దుజ్జీవనముగలుగును.

2 నీలి ద్రివము తయారుజేయు విధము:— Cupro-Diammonium Sulphate (కుప్రొడయమ్మోనియం సల్ఫేటు) 1 డ్రాము(60 గ్రెయినులుకు) Tartaric acid (తార్తారికామ్లము, నిమ్మపుప్పు) 20 గ్రెయినులు కలిపి, కుప్పెనీటితోనింపవలయును. ఎఱుపుకిరణములు యెక్కువ ప్రిసరింప వలయుచో సల్ఫేటు (Sulphate) 20 బిందువులు చాలును. అమ్మోనియా

25 బిందువు లెక్కువ గలిపినచో నీలము చిక్కని దగును. ఎఱుపు యెక్కువగానుండవలయుచో

3 నీలి మందు సారము(Solution of Indigo) 25 చుక్కలు కుప్పెలో పోసి నీటిని నింపవలయును.

4 Quinine Sulphate (క్వైనాసల్ఫేటు) 1 డ్రాము; Dilute Sulphuric Acid (పలుచని గంధక్లామము) 40 బిందువులు కలపి దాదావు నిర్గుణమైన యూదాశక్తిగల వర్ణము గల ద్రివమగును.

5 అందు 20 చుక్కలు Cupro-Sulphate of Ammonia (కుప్రిసల్ఫేటు ఆఫ్ అమ్మోనియా) గలిపిన, నీరస దేహుల కుపయోగింప వీలగును. అందు నీలిమయొక్క శక్తి యేర్పడును. సూర్యకిరణము లెందుండి వ్యాపించునో అందలి శక్తిని తమవెంటగొని పోకమానవు గాన పై ద్రివములనుండి వ్యాపించు కిరణములందలి శక్తులను సూక్ష్మస్థితిలో స్వీకరించి దేహమున కుజ్జీవనాదులం గలిగించును.

6 పసుపు-తేనెరంగుద్రవము:—Potassium Bicromate (పొటాసియంబైక్రిమేటు) డ్రాము కుప్పెలో వేసి నీటిచే నింపునది. ఈకుప్పె కేంద్రీకరించినచో ప్రేగులు నాడులు నుజ్జీవనంబొందును.

## 32 వ కిరణము.

### దుస్తుల రంగులు

ఇతరవర్ణముల దుస్తులకన్న శుద్ధశ్వేతాంబరములు దేహమునకు సూర్యకాంతిని యెక్కువ ప్రిసరింపఁజేయును.

నలుపువర్ణముగల దుస్తులు సూర్యకిరణములను తాము మ్రింగి దేహమునకు సూర్యకాంతి నొసంగక, తాము మ్రింగిన స్థూలోష్ణమును మాత్రము దేహమున కొసంగును. అన్నిరంగులయొక్క సమ్మిశ్రమమేగదా తెలుపువర్ణము ? తెలుపు మాత్రమేల సూర్యకిరణముల నవలకుఁ బ్రసరింపనిచ్చునని మీరడుగవచ్చును. శ్వేతాంబరము నందలి దారములు తెల్లగానుండుటచే సూర్యకాంతిని మ్రింగక తమనుండి సూర్యకాంతి నావలకుఁ బ్రసరింపఁజేయుచున్నవి. చీకటి వన్నె (నలుపురంగు) గలదుస్తులకు సూర్యకాంతి యందు రాసాయనికాకర్షణ మత్యధికమగుటచే సూర్యకిరణముల నెల్ల తామే మ్రింగును. వెలుగు వానిని దాటి యావలకుఁ జనదు. నీలివన్నెగాని, నలుపువన్నెగాని గల తెర యడ్డముంచినయెడ చీకటి యగును. తెలుపు పసుపు వన్నెగల తెర వేసినప్పుడంతటి చీకటి గలుగక తగుమాత్రపు వెలుతురే గాన్పించును. పైదాని కిది యుదాహరణము. ఇఁక తెరచూచిన తెల్లనిదానికన్న, నల్లనిది వెచ్చగానుండును. ఏల ? అది సూర్యకిరణముల మ్రింగినది. అందువలన దాని దేహము వేడియెక్కినది. డాక్టరు ఫ్రాంక్లిన్‌గారు వివిధవర్ణముల వస్త్రములను మంచుపై బఱచెను. అందునల్లని వస్త్రముక్రిందనున్న మంచు మిక్కిలి లోతుగా కరుగ నారంభించెను. అట్లని నలుపు వేడి నావలకు జననిచ్చినదని తలంపరాదు. మరియు తాను వేడిని యెక్కువగా గ్రహించినదనియు వస్త్రముయొక్క వేడిమికిమంచు అత్యంతము గఱగుచున్నదనియుఁ గ్రహింపవలయును. నీలమునకన్న, తెలుపు,

పసుపు, నారింజ యెఱుపు వర్ణములు వరుసగా తరతమ భేద ములతో వేడిని వ్యాపింపఁజేయు వర్ణములు గాన మంచున కొంకింతదూరముగా వస్త్రము లుంచినచో నలుపు వస్త్రము క్రిందనున్న మంచుకన్న తెలుపు పసుపు ఎఱుపు మొదలగు వన్నె వస్త్రముల క్రిందనున్న మంచు మిక్కిలి త్వరితముగా కఱగును.

తీవ్రమగు యుష్ణము, యేవస్తువునుండియైనను సమ గ్రముగా నావలకుఁ బ్రసరించునేని, యావస్తువు యొక్క యుష్ణము హెచ్చక నట్లనే యుండును. ఏదేని వస్తువు యెండ లో నుంచినపుడు వెచ్చఁబడునేని యందుండి కిరణము లావ లకుఁ బ్రసరింపక నావస్తువుచే మ్రింగి వేయఁబడినవని యర్థము. అందువలననే చలికాలమున నల్లని దుస్తులను ధరించు చో నందుండి దేహోష్ణ మావలకుఁ జనక దుస్తునే యంటి పెట్టుకొనియుండి చలినిఁ గలుఁగ నీయదు. వెలుపలి యుష్ణ మును సయితము దుస్తులు క్రమపాట్టనే నింపుకొనును. అందు వలన వేడిమియే గలుఁగును. నల్లని వస్త్రములు వెట్టను వ్యాపింపఁజేయు ననుటయును నిజమే. దేహమునుండియు, వెలు పలినుండియు వేడిని స్వీకరించి, యందుండి వెలుపలకును లోనికిని వేడిని వ్యాపింపఁజేయును.

అవభాసిని (చర్మముయొక్క పైపొర) కుజ్జీవన గలి గించి బలపఱచుటలో తెల్లని దుస్తు లనన్యమైనవి. కాన నల్లని దుస్తులకన్న తెల్లదుస్తు లెక్కువ యుపయోగకరమైనవి. టర్కిష్ బాత్ (Turkish Bath) కార్యాలయములో స్త్రీశాఖ

కధికారిణిగానున్న యొకామె వాడిపోయిన చర్మములు గలవారందఱును నల్లనిదుస్తులు ధరించువారేనని వ్రాయుచున్నది. తెల్లని దుస్తులు 2 దినములు ధరించినచో నెట్టి శైత్యమును దగ్గునని యొకశరీర శాస్త్రజ్ఞుడు వక్కాణించెను. చర్మమిట్లు వెలుఁగుచే సజీవనంబొంది దానితోడి నాడులంగూడి దేహమునందలి దుష్ప దార్థములను వెలువరింప సామర్థ్యముగల దగును. కాలేయము, శ్వాసాశయములు, మూత్రపిండముల యొక్క స్వీకారక్రియ తేలికయగును. బయటి గాలిపాటులను తట్టుకొనుటకు చర్మము సమర్థమైన దగును. స్నానము, కసరతు, వ్యాయామము, పరిశుద్ధవాయుశ్వసనము యీశక్తిని వృద్ధిజేయు ననుట నిజమే. సూర్యకిరణములం దుజ్జ్వల స్వభావముగల పసపు మెఱుపు వర్ణములనుండి యీశక్తి యుద్భవించుచున్నది.

సుకుమార దేహులగువారు చర్మమున కంటియుండు లోపలిదుస్తులు తెల్లనివి ధరింపవలయును. అందుఁడి దాదాపు సూర్యకిరణమునందలి శక్తులెల్ల దేహమునకు వ్యాపించును. చర్మము చల్లగానుండి, పాలిపోయి, రక్తక్షీణముగలవారు పైన మెఱ్ఱని మేజోళ్లుపై దుస్తులు ధరించుట మంచిది. తత్వము మిక్కిలి యుద్రేకస్వభావము గలదిగానిచో లోపలివి సయితము మెఱ్ఱని దుస్తులుగానే యుండుటమంచిది. ఎఱ్ఱని మేజోళ్ళు ధరించుట మంచిది. మేజోళ్లింకొక వన్నెనైనచో లోపల చర్మమున కంటుచోట మెఱ్ఱని రంగుకాగితము (Redtissue paper) నుంచుట మంచిది. దానిపైకి మేజోళ్ళు తొడుగవచ్చును. ఆమెఱ్ఱని కాగితమునకు వేడికాంతి శక్తిని బ్రయోగించిన

దానిశక్తి మరింత యధిక మగును. దానిని రక్తవర్ణారోపితము జేసిన దానిశక్తి యింకను సునిశితమగును. స్థూలతత్వములగు వేడినీటి సీసాలుగాని, కాల్చిన యినుపరేకులుగాని దీనికి సరి రావు. నాభి వేడిగానున్నచో చర్మమున కంటునట్లు నీలికాగిత ముంచవలయును. దీనినే శ్యామవర్ణారోపితముఁ జేసిన చలువను శాంతిని జేసి నాడుల యుద్రేకమునుఁ దగ్గించును. ఉద్రేకించి, వేడియెక్కియున్నతత్వముగలవారు చల్లని, నీలిలోపలిదుస్తులను ధరించుట మంచిది. అవి సూర్యకిరణములందలి వేడిని మ్రింగినను, యందుండి వ్యాపించు కిరణములందు చల్లదనమును, నాడుల యుద్రేకము నణచుశక్తియు దేహమునందుండి వ్యాపించును.

## ౭౬ వ కిరణము—రంగ నేమి?

వెలుఁగు; చీకటి—యీ రెండు పదార్థములను తెలివి గలవా రందఱును గుర్తింపఁగలరు. ప్రకృతి శాస్త్రవిశారదులు, వైద్యశిఖామణులు, పత్రికాధిపతులు, పండితులు, యితరవిషయములందు పండితులగువారు తేజస్సు, వర్ణములయొక్క స్వరూప స్వభావములయందు, బోధితులుగాక యున్నారు. మానవుఁడు నడచు వృక్షములవలె వారు భావింతురు. రంగులన్నియు నొకేస్వభావముగలవానివలె వారికిఁ దోచును. వానిని కలిపినను, విడదీసినను వారికొకటిగనే దోచును. వేవేల సంవత్సరముల నుండియు ప్రభాకరుఁడు ప్రతిభావంతములును, సతేజములును నగు తనకిరణముల భూమిపైఁ బ్రసరింపఁ జేయుచు, చిత్రచిత్రములగు చిన్నెవన్నెలను జూపుచునేయున్నాఁ

డు. కాని మానవుని దృష్టిమాత్ర మందలి విజ్ఞానమును గ్రహింప బ్రయత్నింపలేదు. భూమ్యాకాశములను సమావేశము జేయుచున్న స్తంభములును, మంటపములు గల దివ్యసౌధము లోపల దాను నిలుచుండియు, యనంతమగు నాదివ్యసౌధమును గాని, దాని నిర్మాణమునుగాని కన్నెత్తిచూడక, తత్వమరయక చూచి దాని తత్వమరసినవారిని మూఢులుగను, పిచ్చివారుగను భావించి బెడ్డలువేయ నుంకించుచున్నారు. అనంతమగు నీదివ్యసౌధమును, చీకటి గుహలను వలె భావించి చూడకున్నారు. స్థూలభూతములను సూక్ష్మశక్తులు నడపుచున్నవని ప్రజలునమ్మి, గుర్తించిననాడు విజ్ఞానులను మూఢులు వెఱ్ఱివారని పిలుచు పిలుపంతరించి తమకు ప్రకృతి విలాసముల జూపినవారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పింతురు. ప్రతివస్తువునకు స్థూలసూక్ష్మపక్షములు గలవు. అందు స్థూలపక్షమును చాలమంది గుర్తించుచునే యున్నారు. కాని యనేకవత్సరములు గడచినను వానియాంతరికస్వభావము బోధపడలేదు. ఇంకనైన దానిని గనుగొనఁ దగదా? సామాన్యముగా నందరికిని గల భావములలో గొన్నింటి నిట జూపెదను. వారు కనిపెట్టిన విషయముల సయితము పేర్కొనియెదను లెండు. ఫిలడల్ఫియా (Philadelphia) లో జనరల్ ప్లజంటన్ (Gen. Pleasantan) అను పెద్దమనుష్యుఁడు గలఁడు. ఆతఁడు ప్రాకృతశాస్త్రజ్ఞుఁడు (Scientist) గాఁడు. కాని తెలివి గలవాఁడు. అతఁడు శాక, జంతు మానవులపై తెలుపు, నీలి వర్ణములతో పరిశోధనలు జేసి లోకముయొక్క కృతజ్ఞత

కుఁబాత్రమైనాఁడు. తరువాత లోకులదృష్టి యావంకకు మరల్పఁబడినది. ప్రిజలీ విషయమై మేల్కొనిరి. అతని పరిశోధనలును యేగపక్షములైనవే యగును. కాని యే 2 వర్ణములతోనైనను వైద్యము జేయవలయుచో నతని సమ్మేళనము దేనికిని తీసిపోదు. నాడీ యుద్రేకము గల యమెరికనుల యందలి నాడీయుద్రేకమును సౌమ్యబఱచుటకు నీలియును, నూతనోజ్జీవముఁ గలిగించుటకు తెలుపువర్ణమును మిక్కిలి యుపయోగకరమైనవి. తెలుపు నీలితో మేళవించినచో తెలుపునందును వివిధ తరగతుల శక్తులు గల్గుఁగును. అట్లుమేళవించినచో నందు రాసాయనికమగు మార్పులేర్పడును. అత్యధికమగు తెలుపువర్ణముతో మేళవించిన నీలివర్ణ ప్రయోగముచే నోషధివర్గము నందును నభివృద్ధి గలుఁగునని యాతఁడు పరిశోధన పూర్వకముగా వెల్లడించినాఁడు. అతఁడు కృతజ్ఞతాపాత్రుఁడు. అతఁడు పరిశోధనలచే దేల్చినవి విశేషగౌరవపాత్రము లేవైనను నీలివర్ణమే, ప్రధానవర్ణమనియు, తెలుపు నీలివర్ణములే మేళవించుట చాలుననియు నాతఁడు తన గ్రంథములలో వ్రాసియున్నాఁడు. దానివలన బ్రిజలీ యొక్క సమ్మేళనమునే యంటిపెట్టుకొని యుందురు. వర్ణము లన్నిటి యొక్కయు స్వభావము లెఱింగిన గాని యొక్కొక్కప్పుడపకారము సంభవింపవచ్చును. కాన నాతఁడు వ్రాసిన యీవిషయములు కఠినపరీక్షకు నిలుచునవి కావు కాని పరిశోధనలచే నంతటి యుపకారము జేసిన యితని యీస్వల్పదోషములు పరిగణ నార్హములు గావు.

అదేపట్టణములో (Dr. S. Pancoast) డాక్టరు యస్ పాంకోస్టు అనువారు ప్లెజంటన్‌గారి కన్న నొకయడుగు ముందువైచి ఎఱుపు, నీలములను రెండును ప్రిధానవర్ణ ము లని నిర్దేశించెను. స్వతంత్రివర్ణములని నిర్దేశించెను. (Blue and Red lights) రక్త, శ్యామవర్ణములను నతని గ్రింథములో తాను స్వయముగా నారెండు రంగులచే గుదిర్చిన యత్యద్భుత రోగనివారక వృత్తాంతములు గల యధ్యాయ మున్నది. అవి దాదాపుగా నీగ్రింథమున నెత్తి వ్రాసితిమి. వైద్యుఁడగుట వలన నితని పరిశోధనలు (Gen. Pleasanton) జనరల్ ప్లజంటన్‌గారి పరిశోధనల కన్న సవి తర్కితములును, యాశ్చర్యకరములునై యున్నవి. ఈయ ధ్యాయము తప్ప మిగత భాగమంతయు విశేషగౌరవము నొందునట్లు లేదు. 30 సంవత్సరములు పరిశోధించినను నతడింత కన్న యత్యద్భుత విశేషదర్శనమునం దంధుఁడుగనే యు న్నాఁడు. అతఁడు వ్రాసిన రీతిని యీక్రింది భాగమునఁ దిల కింపఁగలరు.

"సృష్టియందలి భౌతిక పదార్థవికాసమంతయు సూ ర్యకిరణము లందలి వర్ణసప్తకము వలనగాక, నేకమగుసూ ర్యకాంతివలననే గలుఁగుచున్నది. వెలుతురు విశాలాకాశమున 7 విధములగు గతులతో సప్తకిరణములుగా వ్యాపించియుం డలేదు. ఈవిషయము మనపూర్వులకు బాగుగా తెలియును. కాంతిని గురించి వారికిఁబూర్తి యగు విజ్ఞానము గలఁదు. కాంతి యొక్క మాహాత్మ్యము వారు బూర్తిగా నెఱుఁగుదురు. న్యా

ర్క్ మొదలుకొని నేటివరకును విజ్ఞానులందఱును పూర్వు లనాశ్రయించిననేగాని కిరణతరంగ తత్త్వమును పూర్తిగా గ్రహింపఁజాలరు. ఈమహానుభావుడనుదినము నభివృద్ధినందుచున్న వైజ్ఞానికుల (Scientists) కు నున్నబుట్టి వెనుక పూర్వుల మాహాత్మ్యము కన్నారఁజూచి, నోరారస్తుతించుచున్నాఁడు అతఁడు తనను, తాననుసరించిన పూర్వులను యిప్పటి వారికన్న శ్రేష్ఠతరులనుగా భావించుచున్నారు. అనేకులు పూర్వుల విజ్ఞానమునుఁజూచి యానందించుచున్నారు. వారభివృద్ధినే బొందుచో నది భూతముఖముగనే యుండును. భూతమున కన్న వర్తమానమును, వర్తమానమున కన్న భవిష్యత్తు క్రమముగా నభివృద్ధినే బొందుచుండవలయును.

పూర్వులు మనకన్నను విశాల హృదయులేయగుదురు. వారికి సూక్ష్మదర్శనులు, దూరదర్శనులువర్ణవివర్తకయంత్రములు(Microscope, Telescopesand Spectroscopes) మొదలగు వందలాది పరికరములు లేవుగాననసూక్ష్మమగువిషయవివేచన జేయుటకువారికిసావకాశములుతక్కువగానుండెను. ముద్రాయంత్రములు, నూరణయంత్రములు, కుట్టుయంత్రములు మొదలగునవి జూచినప్పుడు పూర్వులు గనిపెట్టినవి వీనికన్న నెన్నిరెట్లు వెనుకభాగమున నున్నవో గుర్తింపవచ్చును. ఆవిరియంత్రముల సంగతి చెప్పనక్కరయే లేదు. స్థితిగతు లిట్లున్నవి. పై గ్రంథకర్త యుద్దేశ్యము బోధపడకున్నది. సృష్టి కంతకును వికాసము నొసంగుటకు తేజస్సుగలదని యాతఁడు నొక్కి నక్కాణించుచున్నాఁడు. తాము జూచినది దక్క యింక నన్య

ములేదని నమ్ముట యనేకుల స్వభావము. థేల్స్ (Thales) సర్వపదార్థములకును జలమే గారణ మనుచున్నాఁడు. అనేక్షిమన్స్ (Anaximenes) సర్వమునకును వాయువు కారణ మనుచున్నాఁడు. హెరేక్లిటస్ (Heraclitus) యగ్ని కారణ మనుచున్నాఁడు. ఇంకొకరు విద్యుత్తనుచున్నారు. అణుతత్వము (Atomic law) ను రాసాయనిక చలనముల (Chemical action) యొక్క స్వభావజ్ఞానము గలుఁగుచో పై జెప్పిన వానియందు స్వాభావికమగు యుత్పత్తి స్వభావము లేదనియు ప్రకృతియను దివ్యరథమున కివియన్నియు రథాంగము లనియు, బోధపడగలఁదు. అట్లుగాక యొకదానికే కారణము నారోపించుట వీణెయందలి యొక తంత్రియే గానమునకు కారణమనియు మిగిలిన వన్నియు దాని కనుసరణములే గాన స్వతంత్రములును, బ్రధానములును, గావనినట్లగును. అతఁడు బోధించిన సిద్ధాంతముల నన్నిటిని యిచ్చట వివరించుటకుగాదు. అయినను నతని ప్రియమైన వర్ణద్వయమునుఁ గురించి యాతఁడు వివరించినది గుర్తింపఁదగినది. "వర్ణద్వయమును నన్యోన్య వ్యతిరేకమగు రెండుశక్తులను తేజస్సునందుగలిఁగించును. తేజస్సునకు అస్తినాస్తులును, ధృవాధృవములును, సంపూర్ణతాసంపూర్ణతలును గలవు. అందుఎఱుపుఅస్తిధృవసంపూర్ణమగువర్ణము. నీలమునాస్తి, యధృవ, యసంపూర్ణ మగుపక్షములోనిది" (పు267.) అతఁడితరచోట్లవివరించిన సత్యమున కిది విరుద్ధముగా నున్నది. ఎఱుపునందు వేడిమి, నీలముచల్లఁదనమును గలిఁగించునని యాతఁడు పేర్కొనియున్నాఁడు. వేడిమియందుకరగించుట, కాల్చుట, లేకుండఁజేయుట (నాస్తి)యసంపూర్ణము

జేయుట యను స్వభావమున్నది. చల్లఁదనమునందు ఘనీభవింపఁ జేయుట, స్వరూపమునిచ్చుట, నిర్మాణములను స్వభావములున్నవి. ఇదిపైదానికి విరుద్ధముగానున్నది. ఏలనన వేఁడినొసఁగు యెఱుపునందు నాస్తి యధృవ యసంపూర్ణతలును, శైత్యము నొసంగు నీలివర్ణమునం దస్తి, ధృవాదులును గలవు. డాక్టరుగారి సిద్ధాంతములెట్లున్నను, వారియనుభవములు మాత్రము మిక్కిలి యొప్పియుండి యభినందనీయములు, సంభావనీయములుగ నున్నవి. వీరికిపూర్వులెవరును నింతమాత్రము గ్రహింపఁ జాలరైరి. వారిభావము లన్నియునపరిష్కృతములుగనే యున్నవి. అరిస్టాటిలు పసుపు, తెలుపు, నలుపుప్రధాన వర్ణత్రయముక్రిందఁ జేర్చినాఁడు. పిథగోరసు పసుపు, తెలుపు యెఱుపు, నలుపు, ప్రధానవర్ణము లనినాఁడు. కంటిలోనంతర్ముఖమగు తేజస్సు వలననే వెలుఁగు దోచుచున్నదని ప్లేటోభావించెను. పిథగోరసు వేడియావిరివలన వెలుఁగుదోచుచున్నదని గుర్తించెను. వీనివలనపూర్వకాలమునగొప్పవారుగానున్న వారలనేకులకు తేజస్సననేమో, వర్ణములననేమో,సమగ్రముగను, సత్యముగను బోధపడలేదని తెలియుచున్నది. కాలముగడచినది. గదాయని పూర్వులను గుఱించి లోకులకు విభ్రమముగొల్పుటన్యాయముగాదు. పూర్వులేగొప్పవారనియు మనముపర్వతాగ్రమునుండి క్రిందికిదిగుధోరణిలోనున్నామనియు, దలంపఁజనదు. నానాఁటికి దిగనాసిల్లుచున్నామనియు తుదకధోగతిని బొందుచున్నామనియు దలచుటమిక్కిలి యవివేకము. (Scientific American) వైజ్ఞానిక అమెరికా అనుపత్రికలో జనరల్ ప్లజంటు

గారిని దూషించుచు 'నీలి. అద్దపు మోస'మను పేరుతోఁ గొన్నివ్యాసములు బ్రచురింపఁబడినవి. అందు వారు సున్నిత శక్తులయొక్క స్వరూపస్వభావముల గుర్తింపఁజాలక నీలము సూర్యకాంతి యొక్క తీక్ష్ణతనుఁ దగ్గించుట కుపయోగపడు ననియు, అది యేరంగు అద్దముతోనైనను గాని, బట్టతెరలు మొదలగు వానిచేగాని తగ్గించుకొనవచ్చు ననియు వ్రాసిరి. నీలికాంతియందు సూర్యకాంతి కంటెను, యితర రంగుకాంతులకన్నను విభిన్నమగు శక్తిగలదనియు; కేవల సూర్యకాంతి యందు, పీత, రక్తకాంతుల యందును లేని వేడిమిలేని వెలుఁగు నిచ్చు శక్తిగలదనియు, పీత, రక్తవర్ణములందు లేని చిగురింపఁ జేయు శక్తిగల దనియు, హైడ్రోక్లోరి కామ్లముపై నీలి కాంతిని బ్రసరింపఁ జేసిన నది యణువులుగా మారు ననియు, పసుపు, యెఱుపు, వర్ణములం దాశక్తి లే దనియును, ఫొటోగ్రాఫు తీయుట కుపయోగించునట్టి సున్నిత స్వభావముగల లోహములపైఁ బ్రసరింపఁ జేసిన పీత రక్తవర్ణము లెట్టి మార్పును గలిగింపవనియు, నీలికాంతినిఁ బ్రసరింపఁ చేసినవవి నల్లపడు ననియును వారి కింత కాలమునకు దెలియకుండుట విచారకరము. నీలికాంతి సూక్ష్మచలనములచేతను పీత, రక్తకాంతులు స్థూలచలనముల చేతను గలుఁగుచున్న వనియు, నీలము నందుంచిన ధర్మామీటరులో యెఱుపు, పసుపు కాంతులందుంచిన ధర్మామిటరు నందుకన్న 1,2 డిగ్రీల వేడి తగ్గి కాన్పించు ననియు వారెఱుంగరైరి. మిక్కిలి ప్రచారముగల పైపత్రికయ విచారిత రమణీయముగా బ్రచురించిన పైవ్యాసముల ననే

కులు గారవించి చెడిపోవుటకు గారణ మగుచున్నదని విచార పడెదము. నీలము సూక్ష్మజీవులను సంహరించును. (అర్థాత్ వేడిని బోగొట్టును.) అమెరికా(Liberal club) ఉదారసంఘ సభ్యులు సమావేశమై నీలికాంతి చికిత్సపై చర్చించిరి. అం దొకరు-వీరును వైజ్ఞానిక అమెరికా చర్చలు చదివినవారే-విశే షదూరము చర్చించి-(వారిపని జనరల్ ప్లజంటను దుర్విమర్శ కు లోను జేయుటయేలెందు) యొకవర్ణమునకు యింకొక వర్ణ మునకు నేమియు భేదముండ దనియు వర్ణములన్నియు కలిపినను గలుగు మార్పేమియు నుండదనియు వచించెను. దైవదత్తమ గు శుద్ధసూర్యకాంతియే గ్రాహ్యమనియు, వర్ణకాంతులు భగ వంతుని యుద్దేశ్యమునకు భిన్నముగా మన ముపయోగింపరా దనియు యాయన వచించెను. నిజమే. ఆరోగ్యవంతులై తిని తిరుగువారు శుద్ధకాంతిలో దిరుగ వచ్చును. దాని నెవరు కా దందురు? దేహమునందు రోగ ముండి నప్పుడు కొందరికి నీలి కాంతియు, గొందఱికి బసుపు వర్ణమును, నింకొకఱికి రక్తవర్ణ మును, నింకఁగొందఱి కింకొకవర్ణమును కావలసి యుండున నుట వారు గుర్తింపరైరి. అదే తర్కమును గ్రహించుచో పరిశుద్ధవాయువు, నిర్మలోదకముల గ్రహించి, వస్త్రహీనుః డై వర్తింప వలయును. మానవుడట్లున్నాఁడా? నీరుకాచుకొని, చల్లార్చుకొని, వడియ గట్టుకొని త్రాగుచున్నాఁడేమి? పదార్థ ములను వండుకొని, మసాలాలు జేర్చి, మాంసాదులతోడ మె సవుచున్నాఁడేమి? మేడ మిద్దెలయందు మేను వాల్చుచున్నా డేమి? శుద్ధప్రకృతి ననుగమించి జీవించు మానవున కీ వర్ణచికి

త్సరమేల? పండ్లను, కాయలను దినిశుద్ధజల వాయువుల స్వీ కరించు వారికి వర్ణములతో నిమిత్తమేమి? వారికి కేవల మగు సూర్యకాంతియే చాలును. కనుక రోగగ్రస్తులైనపుడు కొం దఱకు శీతవర్ణములును, కొందఱ కుష్ణవర్ణములు నుపయో గింపవలసి యుండు ననుట మరువరాదు. అటుతరువాత నాసభ లో నొక వైద్య విశారదుఁడు లేచి "గదులలోనికి వచ్చు సూర్యకాంతియొక్క తీక్ష్ణతనుఁ దగ్గించుట కందఱును నీలితెర లనే గట్టుకొనవలసిన"దని సలహా యిచ్చెను. అందఱకును యీతెరలే వాడుటయు, నెల్లప్పుడు నందే గూర్చుండుట య పాయకరమనియు నాతఁడు గుర్తింపఁడయ్యె. 'శతాంధాఃకూపం ప్రవిశంతి' యనిన ట్లున్నది వీరిధోరణి. విద్యావంతులని వీరిని నమ్మిన ప్రజలు వీరిచే నాశము నొందుదురేమో ననియే యింత దూర మీవిషయమై చర్చించుటకుఁ గారణమైనది.

---

## 34 వ కిరణము

### —* వైద్యులకు సలహా *—

ప్రపంచమునందలి యుత్తమోత్తమ వృత్తులలో వైద్య మొకటి. దాని యనుయాయులు మిక్కిలి గౌరవనీయులై, స్వార్థ రహితులై వర్తింతురు. తాము పడిన శ్రమకు యొక్కపైన యేని ప్రతిఫలము గ్రహింపక వైద్యము జేయు నుదారపురుషు లును గలరు. అన్ని వృత్తులలోవలె నిందును స్వార్థపరులును, డాంబికులును, కపటులును గలరు. ఉదారులగు ననేకులుఘనులు

నూతనముగా గనిపెట్టిన ప్రభాకర కిరణప్రభావమును వర్ణసామర్థ్యమును గుర్తించి యానందించుచున్నారు. ఇంక(గొందఱో పరీక్ష, విమర్శ యనునవియే లేక వర్ణచికిత్స డాంబిక మనియు, కపటమనియు, తెలివిలేమియనియు నిందించుచున్నారు. ఇట్లు జెప్పుటకు(గారణములు రెండు. (1) సులభ మగు ప్రభాకర చికిత్స ప్రజలేగ్రహించి యవలంబించుచో వైద్యుని యుదర మిక నిండదు. (2) అనేక యోషధులు జేర్చి, పుటములు వేసి, మర్దనములు జేసి తయారు జేసి చికిత్సించుటలో తరిఫీయుతయిన మన వైద్యసాంప్రదాయము వారి కిట్టి దార్జన్య రహితమును, నిశ్శబ్దమును, సౌమ్యమును నగు సూర్యకిరణ వర్ణకాంతులచే రోగములు గుదురు నని నమ్ము సామర్థ్యముగాని, యౌదార్యముతోడ వానిని పరిశోధించుటకు( దగిన సత్యాన్వేషణశక్తిగాని లోపించియైన నుండుట. ఇందు మొదటికారణమునకు నేజెప్పున దేమన:— "సోదర వైద్యులారా! ముఖమున్నది యద్దమున్నది. మీతోడిమానవులు వ్యాధిచే, నాధిచే బాధపడుచు, మూలుగుచు, దుఃఖించుచు, మరణమునకు సిద్ధముగా నున్నను, మీధనపుసంచులు నిండలేదను విచారమే మీకుగల(దా? అట్లగుచో వైద్యు డనునట్టియు పరోపకారియునునట్టియు సుపవిత్రమగు నామములకు మనమనర్హుల మగుదుము. అట్టివానిని, వాని ప్రవర్తనను వెంటనే గుర్తించి యాతనిని వెనుకకు నెట్టివైచి మానవులు సత్యము నభిగమించెదరు. సత్యమునందే బుద్ధినుంచి దైవికములగు సర్వవిధానముల చేతను తన రోగుల యాధివ్యాధులను బోగొట్టుటయందే కేంద్రీకరిం

చిన మనస్సుగలవాఁడగుచో వాని కిహమునందు పలుకుఁబడి
యు, పరమం దీశ్వరుని యనుగ్రహమును గలిఁగి తీరును.
అతఁడు సూర్యకిరణములచే శాస్త్రీయముగా వైద్యము జేయ
వలసియుండును. మిక్కిలి నేర్పును యొక్కొక్కప్పు డవసరమే
యగును. ఇతర విధానముల నొక్కతూరి తోడుచేసికొన
వలసియుండినను నుండవచ్చును. ఇన్ని జేసియు సవినయముగా
లొంగవలసిన కాలమును రావచ్చును. రంగు వైద్యము దైవిక
మగు సత్యము. దాని నెంతత్వరలో నవలంబించిన నవలంబ
కుల కంత శ్రేయస్కరమైనది. ఇఁక రెండవ కారణము భూగో
ళములన్నియు, గురుత్వాకర్షణమను సూర్యకాంతికన్న సూ
క్ష్మాతి సూక్ష్మశక్తికి లోఁబడి ప్రవర్తించుచున్నవి. సూక్ష్మ
తరమైనఁ గొలఁదివానియం దబలతకన్న, సబలతయే యెక్కు
వగా నుండునని గుర్తింపఁ దగినది. అత్యంత సంస్కారమును
బొందినవాఁడు మానవుఁడు. అతఁ డుపయోగింప దగినవియు
సుసంస్కారమును బొందినవియే యగును.

ఈ సూక్ష్మశక్తుల (Fine forces) యందున్నసుగుణ
మేమన నివి స్థూలవైద్యమునందు వలె దేహరుజలనే గాక
మానసిక నైతిక దోషముల నయితము బోగొట్టి, మానవా
భ్యుదయముం గలిగించును.

దివ్యతేజస్సుతో రథారూఢుడై ప్రభాకరుఁడు కదలు
చున్నాఁడు. మానవులు నేడుగాకున్న రేపైనను రథాశ్వము
లను, రథమును, రథికుని గుర్తించితీరెదరు. వైద్యులారా!
మీమేలు, మీప్రజలమేలు, మానవజాతిమేలునకై మిమ్ము

లను ప్రార్థించెదను; సంభావించెదను; ప్రభాకరుని దివ్య తేజస్సును గుర్తింపుఁడు. ప్రభాకర సేవ జేయుచో నుత్తమగతిని బొందెదరు. గుర్తింపనిచో జగన్నాథ రథముక్రిందబడి నలగిపోయెదరు.

---

# 35 వ కిరణము

## —* సింహావలోకనము *—

(1) వర్ణరసాయనిక శాస్త్రము (Chromo - Chemistry) వలన ప్రపంచమునందు మొదటితూరి యూహాపైగాక సత్యముపై వైద్యవిధాన మేర్పడినది. (2) వైరూప్యౌషధ, జల, విద్యుచ్ఛికిత్సల కన్న నిది సునిశితమై చూరకారుశక్తి గలిగినది. (3) ఎఱుపురంగువలన శుద్ధరక్తమభివృద్ధి యగుననుట, యెఱ్ఱధాతువులుగల మందుల వాడుటవలననే గాక రక్తకాంతితో జేసిన చికిత్సతోడను సిద్ధాంతమైనది. (4) అత్యుద్రేకముఁబొందిన తత్వములకెఱుపువర్ణము అపాయమైనది. (5) వర్ణరసాయన శాస్త్రమును బట్టినను, పసుపుధాతువులు గల యోషధుల శక్తులనుఁబట్టి చూచినను, పీతకాంతితో జేసిన చికిత్సనుబట్టి చూచినను, విపీతరక్తముతో (Orange) గాని రక్తముతోగాని కలసిన పసుపువర్ణముచే, నాడులయందు దుద్రేకముగలుఁగునని గుర్తింపఁబడినది. విరేచనకారు (భేదిమందు)లయందు పసుపు ప్రధానమైనది. రక్తము, విపీతరక్తవర్ణములు తగుమాత్రముగ గలసిన

పసుపురంగు ధాతువులుగల యోషధులు మేదోద్దీపనమును, వాంతులను, మూత్రాధిక్యతను, స్వేదమును గలిగించును. బల వర్ధకములగు యోషధులయందిది ప్రిధానవర్ణము. రక్తమునకు యెఱుపు వర్ణమును దెచ్చునట్లు జేయుట (కందునట్లుజేయుట) చురుకును గలిగించుట నిదిజేయును కాని, రక్తవర్ణము సమర్థతర మైనది(6)రక్తము, నాడులును దేక్రించియున్నపుడిదివాడదగదు. సంధి, అతిసారము నిద్రిలేమి మొదలగువానియందిది వాడ తగదు. విషములందిది ప్రిధానవర్ణము. (7) ఊదా, నీలి మందు, నీలి వర్ణములు చలువజేయును. నరములకు బలము నొసంగును. నాడుల యుద్రేకము నడంచును. నాడులను సౌమ్య పఱచును. తాపముల బోకార్చును. అందూదా వర్ణము నాడులయందలి యుద్రేకమును, నీలము రక్తము నందలి యుద్రేకమునుఁ బోగొట్టుటకుఁ బ్రిత్యేకముగా సమ ర్థమైనవి. ఇది వర్ణరాసాయనిక శాస్త్రమువలననే గాక, యీవ ర్ణపు ధాతువులు గల యోషధులయొక్క గుణపరిశోధనలవల నను, నిదేవర్ణకాంతితో జయప్రిదముగాఁ గుదిరిన యనేక రోగ నివారక వృత్తాంతముల వలన సయితము స్థిరపడినది. (8) రోగపదార్థము కాలికమగు వాతలక్షణములు గలిగి యున్నప్పుడీ వర్ణము లుపయోగించుట యపాయకరమైనది. నిషేధకరమైనది. కాలికమైనట్టియు, చచ్చు, పక్షవాతము మొ॥ వ్యాధులకును నీవర్ణము లనుపయోగములు. అపాయ కరములును (9) వివిధవర్ణములనుఁ బ్రియోగించిననేఫలితములు గలవో వర్ణారోపితము జేసిన యాయాపదార్థముల యందు

సయిత మాశక్తి యుండును. ఇట్లనేక రోగములయందుఁ బ్రయోగించి సిద్ధాంతము జేయుట హైనది. (10) మానవునకును, ప్రకృతికిని శుద్ధసూర్య కిరణ ప్రసారమే మంచిది. దాని వలన దేహతత్వము బలపడును. ముఖ్యముగా చర్మము బలపడును. ఉష్ణఋతువుల యందు ముఖ్యముగా దేహమునందు ద్దీపనఁగలిఁగి రోగనివారణ మగును. గ్రంథులు శీతములు మొదలగున విద్దానిచే బూర్తిగాఁ గుదుర్పఁబడినవి. (11) గండమాల, రక్తక్షీణత, పాండువు, క్షయ, మానసిక నిమ్నత మొదలగు నసంఖ్యాకములగు వ్యాధులు సూర్యకాంతి తగులని వారికిఁ గలుఁగును. (12) వడదెబ్బ, కన్నులవేడి మంటలనంటి వేడిమెక్కిన మెదడు గల రోగులకు వేడి సూర్యకాంతిగాని యుష్ణ వర్ణములనుఁ గాని వాడుట అపాయకరమైనది. (13) రంగుయొక్క చిక్కదనముఁబట్టి దాని రోగనివారక శక్తియుండదు. అందుండి సూర్యకాంతి యెంతయధికముగా వ్యాపించునో దానినిబట్టి యందలిశక్తు లుండును. చిక్కనినీలి యద్దమునందుండి కన్నపలుచని నీలియద్దమునం దెఱుపువర్ణము తక్కువగానుండి యెక్కువచల్లదనము నొసంగును. ఎఱుపు వర్ణ మత్యుష్ణవర్ణమేమైనను, నందుఁడి సూర్యకాంతి ధారాళముగా వ్యాపింపనిచో విపీతరక్తము (Orange) పీతవర్ణము లొసంగు వేడినిసయిత మది యొసంగఁ జాలకఁబోవును. చెప్ప వచ్చినదేమనిన అద్దమునందుండి వ్యాపించుకాంతి యొక్క న్యూనాధిక్యతలఁబట్టి యదిజేయు గుణములును మారుచుండును. (14) మత్తుమందులందెల్ల శీతవర్ణ ధాతువులేగాక,

యుష్ణవర్ణ ధాతువులు సయిత ముండును. గాన వానివలన మొదట నాడుల కుద్దీపన గలిగినను, తరువాత నాడులు కృంగును. నాడు లుద్రేకించి నిదుర కలుగనిస్థితిలో నీలము, ఊదావర్ణములవలన నిద్దుర గలుగును. నాడుల యుద్రేకము తగ్గును.

(15) ఆదిత్య పేటిక (Thermolume) మిక్కిలి శక్తివంతమైన పనిముట్టు. దీనితో దేహమునకంతటికిని యొకేతూరి సూర్యకాంతిని బ్రసరింపజేయవచ్చును. అవసరము వెంట యేవర్ణ మెచ్చోట నవసరమగునో నచ్చట యావర్ణమే వచ్చునట్లు యేర్పఱుప వీలగును. బలమును, శుద్ధిని, జేయు స్వేదోపకరణముగా నిది యుపయోగించును. దీనితో జేయుచికిత్సలో పూతినాశక శక్తి గలదు.

(16) వర్ణకేంద్రీకరోప కరణము (Chromo - disc) వర్ణపుకుప్పె (Cnromo - lens) ల వలన సూర్యకాంతిని కేంద్రీకరించి వర్ణములు జేర్చి యవసరమగు భాగములకు దైశికముగా కేంద్రీకృతవర్ణమును బ్రయోగింప వీ లగును. దీనివలన రోగనివారణము త్వరితముగా నగును.

(17) తాపము, జ్వరము, నాడీయుద్రేకము, వేడిమి, నీరసము, బలహీనత మొదలగువానికి నీలి, యూదా యద్దములగుండ బ్రసరింపజేసిన చల్లదనము నొసంగు సూర్యకాంతి నుపయోగింప వలయును. ఎఱ్ఱనికాంతి బ్రసరింపజేసిన శుద్ధ రక్తమునందును, విసీలరక్త (Purple) కాంతివలన నాడుల యందలి రక్తమునందును, జీర్ణమండలమునందును, చైతన్యము గలుగును.

పసుపు, నారింజ, రక్త కాంతులనుఁ బ్రసరింపఁజేసినచో నాడులయందు చైతన్యము గలిఁగి, మొద్దుబారిన ప్రేవులు, మూత్రపిండములు, శ్వాసాశయములువీనియందునుద్దీపన గలుగును. శీతముచే చచ్చుబడిన భాగములం దీవర్ణములచే నుద్దీపనగలుఁగును. మైలతుత్తము (Cuprosulphate) వంటి పలుచని నీలి కాంతి సుశీతలమైనది. చెజిసగము తెల్లనియద్దములతో జేర్చి నీలికాంతిని బ్రసరింపఁ జేసినచో నందు కేవలము నీలికాంతి యందు కన్న యుష్ణ ముండును. కేవలము తెల్లనికాంతి దీని కన్నను వేడిని జేయును. విపీతద్విరక్త (Orange-red) కాంతి యన్నిఁటిలోనికి నత్యుష్ణమైనది. చెజిసగము తెల్లనియద్దములు జేర్చి వాఁడినచో కేవలము తెలుపునకన్న నుష్ణతరమును విపీత ద్విరక్త కాంతికన్న శీతలతరమును నగు శక్తి గలుగును. వివిధవర్ణపు కుప్పెలయం దుంచిన జలము రోగనివారకమైనది. అద్దములు లేనియప్పుడు పలుచనిరంగు వస్త్రములనైనను వానికి బదులుగా వాడుకొనవచ్చును. ఆయా వర్ణ సిద్ధాంతముల నను సరించి దుస్తులు ధరింపఁదగినవి.

(18) ఆయావర్ణములకును; తెలుపుతో చేరినట్టియు, చేరనట్టియు నగు వర్ణములకును గల గుణవిభేదమును గుర్తించి తిమిగఁదా. వివిధమగు వర్ణముల స్వభావమొక్కటిగనే యుండుననియు, యొక్కొక్క వర్ణమున కొక్కొక్క ప్రత్యేకస్వభావము లేదనియు, జనులు దలంచుచున్నారు. అనగా మానవ నేత్రానందమునకై దక్క భగవంతుఁడు వివిధ వర్ణములను నిరుపయోగముగా సృష్టించినాడని వారిభావము.

(19) నిర్వికల్పమగు సత్యముపై నాధారపడియున్న వర్ణ చికిత్సను దుమ్ము తూరుపారపట్టునట్టి వైద్యులును, సూర్యునిపై దుమ్ము పోసినవారిగతినే పొందెదరు?

సృష్టియం దత్యుత్తమోన్నతిని బొందిన మానవునకు సూక్ష్మధాతువులగు వెలుఁగు,వర్ణము నను వానిచే జికిత్సించుట స్వాభావికమును, న్యాయమును, నై యున్నది. వానియందలి స్థూలభాగ మాహారాదులచే నేర్పడుచున్నది. మందులే వాడవలయుచో శుద్ధమగు మూలికలనే వాడవలయును. ఏస్వభావముగల మూలికల నాస్వభావముగల రంగు కుప్పెలలో జాగ్రత్త చేయవలయును. వర్ణచికిత్స యొక్క వివరములు మందు వైద్యులకు దెలియదుగాన కొలఁదివివరముల నిచ్చుచున్నాను. క్షారములు (alkalies) విరేచనకారులు, భేదిమందులు స్వేదకారులు, వాంతికరములు, మూత్రకారులు, యుద్దీపనకారులు నగు మూలికలను పీత, విపీతరక్త, రక్తవర్ణపు కుప్పెలలోను; ఆమ్లములు (acids) చలువజేయునవి, సౌమ్యకారులు, భేదులను, వాంతులను దగ్గించునవియు నగు మూలికలను, నీలివర్ణపు కుప్పెలలోను నిలువజేయుట మంచిది. అట్లు చేయుటవలన నందలి మూలికలపై కుప్పెలయందలి వర్ణము వ్యాపించి వానికి నైశిత్యమును గలిఁగించును. వాని శక్తియు నభివృద్ధియగును. సూర్యకాంతిగాని, విద్యుద్దీపముగాని, గ్యాసు లైటు కాంతిగాని, ప్రతిదినమును కుప్పెలపైఁ బ్రసరింపఁజేయుచో నందలి మూలికలయందలి శక్తి యభివృద్ధియై, నైశిత్యము, శాశ్వతత్వము, చొరబారు స్వభావము వృద్ధియగును.

ప్రౌఢపరిభాకరము యొక్క రెండవభాగము ముగిసినది.

# సూచన

వర్ణ (సూర్యకిరణ) చికిత్సావిధానమును గనుగొనిన డాక్టరు ఇ. డి- బ్యాబిట్, యల్. యల్. డి., యం. డి. గారి గ్రంథములలో 'ప్రిన్సిపల్సు ఆఫ్ లైట్ అండ్ కలర్ (Principles of Light and Color) అను గ్రంథము మిగుల ప్రౌఢమైనది. ఇక్కాలపు వైద్యులలోను రోగులలోను ననేకులు సిద్ధాంతభాగముకంటె చికిత్సాభాగమునే ముందుగ దెలిసికొన కుతూహలురై యుండుటవలన ప్రప్రథమమున పైగ్రంథముయొక్క 6వ అధ్యాయమగు క్రోమో తీరాప్యూటిక్సు (Chromo - therapeutics) అను చికిత్సాభాగమును ప్రౌఢపరిభాకరమను పేరిట నాంధ్రీకరించి రెండు భాగములుగ బ్రకటించితిమి. పాఠకులు గ్రంథమందలి పారిభాషిక పదములు వాక్యములు వీని యర్థముగాని చికిత్సాపరికరముల నుపయోగించు విధముగాని బాగుగ దెలియకుండినచో గ్రంథమందలి పుటను పంక్తిని బేర్కొనుచు రు 0—1—0 పోస్టేజి స్టాంపును బంపుచు శ్రీ పుచ్చా వెంకటామయ్యగారికి (దంతలూరు అగ్రహారము, పిడపర్రు పోస్టు, తెనాలితాలూకా, గుంటూరుజిల్లా) ఒకజాబు వ్రాసిన విపులమగు సమాధానమును బడయగలరు.

హెల్తు అండు పవర్ (Health and Power) అను నమూల్యమగు చిన్ని గ్రంథము ప్రౌఢపరిభాకరముయొక్క తృతీయభాగముగ బ్రకటింపబడును. —ప్రసం.

## ఆరోగ్యవిషయిక గ్రంథములు

1 ఆరోగ్యాదర్శము, 2 స్వాభావిక చికిత్సానియమములు, 3 ప్రకృతి చికిత్సా ఉపన్యాసములు, 4 బాలక్రీడలు, 5 శిశు మాతలకు సందేశము, 6 ఆరోగ్యము - కామేచ్ఛ, 7 దీర్ఘాయువు, 8 సుఖప్రసవం, 9 పురుటాలు. 10 ప్రకృతి ఆరోగ్యవైద్యం.

## వివిధచికిత్సా గ్రంథములు

1 ప్రకృతి గృహవైద్యము, 2 దీర్ఘరోగ చికిత్సాసారము, 3 జాగరణ చికిత్స, 4 ప్రాకృత చికిత్సార్ణవములు, 7 భాగ ములు, 11 ఉపవాస చికిత్స, 12 జస్టుచికిత్స, 13 ధ్యాన చికిత్స, 14 జంబీరచికిత్స, 15 యోగచికిత్స, 16 సంవాహన చికిత్స, 17 రక్తప్రక్షాళన చికిత్స, 18 వైదికచికిత్సాపద్ధతి, 19 నిశ్శస్త్రశరీర పరిశోధన, 20 క్షయ, 21 శుక్లనష్టము.

## వేదాంత గ్రంథములు

1 యుక్తిప్రకాశము, 2 రామతీర్థస్వామి వేదాంతోపన్యాస ములు రెండు భాగములు, 4 మహాయోగము, 5 నిర్విచార జీవనము, 6 అనుభవ యోగాభ్యాసము.

పైన వివరింపబడిన గ్రంథములే కాక, 1919 సంవత్సరమున స్థాపింపబడి నిర్విఘ్నముగ నడుపబడుచున్న ప్రకృతి పత్రిక వెనుకటి సంపుటములుకూడ వెలకు దొరకును. పూర్తివివర ములుగల కేటలాగునకు వ్రాయుడు.

## ప్ర కృ తి ప త్రి క

ప్రతినెల 1 టవ తేదీ వెలువడు సచిత్ర సహజవైద్య మాసపత్రిక.

సంవత్సరచందా మూడు రూపాయలు మాత్రమే. చందాదార్లకు ప్రకృతి చికిత్సా గ్రంథములు తగ్గింపు ధరలకు ఇవ్వబడును.